# THE Kondaveeticharitram

## A MIXED TELUGU POEM

IN

FOUR CANTOS.

BY

MADDULAPALLI GURUBRAHMAM,

TALUK CLERK,

NARSARAOPETT, GUNTUR DISTRICT.

FIRST EDITION.

Madras:

PRINTED AT THE ANANDA STEAM PRESS.

1907



*Price* 8 *As.* (*exclusive of postage.*)

శ్రీరస్తు.

శ్రీమత్కోదండ రామాయనమః.

శ్రీమజ్జగత్ప్రాణతనయ వరప్రసాదలబ్ధ కవితాసంకలితుండగు

మద్దులపల్లి-గురుబ్రహ్మశర్మచే రచియింపఁబడిన

# శ్రీకొండపీటి చరిత్రము.

పద్యకావ్యము.

ఇది

పుణ్యపురుషకదంబ సహాయముచే

చెన్నపట్టణము

ఆనంద ముద్రాక్షరశాలయందు ముద్రింపించి

ప్రచురింపఁబడియె.

1907.

వెల 8 అణాలు, (తపాలుకూలి గాక)



మద్దులపల్లి గురుబ్రహ్మశర్మ, గ్రంథకర్త.

Ananda Press, Madras.

శ్రీరస్తు.

# అవతారిక.

అఖండ మహీమండల మండనాయమానంబగు హిందూభూమండలము బహుకాలమునుండి భగవదంశసంభూతులగు పెక్కుమంది నృపతల్లజులచేఁ బాలింపఁబడుచున్నది. అట్టివారిలోఁ గలియుగాదివరకుఁ గల రాజులనుగూర్చి పూర్వమున వేదవ్యాసుండు పురాణరూపకముగ వివరించియున్నాఁడు. అందు కాలనిర్ణయాదులు లేకున్ననవియెల్ల నెల్లఱకు నిహపరసాధనోపాయములును నీతిబోధకములునై యున్నవి. తదుపరి గల రాజన్యుల వృత్తాంతముల నెవరును బ్రకటింపమి నవియెఱుంగ దుస్తరము. అయిన నీకాలమున మహాఘనతజెందిన యాంగ్లేయప్రభువుల కృపాతిశయమున రమారమి 1000 సంవత్సరములనుండి గల హిందూ భూపతుల చరిత్రములు బయలుపడి ప్రసిద్ధినొందియున్నవి. ఇది యెంతయు సంతసనీయము. అయినను మనదేశీయులకు చరిత్రాదులు వ్రాయునాచరము బొత్తుగా లేనేలేదని నిరాకరించుటకు వలనుపడదు. ఎట్లనిన మనదేశమునఁ గొన్నికొన్ని స్థలములందు దండికవిలెలు (దేశచరిత్రములు) పూర్వులు వ్రాసియుంచినట్లును అందుఁ గొన్నికొన్ని వివిధకారణములచే నశించుచున్నట్లును వినుచున్నారము. ఇట్లగుటకు కారణమేమన "శ్లో॥ పుస్తకంవనితా విత్తం పరహస్తంగతంగతం, అథవాపునరాయాతం జీర్ణంభ్రష్టాచఖండశః." అను లోకప్రతీతిని మదినిడికొని మిగులభీతచేతస్కులై సంగతి సంతర్భములఁ గనిపెట్టకఁ దమకడఁగల పురాతనగ్రంథములఁ బరులకీయకను, భద్రపరుచునూహాలెఱుంగకను ప్రచురించినచోఁ దమకడ గ్రంథములుండినపుడుండు గౌరవము గ్రంథములులేకుండినఁ దగ్గుననియును మొదలగు వెఱ్ఱితలంపులచే మనవారిలోఁ గొందరు పూర్వనిర్మితములగు బహుగ్రంథములను శ్వేతపిపీలిక పావకాదుల కర్పించుచున్నారు. ఇది మిక్కిలి చింత్యముకా

దె. ఆంగ్లేయ ప్రచురిత చరిత్రాదులందు వి స్తరించి యు త్తర హిందూస్తా
ప్రభువులనుదక్క దక్షిణహిందూస్థాన పాలకులఁగూర్చి చెప్పబడకుండుటచే
మధ్య దేశ్యులు దమపూర్వప్రభుచరిత్ర లెఱుంగ నిచ్ఛగలిగి యాంగ్లేయ
ప్రచురిత చరిత్రలకు మిక్కుటము తృప్తినొందకుందురని తోఁచెడిని
ఇట్లుండ 1898 సం॥ ప్రాంతములందు గుంటూరు మండలములోని నర్సా
రావుపేటకు రాజకీయోద్యోగము(డిప్యూటి కలెక్టరు)వహించియరుదెంచిన
బ్ర-మ-రా-రా-శ్రీ జయంతి రామయ్య పంతులు (బి.ఏ.,బి.ఎల్.) గారి
యనుకంపచేఁ బ్రాచీనములై యంతరువులుపడి మూలలడాగియున్న చరి
త్రములలో కొన్ని బయలుపడినవి. ఇందువలన మనకు మన దేశ ఘనత
నెఱుంగ నవకాశముగలిగినది. ఇందులకు మన మెల్లరము కృతజ్ఞులమై యు
న్నారము. ఆకాలమున గుంటూరుజిల్లా వినుకొండతాలూకా తిమ్మాపురా
గ్రహారపతులగు బ్ర-మ-రా-రా-శ్రీ భాస్కరుని సీతారామయ్య,గోపాల
రాయుడు గార్లవలన నొసంగబడిన యాకొండవీటిచరిత్రము "కొండవీటికై
ఫియ్యతు" అను పేర తెలుగువచనమున కాలనిర్ణయములతో వ్రాయ
బడియున్నది. దీనిని మేమెల్లరముగాంచి సంతసించితిమి. ఇది పద్యకావ్య
రూపకముగనుండిన మేలని స్నేహితులుసెప్ప వినుకొండ నివాసియగు
మద్దులపల్లి గురుబ్రహ్మ శర్మనుగమమగుశైలిని ననవసరవర్ణన కల్పనాదు
లుచేర్చక వచనకావ్యగత చరిత్రము మాత్రము నాలుగాశ్వాసములుగ
వ్రాసెను. ఈగ్రంథకర్త శ్రమించి విస్తరముచదువకపోయినను బుద్ధికుశ
లతచేతను, సాంగత్యోపయోగముచేతను కొంతపాండిత్యమును సంపా
దించి యీగ్రంథమును వ్రాసెను. ఈయనసాహిత్యమునందుగాక సంగీత
మునందును కొంతప్రవీణతఁబడసి స్వయముగాఁ బాడ నేర్చి ధ్రువోపా
ఖ్యానమును, గజేంద్రమోక్షణంబును యక్షగానరూపకముగ (హరికథ
శైలిని) వ్రాసినాడు. కావ్యదోషాదోషములఁగూర్చి విమర్శింతమన్నచో
" కాళిదాసమయూరాది కవులకైనఁగలవు తప్పులనంగనన్యులకులేవె " అని
కాను నూర్యప్పకవిగారు నుడివినరీతి నెల్లరకును నేదియో యొకలోపమైన
నుండకపోదు గాన నావిషయముకు కవులకువదలి యిక చరితాంశమునకు

వ త్తము. ఇందలికాల సంఖ్యలన్నియు శాలివాహన శకవత్సరములం దె లుపఁబడినవి. దీనికి 78 కలిపిన హూణశకవర్షము తెలియును. ఇందు ప్రథమాశ్వాసమున నీకొండవీడే విదర్భదేశ ముఖ్యపట్టణమగు కుండినమనియు నిందు భీమభూపాలుడును భీష్మకుడును ప్రభుత్వ మొనర్చిరనియు దమయంతికిని రుక్మిణికిని జన్మస్థానమనియు వ్రాయబడినది. ఇదిసంశయాస్పదవిషయమైయున్నది. ఎట్లనిన హైదరాబాదునకు నుత్తరమునగల బీడర్ దేశమే విదర్భయనియు దానికి ముఖ్యపట్టణము కుండినముగలదనియు "Madras Manual of the Administration" ను బట్టియు మఱికొన్ని నిదర్శనములనుబట్టియు కనుపట్టుచున్నది. ఈకొండవీడు త్రిలింగక్షేత్ర (ఆంధ్రమండలము) మధ్యనుండుటంచేసి యిది కుండినముకాదనుటకు సందియ ముండదు కాని యిది కుండినమని లోకప్రతీతిమాత్రము చిరకాలమునుండి వచ్చుచుండుటయేకాక పెక్కుదండకవిలెలలందును వ్రాసియున్నది. గ్రంథకర్త యీనిదర్శనముల కొప్పుకొనుచూఁ దాను జేకొనిన మాతృకయందుండుటచే నిట్లువ్రాసితినని చెప్పుచున్నాఁడు గాన నీవిషయమున నీకవి యాక్షేపణార్హుఁడుకాడని నాయభిప్రాయము. ఇది మనదేశమున బహుకాలము ప్రభుత్వసామ్రాజ్యమువడసి మిన్నయగు వన్నెకెక్కిన కొండవీటి చరిత్రమగుట వినవినదేశ్యులకు నుత్సాహకరముగాను నానందప్రదముగాను నుండకమానదు, కావున నెల్లరును స్వదేశ చరిత్రాభిమానమును వహించి మనకడనశింపుచున్న చరిత్రములను బయలుపఱిపించి దేశౌన్నత్యమును ప్రకటింపనియ్యకొని పూర్వుల పరిశ్రమల నిరర్థకములుగాకుండ చేయుదురని కోరుచున్నాను.

ఇట్లు, సుజనవిధేయుడు,
గబ్బిట లక్ష్మీనరసింహం,
హెడ్‌క్లర్కు,
పల్నాడు తాలూకా.

గురిజాల
1-10-1906.

# విషయసూచిక.

## ప్రథమాశ్వాసము.

## ద్వితీయాశ్వాసము.

## తృతీయాశ్వాసము.

శ్రీరస్తు.

శ్రీమత్కోదండరామాయనమః.

# శ్రీకొండవీటిచరిత్రము.

## ప్రథమాశ్వాసము.

శ్రీపద్మాంశజయైన భూమితనయన్ జిన్మాద్రికాలత్ర్యసం
ధాపాణిన్ శిరమందుఁ జేర్చి విలస త్తత్త్వంబుబోధించుమే
ధాపూతక్రియఁ గొండవీటి విభుగా ధల్ దెల్పఁగాఁ బూనుస
ద్రూపున్ భక్తినుతించెదన్ శ్రుతికుభృత్కోదండరామప్రభున్.

### శివస్తుతి.

మ. స్తుతియింతున్ నిజపాదపద్మయుగళ స్తోత్రప్రసంగాభిసం
గతహృత్ప్రీత సుపర్వపారిషదము ఖ్యస్వీయభక్తాగ్య్రస
న్నుతయోగాఢ్యనగేంద్రజాహృదయ ప ద్మారామసీమార్యమున్
సతతప్రాంచద భంగమాళితలభా స్వత్సోమునిన్ సోమునిన్. 2

### బ్రహ్మస్తుతి.

మ. నలుమోముల్ శ్రుతినాదసంకలిత వి జ్ఞానస్వరూపంబులై
పొలుపొప్పన్ సురరాజకాగమవిధుల్ బోధింపుచున్ బంకజా
తలసత్పీఠి సరస్వతీయువతిఁ జే తఃప్రీతితోఁ గూడిని
స్తులలోకాళిసృజించు పద్మజు నుతిం తున్ భక్తిన్ప్రశాంతమున్. 3

### లక్ష్మీస్తుతి.

చ. కొలచెదఁ జిల్కపల్కులనుఁ గుల్కుల బెళ్కులనాథు సెజ్జపైఁ
గలసిరహాస్యవర్తనలఁ గౌఁగిలినానుచు నొక్కసంశయం

బలవడఁబడ్డయైనతను ఽ నాస్తఁగనుంగొన వైరమంచునీ
వలపలికన్నుమూయుమని ఽ వారిజనాభుని వేఁడునిందిరన్. 4

### పార్వతిస్తుతి.

సీ. సతతసంరక్షిత ఽ సాధుభక్తకదంబ శోభితానల్పతే ఽ జోవిడంబ
నిరతవామాంకసం ఽ దీపితహేరంబదితిజాతహననప్ర ఽ థితకదంబ
అబ్జజాండస్థలో ఽ కాళిమూలస్తంబ స్మరకేళికాపరి ఽ స్ఫురితసాంబ
సైకతవేదికా ఽ సదృశచారునితంబ అధరాధరితసుధా ఽ మధురబింబ.
తే-గీ. మందహాసవిలాసాస్య ఽ నిందమాన
సుందరానందకందళి ఽ తేందుబింబ
శంబరారాతిభిన్మన ఽ స్సారసావ
లంబకోలంబశ్రీజగ ఽ దంబఁ గొలుతు. 5

### సరస్వతిస్తుతి.

చ. తనపతిచెంతఁ జేరి విత ఽ తప్రమదప్రదమావిపంచికా
స్వనమలరారరాగముల ఽ సస్వరయుక్తిఁ బఠించి మూర్ఛనా
కనదురుశబ్దగౌరవము ఽ గన్పడ మేలములన్ బొదల్చునా
వనరుహయోని రాణిశుక ఽ వాణిపురాణి భజింతునిచ్చలున్. 6

### విఘ్నేశ్వరస్తుతి, త్రిప్రాసము.

మ. గణనాథున్ మదగంధలుబ్ధమధుపా ఽ క్రాంతేభరాడ్వక్త్రు గో
గణనాథాశ్వతనూజునప్రతిమ వి ఽ ఘ్నధ్వాంతభానున్ మరు
ద్గణనాథార్చితపాదపీఠు శ్రుతివి ఽ ద్యావేదితున్ వాతభు
గ్గణనాథప్రథితోపవీతుఁ గొలుతున్ ఽ గళ్యాణగర్భస్తుతున్ 7

### హనుమస్తుతి.

సీ. తనశైశవహరిత్వ ఽ మునకలయరుణబింబంబొకయరుణబిం ఽ బంబుగాఁగ
తనమహాబలగుణో ఽ ద్ధతికలతరణిమార్గంబొకతరణిమా ఽ ర్గంబుగాఁగ
తనఘనవిస్రంభ ఽ మునకలసురసజసంభణమొకసురసజ్జృం ఽ భణముగాఁగ
తనవచోమృతవర్షమునకలరామమానసమొకరామమా ఽ నసముగాఁగ
తే-గీ. ననమకరుణాసుధారస ఽ ప్రసరమస్నణ

భసల నిరసనసుందరోల్లసితనయన
విస్ఫురత్కటాక్షములు నలుదెసలఁబర్వ
శ్రితతతులఁ బ్రోచు హనుమంతు మతినుతింతు. 8

శంకరాచార్యస్తుతి.

శా. విద్వద్వందితుఁడాగమార్థకృతసంవిత్ప్రోక్త భాష్యాదిసం
పద్విభ్రాజితమానసుం డఖిలసన్న్యాసప్రభావాధికుం
డద్వైతార్ణవపూర్ణిమామృతకరుం డై యొప్పు శర్వాంశజాం
చద్వేషున్ భజియింతు నిచ్చలుమదిన్ శ్రీశంకరున్ శంకరున్. 9

గురుస్తుతి.

ఉ. వేమరుభక్తిఁగొల్చెదఁ బవిత్రచరిత్రుసుపాత్రుమద్గురు
స్వామినితత్త్వమార్గవిచారపరాయణు ముక్తికారణున్
తామసచిత్తమోహఘనతామసభేదసరోజమిత్రుదా
క్ష్వేములపావనాన్వయసరిత్పతిచంద్రుని లక్ష్మణేంద్రునిన్ 10

సంస్కృతకవిస్తుతి.

పంచపాదిసీసము, క్రమాలంకారము.

సీ. ఎవనివాక్ప్రౌఢిమం బెఱిఁగించె ముందుగా శ్రీరామకథ లెల్లతీరుగాఁగ
నెవనివాగ్వ్యాప్తి చెన్నెఱిఁగించె శ్రుతిశబ్దబీజాళికందుర ప్రాజిగాఁగ
నెవనివాఙ్మధురిమ యెఱిఁగించె రఘువీరునకు నవవ్యాకరణజ్ఞుఁగాఁగ
నెవనిదివ్యకవిత్వ మెఱిఁగించె నాటకఘటనాపటుత్వముత్కటముగాఁగ
నెవనివిద్యాపణం బెఱిఁగించె భువనేశ్వరినిత్యమేవాహ మంచనుటఁగాఁగ.

తే-గీ. నెవనికృతికలి నుడివెనుత్కృష్టుఁగాఁగ
నెవనినుతిఁ జేసె మిహిరుని హితునిగాఁగ
జోకఁదత్కవుల నుతింతు నాకుభవుని
వ్యాసు, హనుమంతు భవభూతి ననఘు కాళి
దాసు శ్రీహర్షును మయూరు తత్త్వధీరు. 11

ఆంధ్రకవిస్తుతి.

సీ. వాగనుశాసను వాగ్విలాసముఁ గుండలీంద్రుఘోషపదని స్తంద్రవైభ

వసుఁ బ్రబంధపరమేశ్వరు ప్రసాదత్వము సోముకళావాప్తి భీముపాకె
గుణము భాస్కరు కాంతి గుప్తియు శ్రీనాథకవి రసపోషణ గణుతిసహజ
పాండిత్య కవివర్యు భావప్రాప్తి మలయమారుతుని మాధుర్య శైత్యత
తే—గీ. వరపు వేంకటపతియర్థ బలము పెద్ద [యుగణప.
నార్యు నౌదార్యతయుఁ దాత యార్యసుకవి
హవవృష్టియుఁ గాకునూ ర్యప్పకవి వి
శేషలక్షణవృత్తసుస్థితి నుతింతు. 12

## కర్తృవిజ్ఞప్తి.

క. ఆరయఁ దత్ఖండంబుల, దారచి తేజమిడు పారదము క్రియ నస్మ
త్కారితమగు నీకబ్బము, ధీరులు గరువమున గనన నుతింతును భక్తిన్. 13

## కుకవినుతి.

క. భూమిం బండితవరులను, బామరులుగఁ బామరులనుఁ బండితులుంగా
నేమింపుచు నాత్మస్తుతి, కామము పరనింద సేయు ఘనుల నుతింతున్. 14

వ. అని యిష్టదేవతావందనంబును, సుకవినికర నమస్కృతియును, సర్వ
సుజన విజ్ఞప్తియును, కుకవినుతియును, గావించి మదియాన్వయ ప్రభు
తా విశేషాభివర్ణ నాయత్తచిత్తంబున నస్మద్వంశ ప్రశంసమంబభిన
యించెద. 15

## కర్తృవంశావతారము.

ఉ. శ్రీమహిత ప్రభావమునఁ జిన్మయుఁడై జగదేకరక్షణా
క్షేమగుణాభిరాముఁడయి క్షీరపయోధి వసించి దేవచిం
తామణియై చరాచరవితానమయాకృతి గాంచి మించు నా
స్వామి సునాభికంజమున స్రష్టసముద్భవ మొందె బొందుగన్. 16

క. ఆపద్మజముఖమున స, ద్వ్యాపారులు విమలమతులు బ్రహ్మఋషుల్ ని
ర్లేపకులఖిలతపోని, ష్ఠాపరులుద్భవిలిరధిక సాత్త్వికులగుచున్. 17

ఉ. ధన్యచరిత్రులై పరగు తద్ద్రుషిపుంగవులందు దేవతా
మాన్యుఁడు దివ్యయోగబల మండిత పండిత వందితుఁడు కౌం
డిన్యుఁడ ఖండతేజుఁడు తృణీకృతకిల్బిషుడై మహాతపో

ధన్యతనొప్పుచూనిజన । తాభినుతాఖ్యలితాత్మతత్త్వుఁడై. 18

శా. ఆకౌండిన్యమహామునిప్రవరగో । త్రాంభోనిధిన్ శీతభా
న్వాకారంబున సత్కళాభివినుతం । బై వైదికాచారస
చ్ఛ్రీకంబై తెలగాణికాహ్వయముచేఁ । జెన్నొందునిర్దోషతన్
జోకన్ మద్దులపల్లి వంశమఘరా । శ్యున్మూలనోత్తాలమై. 19

క. ఆవంశంబునఁబొడమెను, శ్రీవరసేవాభివినుత । శీలుఁడుపరవి
ద్యావర్ధిష్ణుండుమనీ, షావిజితఫణీశుఁడొప్పు । జయకృష్ణుఁడనన్. 20

సీ. అతడన్నిభంగుల । నౌన్నత్యమువహించిభూసురసభలసం । పూజ్యుఁడయ్యె
యైనరపాలకా । స్థానంబులజయించి బహుళబహూకృతి । భాజియయ్యె
యైయాత్మతనుపోష । ణార్థమైగుణమణి పేరమాంబనుబ్రేమఁ । బెండ్లియయ్యె
యైసర్వసుఖసంప । దభివృద్ధిధర్మప్రవృత్తి సంతతకృత । కృత్యుఁడయ్యె

ఆ. యైవినీతియుక్తి । ననమానవిద్వాంసు
రఘుపతినిభసత్త్వ । రాజితాత్ము
నఘవిదూరునవ్య । యానందభరితుని
రఘుపతీంద్రుఁగనియె । మఘవసదృశు. 21

క. ఆగుణిసతతాతిథ్య, భ్యాగతపూజానురక్తుఁ । డై పుడమినిఁదా
ధీగణ్యావేతృకత్వత, నాగురుధిగణాపి శేషుఁ । డనఁజెలువుందెన్. 22

మ. ఘనుఁడై త్రావలయావృతస్ఫుటసమా । ఖ్యన్ మించి ప్రాంచత్తపో
ధనవిభ్రాజితలక్ష్మమాంబయనుకాం । తన్ దారగాదానుగై
కొనివిద్యాపదపట్టభద్రుఁడయియ । క్షోధాత్ములన్ సత్యవ
త్తనులన్ జెంచయశాస్త్రిసుబ్బయలమో । దంబొప్పఁగాంచెన్ దమిన్.

క. ఆపుత్రయుగంబునఁజతు, రోపాయుఁడఖండసద్గు । ణోపేతలస
చ్ఛాపానుగ్రహదక్షు, ధ్యాపకుఁడగుచెంచయార్యుఁ । డలరెనుఘనుఁడై.

పంచపాది.

తే-గీ. అమ్మహాత్ముఁడు బ్రహ్మచ । ర్యాశ్రమమున
సకలవిద్యలునేరిచి । సభ్యుఁడై గృ
హస్థవిధులెల్లసలుపఁ బ్రే । మాతిరేక

యైనపిచ్చమను ద్వాహమై చెలంగి
సుతులఁగనెముప్పురఘునయ శోభరితుల. 25

వ. హా రెవరన. 26

చ. నిరుపమసత్యశీలుడతి నిర్మలమానసుడంగజాతసుం
దర పురుషాగ్రగణ్యుఁడుఁ శ్రితభ్రమరాంబురుహుండుజ్ఞాన వి
స్తరణుఁడు వేంకటేశ్వరపద స్తుతిపాత్రహృదంతరుండువా
క్స్వరసుఁడు వేంకటప్పయరసజ్ఞుఁడనన్ జెలువొందె ధారుణిన్. 27

క. సన్నియతమానసుఁడు బుధ, సన్నుతశీలుండు బ్రహ్మచర్యాశ్రమసం
పన్నుండు రక్షితనతా, పన్నుఁడు రఘుపతి జెలంగె బ్రహ్మణ్యుండై. 28

సీ. తనమృదుకవితావిధానంబు సుప్రబంధానీకరత్నాకరంబు
తనదానధారావితానంబు యాచకచాతకాంబుదముక్త జలకణాళి
తనమోహనాంగసౌందర్యంబు విరహిణీయో
షాచకోరచంద్రోదయంబు
తనభూనభోంతరేద్ధయశోవిశేషణంబష్టదిక్కామినీ హారసమితి

తే. గాఁగఁ జెలువొందె నిజకావ్యకల్పనాతి
శయవదాన్యబహుకృతశస్తవస్త్ర
భూషణాలంక్రియాదివిశేషణుండు
అనుపముండు వేంకటసుబ్బయాహ్వయుండు. 29

సీ. అంచద్రగజుఁడు వేంకటప్పయార్యవరేణ్యుడధిక పాండిత్యుడై యతిశయిల్లి
కుసుమపరోపకారములొనర్పగ గృహస్థాశ్రమమతిశయమాకతమున
దార్వేములాన్వయోదధిపూర్ణచంద్రుడై
నప్పయార్యతనూజయై జెలంగు
పరమపతివ్రతా తరుణిసరస్వతమ్మనుగూని విభవసంపన్నుడగుచు

తే.గీ. రఘుపతి సుధీశునను గురుబ్రహ్మనామ
ధేయధరు సుబ్బరాముల శ్రీయుతలగు
సుతలనిరువుర వేంకటసుబ్బమాంబ
లలితగుణ వేంకటహనుమాంబలను గాంచె. 30

తే-గీ. మత్కనిష్టపితృండుధీ మంతుడనగ
వెలయువేంకటసుబ్బయ విభుడుకూర్మి
సుందరమ్మబత్నిగాఁగాని సుఖవిశేషు
డగుమనమనుస్వీకృతకుమారునిగ్రహించె. 3

వ. ఇట్లొప్పుచు భగవత్కృపాతిశయంబున దినదిన ప్రవర్ధమానుండనై
యుండుటయు. 32

శా. శుండాలావనపాదపద్మనతధీ తుండార్యసంభావనా
ఖండుండై తగుపోతరాజకులుఁడా కామేశ్వరాఖ్యుండు శ్రీల్
నిండన్ సత్వగుణప్రధానుఁడగుచున్ వేమూరివంశాబ్ధిచం
ద్రుండా వేంకటసుబ్బయాఖ్యసచివుం డునిస్తులై యొప్పెదున్. 33

క. క్షీరమునీరమునంగల, కూరిమిరాయంచచేతఁగొల్పోఁదగిని
స్సారమగుఁగాని మావి, స్తారహితోన్నతిఁగదల్చెదరమా నెభువిన్. 34

సీ. నిత్యనైమిత్తిక కృత్యముల్ దీరిచి దేవగోబ్రాహ్మణ సేవఁజేసి
కొంతనట్టుపురాణగోష్ఠిఁగాలమువుచ్చిమధ్యాహ్నికములనుష్టితినొనర్చి
విన్నకొండపురిని విలసిల్లుతాలూకు సభకులౌకికకార్య సరణికేగి
సాయంతనంబున సరససంగీతప్రసంగసంగతి ప్రభం జనతినూజు

తే. గీ. భవనమునఁజేరి యచ్చటఁ బ్రబలభక్తి
యుక్తిసాహిత్యగాన ప్రయుక్తిబంధ
బంధురములగు భజనలు బఱపియెల్ల
కాలయీరీతివేడ్కల గడుపుచుండ. 35

సీ. ధాత రెండవపరార్థమునందు స్వేతవరాహకల్పాహ్వభిరామసమయ
మహితవైవస్వత మన్వంతరంబునకలియుగాదిమపాద కాలకలిత
చాంద్రమానంబున శాలివాహనశకాబ్దంబులశశినేత్రవసుమృగాంక
సంఖ్యలగుల (1821) వికారిసంవత్సరంబున నుత్తరాయనమునవొప్పు

తే-గీ. ఋతువునను జ్యేష్టమాసంబుకృష్ణపక్ష [గ్రీష్మ.
మునదశమి భాస్కరునివార మునను భరణి
సాధనాఖ్యతారనుగ ర్గసాక్షిపక్ష

మాద్రికేగెడుశుభసమ । యంబునందు. 36

క. వారలఁగూడిమనోజ్ఞ విహారంబుగఁగొంతదూర । మరుగుదుమని వి
స్తారసరసప్రశంసలు, దేరగఁగుతుకమునఁబయలు । దేరగ మాలోన్.37

ఉ. ధీవరులార కొంతమతి । దేరఁ బికారికిఁబోదమయ్యయా
నావరుణాశ కేగనట । నర్కుఁడుగ్రుంకు నవాచికేగరో
షావృతశ్రార్ద్ధదేవుదెస । జక్కులరాదె నయేకపింగళా
ఖ్యావనదక్షుమాటనిటు । గాదటుగాదటుగాదుప్రాచికై. 38

వ. అని యనేకప్రకారంబుల విహితవాక్యంబులం దర్కింపు కొనుచుఁ బ్రా
గ్భాగంబునకరుగందలంచితద్రాజమార్గంబునంజనుచుండ వారలంగాం
చి నేనతికుతుక కలితమతినై కవితాప్రశంసభాషణోల్లాసమానసుండనై

చ. హరిమయమై సెలంగుజగ । మజ్జగమందున గల్గుమానవో
త్కరమున కెల్లముక్తిఫల । దంబగుదివ్యపథంబు శ్రీమనో
హరుభజనానుకీర్తనము । యాహరికీర్తనకాలవాలమై
పరగుఁ గవిత్వమాకవిత । పాపవిమోచన మెల్లభంగులన్. 40

క. దివ్యతరసుఖనిధానం, బవ్యయసంపత్ప్రదాయి । యఖిలవిబుధసం
సేవ్యమువిశ్వశ్రేయః, కావ్యమ్మని శ్రుతులుబల్కు । గాభువివినమే. 41

చ. మహిఁగలసప్తసంతతుల । మానితమై సకలార్థదాతయై
బహుళయశోవిశాలమయి । పాపనివారణ కారణంబునై
యిహపరసాధనంబులకు । నిమ్మగుచున్ నరునెల్లడన్ మహా
మహునిగ సేయునట్టిఘన । మార్గము కావ్యమెయెన్నిభంగులన్. 42

క. అనిమనవి సేయ వారలు, విని పరమానంద కలిత । విశదాత్ముకులై
ననుఁగాంచిబల్కిరీవిధ, మునన తిమృదుమధుర వాక్య । ములనాతోడన్

ఉ. మాపతిప్రాపు లేకఁదర । మా? పరమాదరమానసాంచితుం
డై పటుశబ్దభావరచ । నావచనాతతసత్కృతిన్వాని
క్షేపమటంచు నెంచిధృతి । చేమతిచేర్చి యొనర్చిరేని స
త్తాపరతంత్ర కృద్రసప । దాస్పదమాఁగదకబ్బమల్లినన్. 44

వ. అనిబల్కిన నేనును సంతసింపుచు. 45

తే.గీ. కవిత రెండు తెలుంగులై క్రాలుచుండు
నిలను సంగీత సాహిత్య ములనందు
నఖిలజనహృద్యమవ్యయ మధికమగుచు
సాహితీకృతివరలుని స్తంద్రగతిని. 46

వ. ఎట్లనిన.

మ. మును సాహిత్య నిదానగాన ఘనస మ్మోదజ్ఞసంప్రోత కా
వ్యనికాయంబుల సాహితీకృతులు విఖ్యాతంబు యొప్పంథా
త్రినిసంగీత లసత్ప్రబంధములుత్కృష్టింగూర్పవెం తేనిఁగా
వున సాహిత్యముకో విదాభరణమై పొల్పొందు లోకత్రయిన్. 47

క. మతినిట్లు దలచుచునుదివ్యతరంబుగ శరధిశయనుఁడగు శ్రీహరికం
కితముగను నాంధ్రసంస్కృత, యుతకృతిబహుమతిగఁ జేయ నుద్యు
క్తుఁడనై. 48

వ. ఉన్న వాఁడఁగాన. 49

ఉ. సర్వజనానుకూలనుఘ సంహారణంబుఁద్రిలోకపావనా
ఖర్వబలోర్వరా రమణ కారణసచ్చరితప్రకాశమున్
దుర్వహవర్ణనానిచయ తోషము కేశవ విస్ఫురత్కథా
దూర్వహకావ్యకల్పనము దోడ్పడురీతి నెఱుంగఁ దెల్పుడీ. 50

తే.గీ. అనుటయును దరహాసనాస్యులగుచు యుష్మ
దభిమతముజ న్మపావన మదిఘటిల్లు
పథ మెఱింగింతు మిపుడు సద్భావ్యసీమ
ప్రకటమద్దులపలిగురు బ్రహ్మనామ. 51

సీ. మున్నుత్రేతాయుగమున భీమముఖ పాలి
తంబై విదర్భాపురంబనంగ
పొలుపొందిదమయంతి పుట్టువుచోటయి
ద్వాపారమున భీష్మ భూపముఖుల
చేఁబ్రోవఁబడికీర్తి చెన్నొందికుండిన
మను పేర విభవవిఖ్యాతమగుచు

కృష్ణుండు చైద్యులఁ గెడపి భీష్మకపుత్రిఁ
గైకొన్న స్థలమయి కలియుగమున
చతురంగబల సమన్వితులగు వివిధభూ
ధవులచేతను బ్రభుత్వంబు వడసి.

తే-గీ. మలయ వింధ్యాద్రిమధ్యభూమండలమున
దనరురాష్ట్రంబులకు రాజధానియగుచు
విపులతరభూతిచేఁ గొండవీడనంగ
బరిడవిల్లను నొకదివ్య పురవరంబు. 52

క. ఆపురవర మేలినధర, ణీపులచరితములు కాలనిర్ణయములు సం
దీపింపఁజేయు కబ్బము, జూపట్టను వచనరూప శుభగంబగుచున్. 53

సీ. ఏరసికులకులసారసాటవి సూర్యుఁడనగ శ్రీభాస్కరుఁడాదియయ్యె
నేధీరవరులదానాధార కరశాఖల లఘుద్విజాళికి ఫలములొసగె
నేప్రాజ్ఞవరులమంత్రప్రభావార్కుచే సరితమోదళనుండై యధిపుడలరె
నేకోవిదులసుమనో కౌశలతప శ్శీకృతమౌచుమాధుకరతతియొప్పె

తే-గీ. నట్టిభవ్యులు తిమ్మాపురాగ్రహార
పతులు నందవరీకులు భాస్కరుని స
దన్వయజులు శీతారామ యాహ్వయుండు
రాజితయశుండు గోపాల రాయఘనుఁడు. 54

పంచపాది.

తే-గీ. వారలత్యంత కృపచెలు వారదీని
నొసగిపద్యప్రబంధమై యొసగునట్లు
సేయుటొప్పనుటయునట్లు సేయుధీరు
నరయఁగఁ దలంపదొరకితీ యవసరమున
వెదకులతపాదముల్ దాకు విధముతోప. 55

చ. చిరతరసత్కవుల్ మునురచించిన కావ్యముల్ జరిత్రముల్
బరపిరి కానికాలగతి వ్రాయమివాని నెఱుంగనెందు దు
స్తరమికఁ గొండవీటిచరితంబను కబ్బము కాలసంఖ్య భా

సురఘుగునట్లుగూర్చి మధుసూదనున కంకితమీయఁగాఁదగున్. 56

వ. అని యిట్లనేకవిధంబుల సునీతివాక్యంబుల నుపన్యసించుచుఁ దద్గ్రం
థంబు నొసంగిన నేనును నమందానందకందళితాంతరంగుండనై మదీ
య జన్మసాఫల్యప్రదంబని దలంపుచు తత్ప్రబంధ సృజనాభిలాషచే
నానందాద్భుతంబులు మనంబునఁ బెనంగొన శ్రియఃపతికి మనఃపూ
ర్వకంబుగా పునః పునః ప్రణామంబు లాచరింపుచు సమస్త మిత్ర
రత్నంబు లిరుగడలనరు దేరనే తత్కృతినాధ సందర్శనోత్సాహంబున
నాతని మందిరంబునకుం జన నుద్యమింపుచు సకలవస్తు సంతానంబు
లంబూని బయలువెడలి. 57

సీ. చతురర్ణవావృతాతతమహీమండలాంచిత మేరుగిర్యవాచీదిశాస్థ
కావేరికృష్ణాపగాద్వయాంతరగత ప్రస్తూయమానాభిశస్తదేశ
మునఁద్రిలింగక్షేత్రమున శ్రీగిరీశాన్య దిశఁగొండవీటిప్రతీచిభాగ
భూమిఁ జేజెర్లకపోతేశ్వరస్థలా స్తోకదక్షిణాపరికోణిఁబొసఁగు

తే-గీ. గుండికానిమ్నగోత్తరగోత్రనొక్క
క్రోసుదవ్వునఁ జెన్నొందుకులధరంబు
జలజవిలసితకాసారసంయుతంబు
కిల్బిషహరంబు శ్రీశ్రుతగిరివరంబు. 58

చ. మునుహరిరాముఁడై విపినముల్ జరియింపు నెడన్ సతిన్ దశా
ననుఁడటు చోరుఁడై కొనిచనన్ దిగులొంది మహాటవుల్ గనుం
గొని తనపత్నిగానకనుగుందుచువార్త జటాయువెప్పనీ
ఘనగిరిఁ జెప్పఁగా వినినకారణతన్ ద్రిజగద్ధితంబుగన్. 59

క. శ్రీశ్రుతశైలంబనభువి, విశ్రుతనిఖిలాగమాంతవేత్తృపరమహం
సాశ్రమయుతఋషిబృందకృ, తాశ్రమమై పరిఢవిల్లునభ్రంకషమై.

వ. మఱియును తెలుంగునవిన్న కొండనాగసర్వజనవినుతంబై మున్ను
రాఘవుండు దశగ్రీవుందు నిమి సీతామహాదేవింగొని పుష్పకారూ
ఢుండై సానుజబంధుమిత్ర పురోహిత ప్రముఖుండై నిజపురంబున
కరుదేరుచు తద్దశానన హనన ప్రతిపాదకంబగు బ్రహ్మహత్యాపహారం

బుగ సేతుప్రభృతి అయోధ్యాపర్యంతంబు శివప్రతిష్ఠ లొనరించుచు నిక్కుధరంబున సీతా రామలక్ష్మణ భరతశత్రుఘ్న నామంబుల నభిరామంబులగు విమలకమల కమలవిలసిత కాసారంబుల సృజించి యచట శ్రీరామలింగాభిదానంబున నొక్కలింగంబును బ్రతిష్ఠించు కతంబున నీశైలం బతిపవిత్రంబై మహనీయ నివాసయోగ్యంబై కైలాసంబు ననుకరించియుండెఁ దత్కుధరప్రాంతంబునందు. 61

శ్రుతగిరిపురవర్ణనము క్రమాలంకారం.

సీ. బడబానలంబునకిభంగంబుగాకున్న నీరధిసమతవర్ణింపవచ్చు
ద్వారబంధురమహాచుంబిదసరినచోఁ జక్రవాళంబెనయనిలోకిల్పఁగవచ్చు
శిలల చేనందంబుకి సెడకయుండినకాప్య కనకాగముల నెనకియఁగవచ్చు
అనలాహుతముగాకకియలరినచోఖాండ వంబుతుల్యంబనికిపల్కవచ్చు
తే–గీ. ననఁ దనరుపరిఘావరకిణాలయోప
వనయుతంబలకాపురకినై భవంబు
సకలపండితపాండితీకిప్రకటితంబు
సురుచిరజనంబు శ్రుతగిరికిపురవరంబు. 62

వ. ఇట్లు విలసిల్లుచు భువనైకవిరాజమానా పూర్వదేవప్రతిష్ఠాపనంబును యనర్గళదుర్గ మదుర్గాభిరక్షితంబును మరుత్తనయ పాలితాష్ట దిగ్బంధ బంధురంబును త్రిశూలి వాలావాల విశాలసాల పరివృతంబును రాయని భాస్కరామాత్య ప్రముఖదేశముఖ పరిపాలితంబును అఖండ మహిమండల మండనాహీనైశ్వర్యనిధానంబునునై యొప్పునప్పురంబు నివాసయోగ్యంబుగానెంచి యందఘటిత ఘటనాచాతురీ ధురీణుండై యింద్రనీల ఖచిత సోపాన మౌక్తిక మాలా లంకృత ద్వారబంధ చంద్రకాంతాస్థగితకుడ్య మరకత ఖచితకుట్టిమ పుష్యరాగవితర్ధికాధిక సుందరంబగు మందిరంబున నమందానందంబున సీతాలక్ష్మణులిరుగెలం కులంగొలువ దక్షిణాభిముఖుండై యనర్ఘ్య మణిబాసమానంబగు దివ్యసింహాసనంబున నిండోలగంబుండు పుండరీకాక్షునకు దండప్రణామంబు లొనర్చుచునే తద్వృత్తాంతము నద్దేవునకు మనవియొన

రించి గురు పురోహిత విద్వన్ముఖులచే నాజ్ఞగైకొని శ్రీమత్కొండ
వీటిచరిత్రనామక ప్రశస్తంబగు కావ్యంబు గద్యపద్యరూపకంబున
నాశ్వాసచతుష్టయంబున శాలివాహన శకవర్షమాసాదికాలనిర్ణయం
బులు దీపింప పాపవిమోచనంబుగా నొనరింపఁ గృతప్రారంభుండనై.

షష్ఠ్యంతములు.

క. ఏతాదృగ్వైపులయశో, పేతునకున్నిఖిల దితిజ పృథులవనీని
ర్ఘాతకృతవీతిహోత్రున, కాతతధరణీసుతాసుఖాత్తాత్మునకున్. 64

క. దాతకు సకలాగమని, ర్ణాతకు నిజభక్తబృంద రాజత్సుఖసం
ధాతకు సమస్తలోక, త్రాతకు నేతకు విధాతృ తాతకు హరికిన్. 65

క. పుణ్యాజనని కరనిరత శ, రణ్యాల సన్మృదులపాద రాజీవునకున్
పుణ్యాజన వీరవంశా, రణ్యకుఠారునకు భూమి రామాపతికిన్. 66

ఏకసమాసం.

క. స్రష్టృఘనాయన కేశవి, శిష్టామర దైత్యమాని శిష్టధ్యేయో
త్కృష్టప్రభావ సంభరి, తాష్టాక్షర మంత్రమంది రాంతస్థునకున్.

చతుష్ప్రాసకందము.

క. వననిలయ మానిజనతా, వననిలయాయతదయాప్ర వాహోదధికిన్
వననిలయమకరహరునకు,వననిలయమృగేంద్రదనుజ వహనాత్మునకున్.

క. శ్రుతభూభృత్పురమధ్య, స్థితఘనతర చక్రపాణి శ్రీనాగేశాం
చితభర్మనివేశానా, రతయుత కోదండరామ రాజేంద్రునకున్.69

వ. సమర్పణంబుగా నాయొనర్పంబూనిన దురితలతాలవిత్రంబగు కొండ
వీటిచరిత్రంబునకు కథావిధానం బెట్టిదనిన. 70

కథాప్రారంభము.

ఇంద్రుడు నారదునితో కథాప్రస్తావన సేయుట.

సీ. వదనాంబురుహమధు పానసమాయత చంచరీకారావ సంభ్రమంబు
ఓష్ఠపల్లవదంశ నోద్యుక్తకోకిలా క్రాంతప్రియోద్గీత సమ్మతంబుఁ
ఘనబాహు బిసలతా గ్రసనధావన పరివృతరాజహంస ప్రవేశనంబుఁ
పాదసమ్మిళిత రావ్యవికారమంజీరఘణిశిభ్రమోచ్చల ద్బర్హిణంబు

తే-గీ. నవసుఖ శ్రుతిగీతాభి ఽ నయసునర్త
నయుత సమగతి వీణాది ఽ నాదపణవ
శబ్దగత తాళ గాణిక్య ఽ సరసగాన
శస్త రంభాదికంబగు ఽ శక్రుసభను. 71
సీ. ఒకముఖంబున భటఽ ప్రకరంబతిస్ఫుటప్రాగల్భ్యతఁ బరాకుఽ బలుకుచుండ
నొకయోరసముదార ఽ హుంకారకరధీరశూరులు బారులుఽ తీరియుండ
నొకమ్రోలరసమేళఽ నకవీంద్రులతిసాంద్రవివిధవిద్యాగోష్ఠిఽ దవిలియుండ
నొకచెంత వేదాంత ఽ సుకరాంతరాత్మగ
స్వాంత యోగులు తత్వ ఽ మరయుచుండ
తే-గీ. నిరుగడలఁ జామరమ్ముల ఽ చ్చరలువీఁవ
నందితానంద మానీంద్ర ఽ బృందములును
దివ్యయజ్ఞాదికములు మూర్తి ఽ భవించి
కొలువగ హరిపులోమజాఽ కలితుఁడగుచు. 72
మ. జ్వలదుత్తుంగసువర్ణనిర్మితమణీఽ సంప్రోతసింహాసనా
భిలసన్మస్తకవజ్ర కీలితరుచి ఽ ప్రేంఖత్కిరీటాగ్ర్యని
స్తుల తేజం బెసగంగ నిండుకొలువై ఽ స్తుత్యస్థితింగాలుచోఁ
గలహాశుండగు నారదుండపుడురాఽగా వారితోనిట్లనెన్. 73
ఉ. ఓమునివర్య తావకమ్ము ఽ దూక్తిసుధారస ధారలన్ శ్రవ
స్సీమలనింపఁ గోరిమిముఁ ఽ జేరితి ధన్యుఁడనైతిగాన నీ
భూమినిఁగొం డపేటిపుర ఽ భూపతివర్యుల సచ్చరిత్రముల్
ప్రేమదలిర్పగా వినవఽ లెంజెపుమాయ సమానవైఖరిన్. 74
చ. అని కడుగారంబెసగ ఽ నన్నుఁ బ్రసన్నతఁ దోపనారదుం
డనియె ను హేంద్రుతో నిటుల ఽ నంతవచింతును పూసకూర్పగా
వినుము మహాత్మ సత్యమది ఽ వీనులవిందుగనంద మొందనా
వనదశరీర కేశవకృ ఽ పారస పూరపయస్సమృద్ధిచేన్. 75
చ. కలుగును సర్వసస్యచయ ఽ కారణ నీలశరీరధారి సిం
ధులలిత మానితాంశుకమ ఽ నోహరకారిగిరి స్తనస్థలా

కలితవిహారిలోకభృద కల్మషసచ్చరితప్రచారిభూ
లలనచెలంగుఁ గూర్మచటు లద్వీపఘోణి ఫణిప్రసారియై. 76

తే-గీ. అట్టి భూదేవతాకుచాభ్యంతరాభి
లాలితనిచోళవక్షః ప్రలంబమాన
వితతముక్తాసరోమధ్యపతకనాయ
కమణియనభరతాభిఖ్య ఖండమొప్పు. 77

చ. కలవచతుర్దురంతరిపుకంధరబంధన రాజవిక్రమో
జ్వలకరపాశముఁ సకలజంతుసుఖప్రదకుంజపుష్పకు
ట్మలఫలపల్లవచ్ఛదన మానితభూజవనీప్రదేశముఁ
జలధిసుతానివేశనము సమ్మతధర్మవిదర్భదేశముఁ. 78

కుండినవర్ణన.

సీ. శ్రీశైలకాళహస్తీశద్రాక్షారామనామంబులఁ బ్రశస్తిమై మెలంగు
లింగత్రయీమధ్యరంగమహీస్థలస్థితమైతగు తెనుఁగుదేశమందు
కృష్ణాస్రవంతిదక్షిణమున యోజనత్రితయావధిస్థమై చెన్ను మిగులు
గుంటూరునైఋతికోణిభాగమున ముక్కోసుదవ్వునఁగడు వాసిమీ

తే-గీ. విన్నకొండకుఁబ్రాగ్దిశనున్నతముగ [ఱు
యోజనచతుష్టయంబున నొప్పుచుండు
నఖిలజంతునివాసగహనయుతంబు
నుంధరనిభంబు కుండినమహీధరంబు. 79

క. ఆకుధరంబాకాశము, దాఁకఁగఁబెరుగుటను గిరివిదారునకాక్రీ
డాకృతిఁదాల్చెడు నదియు,స్తోకోచ్ఛ్రయచటులకూటశోభాభృతమై. 80

శ్లేష.

వ. మఱియు నక్కుధరంబు సముత్తుంగ భృగుభంగసంగతంబగుట మక
రాలయంబును అనిమిషనికాయ్య పరిశోభితంబగుట నాకంబును బహు
శద్విజసమాకీర్ణంబగుట యజనవాటంబును మృగాభిరామంబగుటఁ జం
ద్రమండలంబును, సుమనోఫలప్రాచుర్యంబగుట భగవత్ప్రసాదంబును
వివిధపత్రసహస్రంబగుట వాహినీప్రకరంబును, విపులసువర్ణనవమణి

శిలాసంఘటితంబగుట రాజమకుటంబును గగన గంగాలింగిత శృంగం
బగుట శివశీర్షంబును ననుకరించి. 81

ఉ. సత్పథవర్తనాంచితుఁడు సంతతసాధుజనౌఘవేష్టితుం
డుత్పటు వాహినీవిభవు డుత్కలికాగమవిశ్రుతుండు భూ
భృత్పతిమౌళి సన్నిహిత పేశలపత్రుఁడు కుండినాచలా
భృత్పతి చెన్ను మీఱు బల భిద్బలనిగ్రహవిగ్రయంబునన్. 82

ఉ. ఆకుధరాగ్రసీమల మహామునివర్యులు యోగసాధనా
స్తోకుల మోఘమానసుల తుల్యపరాపరతత్త్వబోధదీ
ఝాకలితుల్ విరించి హరి శంకరపాదములాత్మ నిల్పి ని
ర్వ్యాకులరీతి నిశ్చలత పంబొనరింపుచునుండి రందఱున్. 83

వ. ఇట్లు బహుకాలంబు వసించి తపంబొనరింపుచుండ నమ్మూర్తిత్రయంబు
నుంగరుణించి మునులకుం బ్రత్యక్షంబగుటయు. 84

సీ. పటునిదాఘాతప పరితప్తచాతకం
బులు మబ్బుఁగనుఁగొన్న మోద మొప్ప
నవచంద్రికార్దిత నాళీకములు భాస్క
రోదయద్యుతిఁగన్న యొప్పుగులుక
సతతదరిద్రపీడితమాన వౌఘంబు
పెన్నిధిఁగాంచిన ప్రియ మెలర్ప
విపులక్షుచ్ఛోషిత విహగకిశోరముల్
తల్లి రాకలుగన్న తమక మెసగ. 85

తే-గీ. మించుసంభ్రమమున సంయమివ్రజంబు
లధికభక్తిఁ బ్రణామంబు లాచరించి
శీర్షవిన్యస్తహస్తులై హర్ష మొదవ
కనులపండువుగాఁగ దర్శన మొనర్ప. 86

వ. అంతనామూర్తిత్రయంబు నమ్మునుల సంగతికిం బొంగి మనోభీష్టంబు
లు దెలుపుడనుటయు.

క. పరిపరివిధముల మౌనులు, హరిహరశతధృతుల నుతుల నలరించిరిఁ

చిరకాలము తా రుండఁగ, గరుణింపుఁడు వేఱుకోర్కె గల్గ దుమదిలోన్. 87

వ. అనిన వినియమ్మూర్తిత్రయంబు గరుణించి మునిసత్తములారా ! మీర
లు దేవాంశసంభవులై భూతలంబుననున్నవారు. మీతపోమహా
త్మ్యంబున లోకంబు పవిత్రంబగుఁ, గొంతకాలంబీకుధరంబుపై తపంబు
సేయుచుండవలయు, నిచటికి సురసిద్ధసాధ్య యక్షగంధర్వ ప్రముఖులరు
దెంచుచుందురీ భూధరంబు మిగుల పుణ్యస్థలంబయి యనవరతర
మానివాసంబులగు పురంబులకు పురంబై బహురాజ పరిపాలనంబున
కొంతకాలంబుకుండి నాభిధానంబునను పిదప కొండవీటి నామంబు
నను ప్రసిద్ధంబై యుండు మీవలయునట్లు మామూర్త్యంశంబుల నీకు
ధరంబున వసింతుమని యానతిచ్చి తత్ప్రాకారంబుగా నీపర్వతశిఖరం
బులు మూటియందును కించిత్ శ్వేతవర్ణ సమాకీర్ణంబగుదానిపై విష్ణుం
డు శ్రీబొల్లు మూరు వేంకటేశ్వరాభి ధానంబునను, తదీశాన్యభాగ
శిఖరంబున నీశానుండు కైలాసరాయుండను పేరను, తత్సమీపంబు
నఁగల శిఖరంబున బ్రహ్మదేవుండ దృశ్యరూపంబునను, నిలిచి రుద్రాల
యాంగణశిలాతలంబున రుద్రపాదంబనుదాని, నేకాలంబును, పొంగు
గ్రుంగులను, వర్ణరోచ్యంబులనుఁ గృష్ణోదకంబునుంబోలు నీరంబుఁ గం
బూరంబై యుండు నటుల నిజమహాత్మ్యంబులనలరించి యదృశ్యు
లైరంత. 88

తే-గీ. సంయమిప్రకరంబతిసంభ్రమమున
నాలయంబులనిర్మించియందుముగురు
మూర్తులనుభక్తినిల్పి సక్రముచితముగను
పూజగావింపుచుండిరేప్రొద్దునందు. 89

క. సురవిద్యాధరకిన్నర, గరుడోరగసిద్ధసాధ్యగంధర్వులునీ
గిరిపై ద్రిమూర్తిపూజలు, నురుభక్తినిసల్పవచ్చు చుందురువేడ్కన్.

వ. అట్టియెడల దేవకన్యకలు జలక్రీడాభిలాషాయత్తచిత్తంబుల మొత్తం
బులై వియత్తలంబునుండి వచ్చి శ్రీవేంకటేశ్వరస్థితశిఖ రాగ్నేయభా
గంబునంగల గురునాథపర్వతాగ్రంబునందు. 91

కన్యకల పుష్కరణివర్ణన.

సీ. వితతాంబుజాతసంగతమరందాస్వాదనాజస్రమధుపగానాన్వితంబు
సంస్ఖలద్వీచికాంచనసృగాంకోపలనిస్తంద్రసోపాననిస్తులంబు
కచ్ఛపమీననక్రకకుళీరముఖరాంబు జంతుసంతానవాసస్థలంబు
పవనకంపితలతాపతితకౌసుమరజోపూరిత సురభిళబుద్బుదంబు. 92

తే.గీ. నాచుబకహంసచక్రవాకాదివిహగ
నివహనిస్వననిబిడమ్మైనిఖిల జంతు
జీవనాధారముగను సృజించిరచట
కన్యకల పుష్కరణినాఁగ్రాలుచుండ. 93

వ. అందు.

జలక్రీడాభివర్ణన.

తే.గీ. వేలుపుంబువ్వబోడులువేడ్కలొప్ప
దినదినమునిత్యకృత్యముల్దీర్చికొనగ
నిక్కలనికేగుదెంచితన్నియతినిల్చి
వారికేళినిఁదేలుచువారిలోన. 94

ఉ. సొమ్మసిలంగ నొండొరులుసూటిగఁజూచుచు నీటిలోపలన్
జిమ్మనగ్రోవులంజలముజిమ్ముచుఁ గొందఱుస్వర్ణపాత్రలన్
గ్రుమ్మిపయింబడన్ విసరుకొమ్మలుగొందఱు నాత్మలంబ్రమో
దమ్మునఁదమ్ములన్విరచితార్కనిపువ్వులవ్రేటులాడుచోన్. 95

ఉ. ఒక్కతెనీటఁదోఁగమఱియొక్కతెసక్కెముమీఱవెక్కఁగా
తెక్కలియైకురందమునుదృక్కులనంజనమట్లు పెట్టఁదా
మిక్కిలివిభ్రమంబెసగమీననిభేక్షణనీరులాటలన్
దక్కగనూనిపట్టికొనిదర్పమడంగముడుంగ జేసెడున్. 96

తే.గీ. అబలనొక్కర్తుఁగొందఱుహాస్యరసము
పూర్తిగమొగంబునహరిద్రబూసినట్లు
సుమరజమలందిముత్తెంపుసొబగుప్రాలు
వ్రాయుగతిజల్లెజలబిందువులకరముల. 97

తే-గీ. ఇట్లుసురసిద్ధసాధ్యాదులెల్ల నిచట
నిత్యకృత్యముల్ దీర్చుచునియతితోడ
వచ్చుచుండుకతంబున వసుధ కెల్ల
పావనంబయి యొప్పెనప్పర్వతంబు. 98

వ. మఱియు నపర్వతనివాసులగు సమ్మూర్తిత్రయంబును ఖేచరసంయమి ప్రకరంబును రుద్రపాదాది, దివ్యస్థలంబులును, దర్శింపధరా వలయంబునంగల మానవులెల్ల నరుదెంచి సేవింపుచు నీస్థలంబునం గుండినాభిధానంబున నొకపట్టణంబును నిర్మించికొనుటయు. 99

### కుండినపురవర్ణనము.

చ. ధరణినిఁ గౌశికుండు మును దాతకు మాఱుగ సృష్టి సేయుచో
వరగుణదోషముల్ దెలుపునై ఖరిఁగంధిని ముందొనర్పఁ దా
ప్రరుచిరనిర్మలత్వమధుర ప్రచురాంబువులిందుగూర్పనా
శరనిధిఁ గెల్చె నాఁ బరిఘ జానగు భంగమిళత్తగంగయై. 100

సీ. పాతాళమునడాగి వసుధ మోవక యున్న శేషస్థితినియుద్ది సెప్పవచ్చు
పుణ్యజనారిచే బూన్కి నొందక యున్నఁ జక్రంబుతులయని చాటవచ్చు
అచిరకాలస్థితం బయిన శింపక యున్నఁ బరివేషమెనయని పల్కవచ్చు
అతితమిస్రసునదృశ్యదశ నొందక యున్నఁ జక్రవాళముసరి సల్పవచ్చు

తే-గీ. ననజగద్ధితమై ఖరులలరుచుండు
చండతరభండనోద్దండకాండతుండి
పటుభటానేకవిక్రమ ప్రాపకంబు
స్థిరమణీగణరుచిరంబు వరణవరము. 101

### ధ్వని.

తే-గీ. క్రొమ్మొగులు చికురులు బుకులముకంఠ
సరములులసన్నిటాలంబు చంద్రరేఖ
సాంధ్యరాగకాశ్మీరచర్చలుదలిర్చు
కొమ్మలనఁ బెంపలరుకోటకొమ్మలలరు. 102

ఉ. కాపురముల్ సురాలయనికాయ్యచరద్గణికాంగనాళికిఁ

దాపురముల్ ప్రభూతమణిశోభామహిరణ్మయ కేతుకోటికిఁ
భూపురముల్ శిరోగృహసమూహాపతజ్జలయంత్రపాళికిఁ
గోపురముల్ రహిఁ వెలయుఁ గోపురచుంబనడంబనక్రియన్. 103

సీ. అచిరప్రభావిశేషచిరత్నరత్నసంచయసమృద్ధిపయోధిసౌధవీధి
అత్యున్నతోచ్ఛ్రయాహంక్రియాక్రమితార్క_శశిమండలనిరోధిసౌధవీధి
ఆకాశమండలాయతమండనితభూరిసారచిత్రశిరోధిసౌధ వీధి
విపులప్రతాపసంవృతవిద్విషచ్ఛిత్తసతతార్పితవ్యాధిసౌధవీధి.
తే_గీ. వితతనిర్యద్ఘుమంఘుమాద్భుతసుధూప
చంద్రకాంతోపలనిబద్ధశాతకుంభ
జాలమధ్యస్థలపురదర్శనకు తూహ
లాధికచరత్సతీభోధిసౌధవీధి. 104

మ. తమసౌధాగ్రములన్ వసంతములనుద్యత్తాళమాధుర్యగా
నమృదుస్వానములన్ దుషారజలయంత్రశ్రీల కేశాళిసం
భ్రమసంవాసిత దివ్యధూపములరాజిల్ ప్రేమలంగ్రాలమే
ఘ మహావ్యాప్తియటంచుచాతకములాకాశంబునం దాడెడున్. 105

సీ. కలకంఠమాధుర్యగానాన్వితంబౌటభూమిజాతాస్తోకభూతిగనుట
సముదిత మధుపానసుమనోవ్రజంబౌటబహళద్విజాళివిభ్రాజమగుట
తతశిలీముఖసమంచితనిస్వనంబౌట నర్జునప్రముఖవిఖ్యాతమగుట
నవదివ్యఫలకలనాకల్పకుజమౌట వరసర్వమంగళావ్యాప్తమగుట
తే_గీ. నర్తశాలాంబుజోదరనాక పవన
రాజితాయోధనతలభారతవినోద
సురతర ప్రమేశ మహిమాభిశోభితంబు
వైభవ ఘనంబు నుద్యానవనచయంబు. 106

సీ. నామవిశేషంబునకుఁ బాడబులె కానిగుణమున బాడబకులు లుకారు
నామవిశేషంబునకుఁ గుభృత్తులె కానినడవడినిగుభృదన్వయులుకారు
నామవిశేషంబునకుఁ దృతీయులె కానిసద్వృత్తికిఁ దృతీయసమితికాదు
నామవిశేషంబునకుఁ గాపులేకాని వర్తనలోఁ గాపువారుకారు.

తే-గీ. నాఁగఁ దనరారునాల్గువర్ణములుకల్గి
యధికసంపత్ప్రకాశత నలరుదివ్య
వైఖరిభ్రాజితంబున దైవవైభవంబు
ఘనతరప్రాభవంబుకుండినపురంబు. 107

పుష్పలావికావర్ణన.

సీ. జామ! పండుకొనెద సరసపువెలఁబల్కు పండుకొందువిక జామయుండనిమ్ము
ఇఁకబేరమాడనేలకుచమ్ములిటు దెమ్ము కరముగొనుసులభకరములగును
అటులనే గొనెదనే నడిగెడునది చెప్పఁబడుగు నీకింకేమికాయవసరంబొ
ఇంకేమికలదో నీకీవివస్త్రమునుఁదీయుమిటుఁదీయనరుగుమా యింటిదాక

తే-గీ. నని యొకరికొకరు సరస మాడుచు వెను
ముందు రసికులు పండ్లమ్ము పువ్వుబోండ్లు
బేరమాడుచుఁ గొనునమ్ము వారివలెను
తిరుగుచుందురు వీధిన ప్పురమునందు. 108

తే-గీ. ఆనగరి విదర్భకు రాజధానిగాఁగ
బల పరాక్రమ విశ్రుతులై పరగినట్టి
పెక్కురాజులు నివసించి పెంపుదంపు
గలిగిపాలింపుచుయుఁ గొంత కాలమునకు. 109

భీమభూపాలునికథ.

భగవత్ప్రభు పరార్థ గర్భిత సీసము.

శ్రీచక్రవర్తినాఁ జెలువారునెవ్వాఁడు తతశంఖ బలము చేఁదనరునెవ్వ
డాశుగజాత సమస్తుఁడెవ్వాఁడు వ్యాళమర్దన కీర్తి వరలునెవ్వ
డఖిలభూమిరమాహృదధిపతియెవ్వాఁడు ప్రబలఘనాఘనభ్రాజియెవ్వ
డిలను రామాకృతి నింపారు నెవ్వాఁడు తరుణలబ్ధపతంగధాముఁడెవ్వ

తే-గీ. డుజ్జ్వలానంతపదవిభూత్యుదితుఁడెవ్వ
డహితమండల సూదన నలరునెవ్వ
డతఁడు భూవిష్ణు వనఁగనొప్పారుచుండు
భాసుర యశుండు భీమభూపాలకుండు. 110

తే-గీ. అమ్మహాపట్టణంబున కధిపుఁడగుచు
ధర్మగుణవృద్ధిచేత భూతలము నెల్ల
ధర్మగుణవృద్ధి దనరగా దండి మెరసి
పెంపుమిగులంగఁ బుడమిఁ బాలింపుచుండి. 111

క. దమయంతియ నెడుతనయను
దమదాంతదమనులు నాఁగఁ దనరెడుసుతులన్
విమలచరిత్రుఁడు గాంచెను
కుముఁదసుహృత్ప్రియమతెల్ల సంసిద్ధంపన్. 112

వ. అందు మందగమనజితమదదంతియగు దమయంతి సంప్రాప్తయావ
నయగుటయు భీముండు కూఁతుం జూచి పెండ్లిసేయ సమకట్టి స్వమతో
చితంబుగా స్వయంవరంబుసేయఁ గృతనిశ్చయుండై వసంతకాలంబున
నొక్కసుముహూర్తంబు విచారించి తత్కాలంబునకు నిరీక్షింపుచుఁ బు
రంబు విచిత్రతరంబుగా నలంకారంబుసేయించి చారులచే నివర్తమా
నంబు భూవలంబెల్లం దెల్లంబుగాఁ జాటనను పుటయు నివ్వార్త త్రిలో
కంబులం దెలియునటుల ప్రచురింపుటయును. 113

## వసంతఋతువర్ణన.

ఉ. అంత నితాంత సమ్మదహృదంతరుఁడౌచు వసంతుఁడప్పుడ
త్యంత కుతూహలంబున స్వయంవరవార్త నెఱింగి భీమభూ
కాంతజ తన్ను మున్ను చనఁ గాంతునిగా వరియించు నంచునో
స్వాంతగతానురాగ పరివారయుతంబుగఁ బొల్చె నంతయున్. 114

సీ. వనచరాద్యనుపమ వర్తనంబింపార ముఖరశిలీముఖ స్ఫురణబార
ప్రతిపత్రవిహార భావమింపలరారవితతమహాబలా ద్భుతముమీఱ
కృష్ణాత్మకద్విజ ప్రియవచోన్నతి దేరను మనఃఫలప్రాప్తి సొంపుదేర
సకలాగమాంతవాసనలచేరసమూఱ పరమహంసాశ్రమాదరము గూర

తే-గీ. నొరులెవరుఁ గానకుండఁగ నుత్సవమున
మాధవుఁడు మాధవాకార మహిమ దాల్చి
వెడలెను స్వయంవరమహాభిలాష వశుఁడగుచు

తరుణిప్రభాతి యెంతటివారికిఁ దవ్వులుగాదె. 115

సీ. తొంటిపల్లవాలు విచ్చి తోరంపుఁ బన్నీటిమజ్జనం బాడి నిర్మలదుకూల
ములు గట్టి పసిఁడిసొమ్ములు దాల్చి చందనముఁ దిసౌరభవస్తువుల ధరించి
నెఱికురుల్ దువ్వి వన్నెల కీల్జడ నమర్చి ప్రకటసుగంధపుష్పములఁ జెక్కి
కెంగేల వీడ్యంబుఁ గీలించి కల్హారసరసంబులాడెడు సఖియకరణి

తే-గీ. వనరమాదేవి మనమున వలపుమిగిలి
మాధవాగమనమున నిర్మల విభూష
భూషితశరీరయగుచు విభూతి వెలయ
దలపు లూరంగ వరియింప నిలచెననగ. 116

క. తొలికారాకులు విదిలిచి, తొలకరి వానలను గ్రుంకి దుర్గవనంబుల్
లలిత కిసాలయ సుమసం, కలితములై తగె వసంతకాలమహిమచేన్.

చ. అదిగని సేతుహైమకుధరాంతరభూపతులెల్ల వేగిరన్
ముదిత వరించునంచుఁ గడు మోదమునం జతురంగవైభవా
స్పదులయి భేరికాహళరవంబుల దిక్కులు పిక్కటిల్లఁ స
మ్ముదమున నేగుచుండిరి సముజ్జ్వలరూపగుణాభిజాత్యులై. 118

## దమయంతి స్వయంవరవృత్తాంతము.

చ. రథముల నెక్కి కొందఱుఁ దురంగచయంబుల నెక్కి కొందఱున్
కుధరనిభంబులౌ సమదకుంజరయూథము లెక్కి కొందఱున్
అధరితపుష్పకాంచిత విహాయసయానము లెక్కి కొందఱున్
పృథివిపతుల్ ప్రధానపరివేష్టితులై యటకేగుచుండఁగన్. 119

క. ఉర్వీపతులం బలెభువి, బర్వులిడుచుఁ గొందఱూర్ధ్వపదమున జలజా
ప్తార్వములు బర్వగతినిసు, పర్వాణులు వెడలిరతివ వరియింపంగన్. 121

వ. ఆసమయంబున.

సీ. కరిహరిఖురపుటీఘట్టనోద్ధూత పరాగంబు వార్షికాభ్రంబుగాఁగ
రథనేమి ఘంటికాయుధ భృద్భటాహ్వానరావంబు దీర్ఘగర్జనముగాఁగ
ధ్వజభూరిరసచిత్రితపటయుగ్ధగధగల్ సాద్భుత చంచలాచ్ఛాయగాఁగ
తత్పురనారీవితానహాసోత్థిత పత్పుసుములు నీరకణములుగాఁగ

తే-గీ. హారిణమదగంధహిమహాలు కాభిసిక్త
నృపతనుస్యూతచామరా నీతవాత
మతులసుఖకరమలయమా రుతముగాగ
వర్షఋతురీతి నాస్వయం వరముబొల్చె. 122

వ. ఇట్లుచనుదెంచిన భూపాలక ప్రముఖంబులకు భీముండెదురం జని సక
లోపచారంబులం బురంబునకు రావించి సకలమణి నికరంబులం బ్రకటి
తంబులగు చిత్రంపుబొమ్మలకిమ్ములగు కుడ్యంబులును గోమేధిక పుష్య
రాగప్రముఖోపల ఖచిత సింహాసనంబులును విచిత్రకరదీపికాచయం
బులును విమల చీనిచీనాంబరంబులరాజిల్లు వితానంబులును రత్నము
క్తాఫల ప్రాత సంకలిత తోరణంబులును వివిధపట విశేషంబులునుం
గలిగి మిగుల దివ్యాలంకృతంబైన సభాభవనంబునకు బిలిపించి యుచి
తాసనాసీనులం జేసిన. 123

సభావర్ణనక్రమా లంకారము.

సీ. రాజేనరత్నముల్ రాజేనరత్నముల్ రమణీయతేజోవి రాజులగుట
గురుబుధప్రముఖులు గురుబుధప్రముఖులుస్థిరదసం తాసనాసీనులగుట
సన్మార్గవర్తనుల్ సన్మార్గవర్తనుల్ సకలాగమపదాను సరణులగుట
నిగమపాలకముఖుల్ నిగమపాలకముఖుల్ శ్రోతనిష్ణాతాను చారులగుట

తే-గీ. దుర్గమపయోధిదుర్గంబు ద్యుస్థలంబు
కవిసభాస్థానభవనంబు దివియుంబుణ్య
జనపదముయజ్ఞవాటంబు సార్వభౌమ
సమ్ముఖమునునాగేంద్రరాజ సభదలిర్ప. 124

వ. తదాస్థానంబునందు సకలదాతృసనాథుండగు భీమభూనాథుండు
సఖీజనపరివేష్టితయైన దమయంతినిరావించి ప్రేమాతిరేకంబున నంక
పీఠింజేర్చి సభాసదులంజూపుచు నిట్లనియె. 125

ఉ. వీరుధరాధినాథులతి వీరులుసత్యపథప్రవర్తనా
చారులుసద్యశోధనవి శారదులాకృతిమారులుఁగా మహా

శూరులు నీ స్వయంవరముఁ జూడఁగ నిచ్చలు మెచ్చి నచ్చి యు
న్నారెదఁ గోరినట్టి నృప నందనునిన్ వరియింపు కోమలీ. 126

దమయంతి నలుని వరించుట.

వ. అని సమయోచితంబుగాఁ బలికి వీడ్కొలిపిన నప్పుండయాన మందగ
మనంబున. 127

సీ. తరుణహృద్భేదనో ద్ధతిఁ జూపు మరునిశు
చాపయష్టి నిగుడ్చు శరమనంగ
నుర్విపహృదయాబ్ధు లుప్పొంగ భీమ పూ
ర్వగిరిపై వెడలు చంద్రకళ యనగ
నిరుపమశృంగార సరసాభినయకళా
ద్భుతమైన జంత్రపు బొమ్మ యనగ
లోకవిభ్రమసమా లోకనాశ్చర్యకృ
ల్లలితస్థిరాంశుచం చలయనంగ.
తే-గీ. కనకమణిమయభూషణో త్కరము గ్రాల
బాలమ్రోలనమ్మ పాలకధాళివంశ
లీలలు వచింప నిరుగడల్ గోలలిరువు
రుచ్చరింపంగ వెడలెన త్యుత్సవమున. 128

ఉ. రాజులసద్యశోధనవి రాజులచారుతనుజ్వలోబ్జినీ
రాజులరూపధూతరతి రాజులభూరివిభూతిజైత్రగో
రాజులశౌర్యధైర్యమృగ రాజులభక్తజనావనాంబికా
రాజులదానకర్ణశిబి రాజులరాజుల గాంచుచున్ దగన్. 129

మ. వరియించెన్ జతురర్ణవావృతధరా వామేక్షణాక్షీణని
ష్ఠురవక్షోజయుగస్థశస్తమణిరిం ఛోళీస్ఫురద్ధారవి
స్తరతేజోమయనూత్నరత్ననిభభా స్వన్నైషధాభిఖ్యదే
శరమావల్లభవీరసేనతనయున్ స్ఫారానలున్ శ్రీనలున్. 130

దమయంతి వివాహము.

వ. అంత భీమభూకాంతుండ మందానంద కందళిత హృదయారవిందుండై

యేతద్వృత్తాంతంబునం తిపురంబునకనిపి వారలిరువురకుం బరిణయం బొనర్పం గృతనిశ్చయుండై. 131

సీ. గురువర్యుడై వశిష్ఠ కోవిదప్రకాండ
నిర్మలలగ్నంబు నిశ్చయించి
సురుచిరంబుగనిజ పురమలంకారించి
ఘనవాద్యములు సెలంగనియమించి
భూరిసంభావనం బులనలుంబూజించి
బుధజనాశీర్వాదములుగ్రహించి
వారకాంతాలాస్యచారుప్రతోళికా
పరిణయోత్సవకళాపటలినించి.

తే-గీ. నీలముక్తాదిమణిమయాట్టాలకమున
రత్నసింహాసనంబునరమణునిల్పి
సకలజనములువినుతింపప్రకటితముగ
పెండ్లిగావించెలోకసంప్రీతివెలయ. 132

వ. అంత నమ్మహీకాంతుం డత్యంతసంతోషస్వాంతుండై వివాహానంత రంబున సుతాజామాతలం గతిపయకాలంబు నిజమందిరంబున సకల వైభవంబులనోలలార్చి పిదప నిస్తులప్రశస్తంబులగు వస్తువాహన నిచయంబుల ప్రచురంబుగా నిడి సపర్యలొనరింపదాసదాసీజనంబుల వెంటనొసంగి దివ్యరథారూఢులంజేసి నిఖిలవాద్యంబులు హృద్యం బుగామ్రోయ నిషధపురంబునకనిపి యతండు సుఖావహుండై పెక్కు కాలంబు విదర్భదేశంబు పాలించె ననంతరంబ తదీయాన్వయజులగు నృపులనేకులును ప్రభుత్వంబుసేయుటయు ద్వాపారంబునందు. 133

భీష్మునికథ.

క. చంద్రాన్వయభవులుయశ, స్సాంద్రులునిబిడాహవప్రశస్తచరితులా
చంద్రార్కకీర్తిపథని, స్తంద్రులగుచునేలిరచట జయనయపరులై. 
వ. అందు. 135

సీ. ఏరసావల్లభు ఘోరసంగ్రామంబు గ్రామంబు జయరమాగారమునకు
నేజయశీలువి రాజత్ప్రతాపంబు తాపంబు వైరిసంతానమునకు
నేక్షమాపాలుక టాక్షప్రసారంబు సారంబు కోవిద సంఘమునకు
నేజనాగ్రణిలస త్తేజోభిమానంబు మానంబు దశదిశామానినులకు

తే-గీ. అతఁడుస ప్తాంతరీపమధ్యస్థశ స్త
నిస్తులమణిస్థగితరమ ణీయమకుట
తటపరిన్య స్తప్రాంజలీ పుటనృపౌఘ
వేష్టితసభాంతరుండుశ్రీ భీష్మకుండు. 136

సీ. విగ్రహాతిశయంబు విగ్రహాతిశయంబు సుందరవిజయభాసురముఁజూప
విక్రమస్ఫురణంబు విక్రమస్ఫురణంబు బహుధృతిభూభారపటిమఁదెలుప
దానవిశేషంబు దానవిశేషంబు సజ్జనాదృతిరిపు క్షయమువరప
ధర్మగుణోన్నతి ధర్మగుణోన్నతి దుష్కృతద్వేషణాతురమునడప

తే-గీ. సకలదిగ్విజయశ్రీప్రసాదమహిమ
చేతనుదయా స్తగిరిసేతు శీతశైల
మధ్యసర్వంసహాధిసా మ్రాజ్యపదవి
నోలలాడుచుఁగుండిన మేలుచుండె. 137

వ. ఇట్లతఁడ ఖండైశ్వర్యవిరాజమానుండై పాలింపుచు గిరిశృంగంబుల
మునీంద్ర ప్రేరిత స్వయంప్రకాశ భాసమానులగు మూర్తిత్రయం
బుల ననయంబునుఁ బూజింపుచుఁ దదీయాలయంబుల నూత్నఫక్కిం
గట్టించి యాదేవులకు నిత్యోత్సవవారోత్సవ పక్షోత్సవ మాసోత్సవ
సంవత్సరోత్సవాద్యుత్సవ విశేషంబుల నొనరింపుచు. 138

చ. అనయము దేవభూసురస మాదరణైకవిరాజమానుఁడై
దినదినముంబురాణముల దివ్యకథానుగతప్రశంసలన్
మనమిడిసప్తసంతతుల మర్త్యతకై పచరింపుచుంబురం
బునకుధనేశుపార్శ్వమునఁ బొల్పగుచుండెడు చిన్నికొండపై
ఘనమగునాలయంబొకటి గట్టినగాత్మజనిల్వ భక్తితోన్. 139

తే-గీ. ఇట్లుసద్భక్తిమెయినొప్పు ✓ నితఁడుభువిని
సరససద్గుణపేటుల ✓ సదయమతుల
రుక్మిరుక్మిరథాహ్వయ ✓ రుక్మబాహు
రుక్మకేశునిరుక్మనే ✓ త్రులనుగాంచె. 140

వ. అనంతరంబ. 141

రుక్మిణీదేవి వర్ణన.

సీ. మగమీలజిగిజాల ✓ నొగిఁదూలనీక్షించు
చెన్నుమిన్నల రారు ✓ కన్నుగవయు,
ఫేనంబుమానంబు ✓ న్యూనంబుగ హసించు
భాసమానంబగు ✓ హాసగరిమ,
పగడంబు తెగడంబు ✓ జగడంబుననుడించు
శాతద్యుతులమీరు ✓ వాతెరయును,
అలలచాళులయుండ ✓ ములచందములగుండ
పరచిమీరెడుసురు ✓ చిరపువళులు.
తే-గీ. మకరకరకరకదళులనొంచు ✓ మగుపతొడలు,
కూర్మములమర్మ మెడలించు ✓ కోమపత్రపదము,
లనుచుఁగొనియాడరుక్మిణి ✓ యనజనించె
విపులసౌజన్యభీష్మక ✓ నృపతికన్య. 142

తే-గీ. పద్మములపై నిశశినిబిం ✓ బంబుమీఁద
జిలుకనుఁదరంగములశిఖ ✓ రులనునిల్పి
యజుఁడుచిత్రంబుగాఁ జేసె ✓ ననగనలరు
చక్షురాస్యోష్ఠవాగ్వళీ ✓ స్తనయుగములు. 143

రాగమాలిక.

సీ. శ్రీమంజులంబులు ✓ కోమలిపీనులుచ్ఛాయాంతరంగిణి ✓ చానమేను,
చక్రవాకవిధంబు ✓ సతిగబ్బిచందోయిశంకరాభరణంబు ✓ సకియవేణి
తతవరాళివిభాతి ✓ తన్విసేత్రయుగంబుకీరవాణిఖ్యాతి ✓ నారివాణి
సారంగసంగతి ✓ జలజాక్షిగమనంబు పున్నాగవైఖరి ✓ పాలతినాభి-

తే-గీ. విపులనీలాంబరచ్ఛవిఁ జెలఁది కురులు
మోహనాధికరుచిఁ బువ్వుఁ బోఁడిరూపు
పూర్ణచంద్రికాతిశయంబుఁ బోటినగవు
గానగేయప్రబంధమై గాలుచుండు. 144

కం. పలుకులు జిలుగుంగ్రపుఁ, బలుకులు యంచలకు మారుఁ బలుకులు నడలౌ
పలుకులు కుల చెవిహాయులుం బలుకుల గణియింపదర మోఁ బలుకుం జెలికిన్.

సీ. వదనంబుఁ బోలంగ వనజంబు రసిచందు,
రుండను భీతి చేఁ దండివిరిసి
వేనలి సరిగాఁగ బూని నాగము కేకి,
పింఛంబనుచు జాలఁ భీతి జెంది
అధరంబుతోఁ దులఁ నలరంగ బింబంబు,
చిల్కముక్కునికడుఁ నుల్కుఁ వొంది
ఊరుల కెనగాఁగఁ గోరియనంటులు,
కరికరంబులనివిఁ కల్వ మొంది

తే-గీ. కాకకొలకుల కెలకుల నాకుఁ తతులఁ
దీగబోదరిండ్ల నారామ భాగములను,
నుంటపని యేమి? యీ కల్వ కంటిచెల్వ,
మనుప యోనిధిలో నోలలాడకుండ. 146

చ. కొమ చనుదోయిఁ బోలగనుఁ గోకములార సిపోల రామిఁ జి
త్తమున నురాగ్రహంబొదవి తామరులై చను కెల్ల నాస్యతు
ల్యమగుటఁ గోరుపంకజము లంతయుఁ గన్గొని తమ్ము లౌచుఁ బా
దములనుఁ జేరి కాంక్షఁ గనెఁ దాల్మి నిఁ జేకురుగాఁ డకోరికల్. 147

క్రమాలంకారము.

సీ. వనజాతమును గేరు వై ఖరిదగియుండు వనజాతసదృశమై వరలుచుండు
వనజాతమును గేరు వై ఖరిదగియుండు వనజాతసదృశమై వరలుచుండు
వనజాతమును గేరు వై ఖరిదగియుండు వనజాతసదృశమై వరలుచుండు
వనజాతమును గేరు వై ఖరిదగియుండు వనజాతసదృశమై వరలుచుండు

తే-గీ. కలికి నెమ్మోము దరహాసగరిమ వెడద
కన్నుఁగవ వాగ్విలాసంబు గళము సొంపు
విమలరూపము దాన విభ్రమము వరుస
మిగులఁ జెప్పంగ నొప్పు నీ మెలతయందు. 148

క. దరమాసళ వై ఖరిసుం, దరమాసతిరూప మెన్నఁ దరమా ఘనమం
దరమా కుచయుగళముకం, దరమాయుత నాభితగును దరమా చెలికిన్.

వ. ఇట్లొప్పునక్కన్యకాలలామంబు సంప్రాప్త యౌవనయగుటయు.

సీ. ప్రాతరారంభసంభ్రమవిశేషంబు నరుచులనీనెడు సరోరుహమనంగ
పౌరుషహృత్పాటనారూఢిఁ జెందంగ సానవెట్టిన మారుశరమనంగ
మధుమాసవాసరమహిమ చేఁ దరుణపుష్పితమైన మల్లికాలతయనంగ
ఘనతరాభోగభోగనిధానపరివర్ధమానంబయిన పెన్నిధానమనగ.

తే-గీ. మోము మోహంపురుచులచే గోము మిగిలె
చూపు బెళ్కులఁ దగగుబ్బ లేపుఁ జెందె
తనువు జానూనె భరమై నితంబ మొప్పె
పండుయౌవనమింతికి నిండుకతన. 151

రుక్మిణి శ్రీకృష్ణుని మోహించుట.

సీ. తనదు దివ్యజ్ఞానమున ద్వారకాపురిదైత్యారిదివ్యావతారమగుచు
బరఁగు శ్రీకృష్ణుండు భర్త కాఁదగునని యోచించి యాతఁడు నుత్సవమున
దను నాత్మపత్నిగాఁ గొనఁ గృప సేయంగ నిశ్చలమతిఁ బూని నిష్ఠ మెయిని
తండ్రి సృజించిన దాక్షాయిణీదేవి విగ్రహమున తప మొనరింపుచుండి.

ఆ-వె. తనమనంబు దెల్పఁ దద్దయు శ్రీకృష్ణు
కడకు నాశ్రితులగు పుడమిసురుల
ననుపుటయును వారలతిభక్తియుక్తులై
ద్వారకాపురంబు జేరియచట. 152

తే-గీ. ద్వారక సమాశ్రితేష్టాభిపూరణుండు
భావిశుభ కార్యధుర్యుండు శ్రీవిభుండు

నిచట జరిగిన చందంబులెల్లఁ దెలిసి
చిత్తమున మొత్తమగుతమితత్తరిల్ల. 153

ఉ. వచ్చినవిప్రవర్యునకు వారితభక్తి నమస్కరించి మీ
రెచ్చటనుండి వచ్చితిరి యేమి శుభాతిశయంబులం చుదా
నచ్చపుఁబ్రాకృతుంబలె మహావినయోక్తులతోడ వేడ వా
రిచ్చటి వర్తమానములు నెల్ల వచింపుటయున్ ముదాత్ముఁడై. 154

సీ. మీదివ్యదర్శనంబీదినంబగుడుమా
మకమునో రథములూరక ఫలించె
మీవచోమృతము నెమ్మినిగ్రోలసంతృప్త
సుమనస్థితి జెలంగుచొప్పుగల్గె
మీ సెప్పు శ్రీసముస్నేహకృద్వార్తలు
వినగ శ్రోత్రానందవిభవమొదవె
మీసద్గుణగణవిలాసంబులారయ
నత్యున్నతస్థితియబ్బగల్గె.

తే-గీ. నెల్ల సంపదలాగినుల్లసిల్లె పల్ల
వ్రాప్టినను గూర్పగాఁ గృపయుంచుడనుచు
వితతమణిభూషలిడి బహుమతుల వేడి
మగుడబనుపుటయును వారు మగుడఁ జేరి. 155

శా. అమ్మా మేమట కేగఁ జూచుతరి నేనత్యాదరస్వాంతుఁడై
మమ్ముం బెక్కుసపర్యలందనిపి మీమాటల్ వచింపంగఁ దా
సమ్మోదంబున నాలకించి బహు వాంఛాస్ఫూర్తిచే మిమ్ములన్
నెమ్మింగొండఁగఁగల్గుటెన్నఁడనుచున్ వీక్షింపుచున్నాడొగిన్. 156

వ. అని విప్రులు శ్రీకృష్ణుని వృత్తాంతంబంతయుం దెలిపిన రుక్మిణీదేవి య
మందానందమరందబిందు సందోహ నిష్యందమాన మానసాంభో
రుహ ప్రసూనయై తావలయునపుడెల్ల యదువల్లభుసన్నిధికిని జాఁ శ్రి
తులను బనుపుటయు నతండును దానిచ్ఛగించునపుడెల్ల దూతికలఁ

బంపుటయుం గలుగుటచే నొండొరులును బరస్పరానురాగ సంబద్ధ
సుమనః ప్రవర్తనంబులం బెద్దయుం బ్రొద్దుగడుపుచుండ. 157

భీష్మకుఁడు రుక్మిణికి వివాహము సేయుటకు యత్నించుట.

ఆ-వె. భీష్మకుండు కూతుఁ ఽ బెండిలి సేయంగ
దలచి విభుఁడెవండొ ఽ దెలుపుఁడనుచు
సచివబంధుమిత్ర ఽ సందోహములఁ గూర్చి
యడుగుటయును వార ఽ లతిముదమున. 158

ఉ. కొందఱు మాళవేంద్రునకుఁ ఽ గొందఱు మద్ర మహీశుపట్టికిన్
గొందఱు కొంకణేశునకుఁ ఽ గొందఱు టెంకణ భర్తకున్ మఱిన్
గొందఱు వంగనాథునకుఁ ఽ గొందఱు బర్బర భూమిజానికిన్
గొందఱు ద్వారకావిభున ఽ కున్ సుతనీఁ దగునంచుఁ బల్కి రన్. 159

చ. ప్రథమసుతుండు రుక్మి సభఁ ఽ బార్థివుముంగలి కేగి చైద్యభూ
మిధవునకీఁ బొసంగునని ఽ మించి వచింపగ భీష్మకాదులున్
బధిరులభంగి వీనులిడి ఽ వానిమతంబు బ్రగహించి మంచిదా
విధమొనరింపుటొప్పనుచు ఽ వేడుకమీఱఁగఁ దత్ప్రయత్నులై. 160

ఆ-వె. శుభముహూర్తమొండు ఽ జూచిపురంబెల్ల
వజ్రమణివిశేష ఽ వైభవముగఁ
దగనలంకరించి ఽ తద్దయు శుభలేఖ
ననుపుటయును చైద్యు ఽ డనుముదమున. 161

చైద్యుఁడు పెండ్లికి దరలివచ్చుట.

ఉపమాలంకారము.

సీ. తొలిమొగుల్ మెఱుపులఁ ఽ దళుకొత్తుగతిమణి
ప్రకరభూషితమదేభములుగదల
గగనయానోచ్ఛల ఽ ద్గంధర్వవరులట్లు
తత్తడుల్ బూనిరాహుత్తలెసగ
అక్షీణపక్షివి ఽ హారప్రకార గో
త్రాధరంబుల క్రియ ఽ రథములడర

హరిహయపరివేష్ట నాచారులగుగురు
ప్రతతిపోలికగురు ప్రముఖులలర

తే-గీ. సకలమంగళవాద్యానుషంగ మొప్ప
వందిమాగధబృందకైవార మెసగ
బంధుసంతానమిరుదెసల్ బలసి చెలఁగ
కుండినము జేరెఁ బెండిలికోర్కెలూర. 163

ఆ-వె. పురికిఁ బెండ్లివారలరుగు దెంచుటఁగని
వెగటుపడి వివాహ విభవమిపుడె
వేడికొనదగారి విఘ్నంబు సేయుమం
చనుచు విప్రుజేరి యనియె నిట్లు. 164

క. ననుఁబెండ్లి జేసికొనఁ గృష్ణునిఁగొని రమ్మిటకనుటయు శుభమస్తనియా
తను ద్వారకాపురికపుడు, జని కృష్ణుని మ్రోల నిచటి చందము బలుకన్.

**కృష్ణుండు చైద్యులం ద్రుంప కుండినమునకు దండెత్తి వచ్చుట.**

మ. రణనిర్వాణము మాడ్కి వార్త చెవిదూరన్ శౌరి నేఁదుష్టశి
క్షణముం జేయజనించితేని యిపుడే చైద్యావనీపాలురన్
క్షణమాత్రంబునఁ ద్రుంచి రుక్మిణిని యాస్తం దెత్తుగాకంచు భీ
షణరోషత్రిపురాసురాంతకగిరీశ ప్రక్రియం గ్రాలుచున్. 166

మ. రథమాయత్తము జేసి దారకుడు దే రమ్యంబుగా నెక్కి శా
ర్ఙ్గధనుఃకాండదరారినందకగదల్ ప్రాజ్యస్థితిం దాల్చి శౌ
ర్యధృతిశ్రీరసముప్పతిల్లఁగ రుణా రమ్యాత్ముఁడై చారుత
న్వధరీభూతశతస్మరప్రథితుఁడై యాప్రోలు దాఁ జేరినన్. 167

క. కనుఁగొని చైద్యమహీశులు, ఘనవిక్రమచటులభటనికరయుతులై పై
కొని శరవర్షము గురియుచు, మునుకొని శ్రీకృష్ణుపైని మూఁగుచు రాఁగన్.

పంచచామరము.

శిలీముఖప్రకాండముల్ నశింపఁజేసియాత్మదో
ర్బలంబుడంబొనర్చి శార్ఙ్గపాణియై యెదిర్చి తా
బలారిశైలవాళినొంచు భంగిఁబొంగి తన్నృపా
వళింజలంబుబెంచి త్రుంచె వాసవాదులెన్నఁగన్ 169

స్రగ్విణీవృత్తము.

ఆలమందొక్కఁడీట్లార్భటీయుక్తుఁడై
క్రోలలన్ రాజులన్ గూల్పఁగాఁ జూచియి
ట్లీలకో యంచు నూహించి భీతాత్ములై
చాలసాళ్వాదులాశ్చర్యమున్ బొందఁగన్. 170

ఉ. పోరికిఁ గొంద ఱస్ఖలితబుద్ధినిఁ గృష్ణుజయింపనుర్విపైఁ
బారిరిఁ గొంద ఱేలశిశుపాలువివాహము మాకటంచు వి
స్తారకృపామతిన్ మనలఁ దాభరియించునటంచుఁ గేశవున్
జేరిరిఁ గొంద ఱయ్యెడలఁ జేతులు మోడిచి భీతితోఁ బగన్. 171

ట్లు సాళ్వనరపాలబృందంబులెల్ల భిన్నంబులై నిశ్చలితాంగముల వీ
క్షింపుచుండఁ గృష్ణుండు శరవర్షంబుగురిపింపుటమాని సుందరీలలా
మంగొంపోవుటమేలని తలంచి రుక్మిణీమణి కడకేతెంచి. 172

శా. భేరీఘోషమునన్న జాండములుకంపింపంగనంభోధిగం
భీరంబొప్పఁగ సింహనాదములనాభీలంబుగాఁ జేసి దు
ర్వారప్రౌఢిఁ బడంతిఁ గైకొనుచుఁ దేవంబోయెఁ బత్రీశుఁడా
స్వారాజేంద్రుజయించి దివ్యసుధ నిచ్ఛంగొన్న చందంబునన్. 173

తే-గీ. ద్వారకాపురికేతెంచు వార్త దెలసి
పురజనంబులు కౌతుకస్ఫూర్తులగుచు

హరికెదురుగనుసీరాజనాదులుగొని
శౌరిదర్శించిమదినిహర్షముదలిర్ప
వారువారునుఁబురికరుదేరిరంత. 174

ఉ. కుండినమందుభీష్మకముఖుల్ హరిచందముగాంచియీతఁడొ
క్కఁడుమహీశులందునిమికన్యనుగైకొనిపోయెదోర్బలా
ఖండలుఁడీతఁడాత్మజకుఁగాంతుఁడుగాఁదగునంచువారలు
ద్దండకుతూహలంబుననుదంగననేగిరిశౌరిపీటికిన్. 175

క. అరిగినవారలఁగనుగొని, హరియాతిథ్యములొసంగియనుపమలీలల్
బరగగవిందులొనర్చుచు, బరిచర్యలుజేసెభక్తిభావంబెసగన్. 176

## రుక్మిణీశ్రీకృష్ణులపరిణయము.

వ. అంత ద్వారకాపురంబునకేగిన సకలబంధుబృందంబులు నితాంత సం
తోషస్వాంతులై రుక్మిణీ శ్రీకృష్ణుల పరిణయంబొనరింప దొడంగి
గురుపురోహితులవలన సుముహూర్తంబు విచారించి యభంగమంగళ
తూర్యారావంబు లుప్పతిల్ల వైవాహికప్రయత్నంబులం జేసి నిఖిల
బంధుమిత్రపురోహితామాత్య ప్రముఖులెల్ల సభాసీనులై వధూవ
రుల మంగళస్నానంబుల కనుజ్ఞనొసంగుటయు. 177

చ. కడలెడుమబ్బుగుబ్బలులఁగ్రాలెడులీలఁగుచంబులందుఁబ
య్యెడగడలన్ శ్రమాంబుకణబృందనిషిక్తలసన్మృగీమదా
స్పదతిలకంబుజారవలిపయ్యెరసూఁగెడుతీగనాగఁగా
నదరఁదలంటికిన్వరకనకంబుజపాణులువేరువేరుగన్. 178

సీ. తళుకుపొంబొమ్మలకుపులిగడిగినరీతి
సౌరభాంబువులమజ్జనమొనర్చి

సౌదామినులఁ గప్పు శారదాంబుదముల
కరణిమువ్వలువలు గట్టిగూర్చి
అంభోజమున వ్రాలు నళిడింభ మట్టుల
కస్తూరిబొట్టు చొక్కముగఁ దీర్చి
మధుకాలసుమపలచ్ఛదయుక్తతరువన
క్రమమున మణిభూష ణములమర్చి
తే-గీ. నూపుర ఝణంఝణ ధ్వనుల్ దీపితముగ
కామినులు రుక్మిణీదేవి గర్గముఖ్య
మునులు శ్రీకృష్ణమూర్తిని భూరిపీఠ
ములకుఁ దెరచాటుగాఁ దెచ్చి రలఘుమతుల. 179

వ. ఇట్లిరువురిని సుఖాసీనులం గావించి నిగమ చోదితంబుగా వైవాహిక ప్రకరణంబులెల్ల సేయించి శృంగార గీతాభి రామంబుల ముత్తైదువ లిరుగెరంకుల ముత్తెంపు నీరా జనంబులెత్తి పాడుచుండఁ బసిండి పళ్లె రంబుల దలబ్రాలుగొని వధూవరుల చెంతనింతులందీయ నక్షతారో పణోత్సవానుషంగులై. 180

సీ. పలుముత్తియపుఁడల బ్రాలుసతీపతు
లొండొరుపై బోయుచుండు నెడల
హరియింతిపైఁ బోయ నసితిలను సోకి
కడుసువర్ణచ్ఛాయఁ గ్రాలిరాల
ఘనరుక్మిణీకర గళితంబులై కృష్ణు
పై బడినీలాల బాతిజార
శరధిరాట్కన్యకాంశజపై పరుడువ్రాయ
వజ్రోపలస్వభా వమువహించ

తే-గీ. శాస్త్రవిధిగాఁగ భక్ష్యభో । జ్యప్రశస్త
భుక్తినిఖిలజనము తుష్టిఁ । బొందుచుండ
సుమవిమానోత్సవంబులు । సొంపునింప
నుప్పతిల్లెఁ గళ్యాణ మ । హోత్సవంబు. 181

వ. అట్టియెడ. 182

మ. హరిముఖ్యుల్ వినువీధిజోత లిడఁగా । ఘానందులై భోగినీ
హరిణేక్షుల్ నటియింప భక్తియుతులై । యాసేతుశీతాచలాం
తరభూనాథుల సర్వవస్తుమణిసం । తానంబులం బూని శ్రీ
హరికర్పించుచు మ్రోలనిల్చిరి సము । ద్యత్ప్రాంజలీబద్ధులై. 183

వ. ఇట్లత్యంత కళ్యాణ విభవంబులు ప్రభవింపఁ బరిఢవిల్లు నాకళ్యాణమహోత్సవానంతరంబున శ్రీకృష్ణుండు పట్టాభిషిక్తుండై యరుగుదెంచిన బంధుబృందంబులఁ గతిపయకాలంబు నిజమందిరంబున విందులందనిపి వస్త్రవాహన భూషణాంబరాదులచే బహూకరించుటయు వారును తమతమ వాసంబులకుం జనినయనంతరంబ భీష్మకుండును గుండిన పురంబునకుం జేరి యచటి చందంబులెల్ల నెల్లరకుం దెల్లంబుగాఁ దెలిపి యంతంత దనసుతాజామాతల రావించుచు వారల కనూనంబులగు విభూషణా మూల్యమాల్యాంబరాదుల నొసంగుచు సంతసంబునఁ గుండినపురంబు బహుకాలంబు పాలించెనంత. 184

తే-గీ. ఇతని వంశజులైన భూ । పతుల నేక
లుభయలోకప్రసిద్ధిగా । నురుతరప్ర
మోదమున నేలిరి కలియు । గాదిసమయ
మవధిగా నీతిచేఁ గుండి । నాఖ్యపురము. 185

క. అనుచు సునాశీరునకతి, వినయంబున నయుగద్రిదిలోక । విదుఁడగు వనజా
సనమానస తనయుండొగి, వినిపించెను కొండవీటి । విభుచరితంబుల్.

## షోడశ దళ కమల బంధము.



## షోడశదళకమల బంధసీసము.

సీ. దర్పకాంగశ్రీనికై ధానవక్షుస్థలా
 శ్రితకోటిరక్షు గుకైరుతరదండ
 నయహారిలసద ఖంకైడమనోజ్ఞరుక్కాయ
 రారాజదుత్తాలకై వైరిమార
 భామాంకధరబ్రహ్మకై పరకిటిపతిరూప
 యమరనుతపదబ్రహ్మాది గేయ

కొండదాలుపభూరి గుణమండనాఢ్య
సౌఖ్యవిహారవీన ప్రకటితతురగ.

తే-గీ. కుటిలదానవమర్దన చటులతేజ
రమ్యమణిపూరిత సుహార రాజపుత్ర
పుష్కలాంభోద సదృశ సకేముజ్వలాంగ
దళితభవ శశినిభముఖ తరణికులజ. 187

నాగబంధము.



చ. శరధి విహార సారతర సారససన్నిభలోచనామనో
హరఘనకాయశూర కమలామలవక్త్రరమానివాసవా

నరవచన ప్రచారకధకై నాధనరమ్యయశో విధావరా
దరముని లాభకారమురకై దాక సమ స్తప్రధానతారకా. 188

## శైలబంధము.

హ

త ను రి

య శో మ హ త్వా

కా ప్ర జ్ఞా త్ప స ర ద

ర త్రా ర క సా రా స ర సి

ఖ ము ర ము నా ద వ భ ని హ రు

దై తే య హ ర ణ ము ని జ న భ ర ణా

క. హరినుత యశోమహాత్వా, దరసత్ప్రజ్ఞాప్రకారకై తారకసారా
సరసీరుహాని భవదనా, మురముఖదైతేయ హరణకై మునిజనభరణా.

గద్య. ఇదిశ్రీమజ్జగత్ప్రాణ తనయ వరప్రసాద లబ్ధ కవి
తాసంక లితాప స్తంబసూత్ర కౌండిన్యసగోత్రపవిత్ర
వివిధ విద్వన్ముఖ సరోజాతమిత్ర మద్దులపలి వంశదీ
పక వేంకటప్పయాభిఖ్య తనూజాతక సుకవి
జనసేవక గురుబ్రహ్మనామ కవిరచితంబగు
శ్రీకొండవీటి చరిత్రంబునందు
ప్రథమాశ్వాసము.

శ్రీరస్తు.

# శ్రీకొండవీటిచరిత్రము

## ద్వితీయాశ్వాసము.

శ్రీమాని నీమధురవా,
క్స్తోమానందాబ్ధి రామ ॥ సువ్రతకామా
భూమండనశ్రుతభూభృ,
ద్ధామాకోదండరామ ॥ దనుజవి రామా. 1

క. అనఘారునారదముని, ప్రవరునిచే నాదితేయ ॥ పతివినియంతః
దవిలి పరితృప్తినొందక, నవలికథం దెల్పుమన్న ॥ నతడిట్లనియెన్. 2

తే-గీ. కలియుగంబునఁదొలిబహు ॥ కాలమర్క
చంద్రవంశజులగు నృపుల్ ॥ సాంద్రగరిమ
శాశ్వతైశ్వర్య వైభవ ॥ సమితివెలయ
మేటులై యేలిరికొండ ॥ వీటిసీమ. 3

ద్వ్యర్థి.

సీ. శేఖరధారణ ॥ చేఁగీర్తిఁగనిదుర్గ
వరులునాఁజెలువొందు ॥ ధరణిభృతులు
సాంద్రప్రదోషముల్ ॥ సడలఁద్రోయుచు
శతపత్రసమ్మదమునఁ ॥ బరగునినులు
భోగవిస్తృతిరూఢిఁ ॥ బొసగి యనంతాఖ్య
పదభూతిఁగనుచక్రి ॥ వర్తిఘనులు
కువలయప్రీతిచే ॥ కొనిసత్పథమునంటి
ప్రకటకళావాప్తిఁ ॥ బరగురాజు

తే–గీ. లలరిరత్రిశాంతవిశ్రాణ నార్యవర్య
మానితాశీర్వచోవర్ధ మానభూన
భోంత రేద్ధమహైశ్వర్య వంతులశ్వ
పతిగజ పతినరపతి సద్వంశులనగ. 4

క. ఆవంశత్రయమున నతి, పావనమై యరినిరాస భావనమైల
క్ష్మీ విలసిత గజపతికుల, మానవతావన విధాన మైవిలసిల్లెన్. 5

వ. ఏతద్వంశవరేణ్యుండు. 6

విశ్వంభర దేవుని కథ

సీ. శ్రీమద్రమానవధూటీమనోహరభవ్య
పదసువర్ణాంభోజ భాసురంబు
పతితపావన మహాకోన్నతసుధీజీవన
సారవిద్యామృత పూరితంబు
విపులకృపాసార వీచికాంతరచల
ద్విద్వత్కవిమరాళ విలసితంబు
బహుళదుర్జనమద ప్రహరణ పరిమాణ
క్షీణకోపబుద్బుద సంచయంబు

ఆ–వె. నైనమానసాంబు జాకరుండామ్నాయ
మూర్తియభిమతప్ర పూరితార్థి
తనిచయుడరివనద హనుడు విశ్వంభర
దేవభూవిభుండు కోవిదుండు. 7

తే–గీ. సౌఖ్యముగశాలివాహన శకమునందు ||
పదునొకొండవదగుశతాబ్దమునసితడు
క్షీణతా విరహితశీత కిరణుడనగ
ద్వాదశాబ్దంబు లిలనేక దళభరించె. 8

క. ఆనృపతికిఁ గల్గిరిస, తూనులు నల్వురురణోగ్ర శూరులుశౌరి
ధ్యానపరాయణులుజయ, ధ్యానోపేతాంగణులును వారెవరినిర్వ. 9

సీ. ఏవిభుం డఖిల విద్యావిశేషజ్ఞత
గణపతిదేవ విఖ్యాతిఁ గాంచె
నేరసజ్ఞుఁడు మొక్కవోని వారిసత్కృపఁ బ్రోవ
బాలభాస్కరదేవ లీలఁ గాంచె
నేనేత మదనారి దానవాళివధింప
నరసింహదేవుండ నంగమించె
నేభూవిభుండు ధరాభరంబు వహింప
విశ్వంభరుండన వినుతిఁ గాంచె
తే-గీ. నాగహించిరి బాలేశ వీరగణప
తిప్రభుఁడు బాలభాస్కర దేవవిభుడు
శ్రీవిభాసితనరసింహ దేవనృపుడు
సాంద్రగుణపాళి విశ్వంభ రేంద్రమాళి. 10
క. గజపతి వంశాభరణులు,
సృజనోత్తరానుకూల వేషాభరణుల్
విజితార్క సుతవితరణులు,
విజయరమాసహితమహిత పృథులగుణమణుల్. 11
వ. ఇట్లొప్పు నప్పుత్ర చతుష్టయంబును నఖండదోర్దండ కోదండ పాండిత్య
వైఖరీ విశేషంబున దినదిన ప్రవర్ధమానులై యొప్పుటయు. 12

గణపతి దేవు వృత్తాంతము.

క. శ్రీలీల లలరు నానర, పాలచతుష్టయమునందు ప్రథముఁడు ధరణీ
నాళీకాక్షీభృతినా, బాలేశ్వరవీరనృపతి ప్రభువై యొప్పెన్. 13
క. ఘనసింహాసనపతియై, తనరుచు ధర్మము చతుష్పదములనడుపుచున్
మనునిభ వినీతిలీలా, జనితస్థితిపాలనంబు సలుపుచునుండన్. 14
సీ. సకలయాచకబృంద శుకశారికాళికే
సచివుహస్తంబుర సాలశాఖ
విద్వత్కవిసురాళి వితతికే ఘనుసభా
స్థానంబు మానస సరసిసీమ

సముదారినృపకుంభి సమితి కేమంత్రీంద్రు
నురుయోచనలుశృంఖ లోత్కరములు
ప్రకటవిద్యాలతా పాళి కేమహానీయు
వాక్సీమవిపులాల వాలతలము.

తే-గీ. అతఁడుహిమశైలసేతుమ ధ్యస్థశస్త
యశుఁడుగణపతిరాజద యావిశేష
పాత్రుఁడఘహరకాశ్యప గోత్రుడగుచు
నలరెశ్రీగోపరాజురా మాహ్వయుండు. 15

శా. రాజ్యాంగంబులు బెక్కునేర్చిదృఢశౌ ర్యప్రౌఢిమన్ భూరిసా
మ్రాజ్యశ్రీజనరక్షణేక్షణకృపా రమ్యాత్ముఁడై నిశ్చల
ప్రాజ్యప్రాభవమొప్ప శాత్రవభిదా పారీణుఁడై సత్కళా
పూజ్యత్వంబున మంత్రిపుంగవుడనన్ బొల్పొందె నిద్ధారుణిన్. 16

వ. అట్టియెడ. 17

క. తనరాజ్యంబున భూసుర, జనులకుచితవర్తనములు జరుగుట లేమిన్
ఘనకరుణన్ స్వజనచయా, వనయను రామాయణోక్తివగుసదలిర్పన్.

క. ఏనీనృపాలవరకృప, చేనీవిప్రప్రతతికి జీవనవసతుల్
బూనిక చేనొనరించితి, నేనిలభింపునిక నాకు నిహాపరఫలముల్. 19

వ. అనితలంపుచు నిజమనోరథ సఫలీకృతాభిలాషా యత్తచిత్తుండై యే
తన్నృపాలకృపా విశేషంబున ధర్మశాసనపూర్వకంబుగాభూసురకోటికి
షోడశమహాదానంబులిడుచు తరుణంబునకు నిరీక్షింపుచుండ. 20

తే-గీ. భువినివేయుఁనర్వదియేడు బొసగుశాలి...
వాహశకగతరక్తాక్షి వర్షభాద్ర
పదబహుళపక్షదర్శభా మదివసమున
సర్వభయదరవిగ్రాహ సమయమయ్యె. 21

## సూర్యగ్రహణ వర్ణన.

చ. సురలతిభీతిఁదూల దితిజుల్ కుతుకంబునఁ దేలఁ బక్షులు
ప్పరమున డిగ్గిసీడముల వ్రాలనభంబు సనీలమేఘవి

స్తరరుచిఁ గ్రాలతారకలు ౹ దారగతిస్థితిఁ బ్రీలగోసము
త్కారములు క్షేత్రముల్విడచి ౹ తారగఁజాలత మిస్రమేర్పడన్. 22

క. దిక్కరులుక్కుజెదరిబడ, చుక్కలగుమి గగనవీథిఁ ౹ జూడ్కులబడగన్
పిక్కటకంధులుగలగగ, దిక్కులుగాన్పించకుండ ౹ దిమిరముగ్రమ్మెన్.

భుజంగ ప్రయాతము.

క్షితింజంతుజాలంబు ౹ జేట్పాటుజెందన్
శతారంబుగోత్రంబు ౹ చక్కాడుతేజో
భృతిన్ కేతువజ్రాప్త ౹ బింబంబుపట్టన్
పతంగోపరాగంబు ౹ వాటిల్లెనంతన్. 24

వ. మఱియు నయ్యుపరాగంబు దివాంధకార బంధురంబగుటను లూకాలో
కంబును కుహూసుఫల సమాగత కృష్ణాత్మక ద్విజప్రతీతంబగుటను
ద్యానంబును పతంగగమన భంగీకరణంబగుట సువృష్టియును సముల్ల
సితతారావిరోచనసమాకీర్ణంబగుట బృహస్పతీ నికేతనంబును కేతు
ప్రభాసితంబగుట రథంబును పర్వానుగతంబగుట భారతంబును ని
త్యకాండంబుననుకరించి ముప్పిరిగొన్నకప్పన నుప్పరంబెల్లఁ గప్పి
కొని నెప్పగిదినైనఁదెప్పరిలఁ జొప్పడరాని మహాదాశ్చర్య విశేషంబు
న పరిశోషిత ధరామండలంబై యున్నయెడ. 25

క. సర్వోత్కృష్టంబగునా,పర్వంబునస్నానవిధులు ౹ పచరింపంగన్
సర్వజనుల్తీర్థములకు, పర్వులిడుచునుండిరధిక ౹ భక్తిదలిర్పన్. 26

రాజు కృష్ణాస్నానమున కేగుట.

చ. తదవసరంబునన్ నృపతి ౹ తాజలకంబునకేగుదెంచనె
మ్మదిఁదలపొందితద్దయున ౹ మాత్యునిగూరిచి తీర్థమాడబో
యెదముపురోహితప్రముఖు ౹ లెల్లరురానియమింపునావుడున్
ముదమునఁదానభీష్టఫలమున్ గొననోపు నటంచునెంచుచున్. 27

క. భూసురులకెల్లతనమది, లోసలుపగనెంచుతెఱగులువినిచిరాకం
డీసుమ్మియనియనుజ్ఞనుఁ, జేసిన్నృపాలునకువినయ ౹ చిత్తముననున్.

క. దేవాభవదాజ్ఞను శిర, సావహించికొనివిప్ర । సంతతినెల్లన్
రావింపఁబనిచినాఁడను, వేవేజననొప్పు స్నాన । విధులొనరింపన్. 29

ఉ. నావుడు గౌతుకాన్వితమ । నంబున పావనతీర్థసేవనా
భావమునన్ సువర్ణమయ । పాత్రలమంగళవస్తుసంతతుల్
గ్రేవలఁ బూని సేనకులొ । గిన్ జను దేరన మాత్యయుక్తుఁడై
తావెడలెన్ గజంబునను । ధామయ వాణికిఁ గృష్ణవేణికిన్. 30

క. చనిచని గంగంగనివం, దన మొనరించి పితృతర్పణములిడి సీరం
బున నిలిచి బాడబులనే, రిని గానకఁ గలఁక మదిని । రేఁగి సచివుతోన్. 31

ఉ. ఏరి పురోహితప్రముఖు । లేరి మదాశ్రితవిప్రబృందముల్
ఏరికి నేరికిం దెలిపి । తెప్పుడు రా నియమించితింతకున్
వారలరామి కేకతమొ । పల్కుము మేమిక స్నానకృత్యముల్
నేరుచుటెట్లు నాఁ బ్రభుఁడతి । దీనతఁ దోపవచించెఁ ముగ్ధుఁడై. 32

శా. ఏవిప్రుండనమాన్యపుంగవుఁడవు । ర్వీశాధవద్భృత్యుఁడన్
నీవాత్సల్యదమూడంబు నెదనెం । తే కోరియున్నాఁడ సం
భావింపందగుమన్మనోరథము దీ । ర్పం జెల్లు సంకల్పమున్
నేవిజ్ఞాపనసేతునావుడు నసం । దేహాత్ముఁడై యిట్లనున్. 33

తే-గీ. సంతసించితి నీదు వా । క్సరణికిపుడు
స్నానకృత్యంబులొనరింప । సమయమిదియ
గాన నవధానివగుచుసం । కల్పవిధులు
దెల్పుమనన ట్లుచేసెన । నల్పమతిని. 34

వ. తదనంతరంబ యానరపాలోత్తంసుండు సమంచితోత్సుకుండై నిగమచోదితప్రకారంబునఁ గృతస్నాతుండై పితృతర్పణాదినిత్యకృత్యంబులం బరివర్తించి యక్షీణకృపాకటాక్షంబు వీక్షణంబులన మాత్యునీక్షించి.

క. కోరుము నీకోరికలం, దీరుపఁగఁ దలంచితి భవ । దీయసమయవా
క్పూరణమునకరుదగువి, స్తారఘృణాగణ్యరామ । సచివవరేణ్యా. 36

## మంత్రి ముద్రాదానమును గోరుట.

శా. ఆలోకించి యమాత్యమౌళిపరమా హ్లాదంబు సంధిల్లగా
నీలం నిల్చిన మానవేంద్రు నెదుటన్ గేల్దోయి సంధించి మీ
లీలన్ ముద్రిక బూని యామమిలఁ బాలింపం దలంపొందె భూ
పాలోత్తంస మనన్మనోరథము సాఫల్యంబు నొందింపుమా. 37

వ. అనిన విని. 38

మ. ఒక యామంబున సగ్గు భోగమునకై యూర్జిల్లి గాంగేయరా
ట్యకరీంద్రాశ్వపురాగ్రహార పశుధాన్యవ్రాతముల్ వృక్షో
రక యున్నాఁడ పయోమదీయ దయఁ జేర్పన్ సార్థమే మింక ద
ర్పక సౌందర్యవిశేష నావుఁడు బహర్షంబొప్పఁ దానిట్లనున్. 39

క. ఏవేళ మాకు నిచ్చలు, తావకసముఖంబె పన్నిధానముకొలిం
కేవియు లేవికగణపతి, దేవా నేయేలసనుమ తీపరిపాలా. 40

చ. అనవిని సంతసించి నృపు డట్టుల సేయఁగ కాఁదలంచినె
మ్మనమున బ్రేమయుస్ఫూతిల మానిత సద్గుణ గోపరాజురా
మనసచివాగ్రణిన్ గనిన మాహితచిత్తముతోడ మ్రొక్కియా
జనపతి సంతసింపుచును సంగెను సోదక వాక్యదానమున్. 41

వ. తదనంతరంబున నయ్యిరువురును సంతోషవిశేషంబున భృత్యప్రముఖ
పరివేష్టితులై నిజాగారంబుల కరుగుదేరి రంత. 42

సీ. సచివుండు లౌకిక జనముల రావించి తనదు మనోరథం బును నచించి
ధరణీశు కడకేగి తానొనరించిన తెరగు వారలకు బోధించి మించి
మన దేశమందు బ్రహ్మస్వాప్యము లొనర్చి యుత్పత్తి సాఫల్య మొందనెంచి
యుంటిగావున మీరలుత్సుకులై కొండవీటి రాష్ట్రంబున వెలయుసర్వ

తే-గీ. పురములకు విప్రులధిపులై పొసగివారి
వారి వంశపరంపర వర్తనలుగ
భూమిముఖరషోడశదాన ములకు ధర్మ
శాసనంబుల దెందుమా సముఖమునకు. 43

తే-గీ. అనుచుఁద్రుటిమాత్రమునవారి ఽ ననిపిదాన
ఖండభూభరణోద్దండ ఽ పాండితప్ర
చండదోర్దండుడై సభా ఽ స్థానమందు
జేరినృపతిఁబరాకులఁ ఽ జీరిపలికె. 44

క. రాజావై భవజితసుర, రాజాముఖచారుతాతి ఽ రస్కృతరాజా
రాజద్రవితేజాసాం, ఖ్యాజయగజపతికులీన ఽ గణపతిరాజా. 45

తే-గీ. అవధరింపుము బాలేశ్వ ఽ రాఖ్యవీర
గణపతిప్రభుచంద్రమ ఽ త్కామితంబు
దీర్తునని తారుబల్కనే ఽ తెంచినాడ
భద్రపీఠస్థుఁజేయుడీ ఽ ప్రమదమెసఁగ. 46

వ. అనుటయు బాలేశ్వరవీరగణపతిదేవ భూవిభుండధికోత్సుకుండై నవన
వానందాద్భుతంబులు మనంబునఁ బెనంగొన నవ్వింతఁగనుంగొనన భి
లషింపుచు. 47

చ. కనుగొనిమంత్రిశేఖరుని ఽ గాఢకృపారసదృష్టిపాతముల్
బెనగొనఁబాణిఁబాణిఁగొని ఽ ప్రీతిదలిర్పగసింహపీఠిపై
నునిచినిజాధికారమిడ ఽ నుంగరముంగర మందుఁజేర్చినీ
మనమలరంగనేలుము స ఽ మస్తధరావలయంబునావుఁడున్. 48

మంత్రి రాజ్యపాలన సేయుట.

తే-గీ. అధికకుతుకాత్ముఁడై ప్రభు ఽ నాజ్ఞవడసి
భద్రపీఠస్థుఁడై నృప ఽ ప్రాభవమున
ఘనతరంబగు రాజ్యపా ఽ లనముఁబూని
దండిసభనునిండోలగం ఽ బుండునెడల. 49

క. తనుపనుపనాశ్రితులువేఁ, జేనిశిల్పిప్రచురతామ్ర ఽ శాసనవితతుల్
గొనియాత్మసముఖమునకుం, జనుదేరగఁజూచిదరహ ఽ సనవదనుండై.

స్రగ్ధరావృత్తము.

రుద్రశ్రీశౌర్యధుర్య । శ్రుతికథితపదా । రూఢబావుండునిత్యో
న్నిద్రవ్యాపారకార్యా । ద్భుతచతురసుధీ । పూర్ణదివ్యానుకంపా
భద్రప్రాచుర్యచర్యా । పటుడయికమలా । భర్తృకారుణ్యసిద్ధిన్
ముద్రించెన్ దామ్రపత్రం । బులమహిసురుడా । భూమివృత్తిక్రియాదుల్.

వ. ఇట్లొక్క త్రుటిమాత్రంబున నసంఖ్యాపరిమితంబులగు శాసనంబుల నర్పించి. 52

గోపరాజు రామన్నగారు కరిణీకములుద్ధరించుట.

సీ. వివిధవిద్యావిశే । షవిధానశేషాహి
వేమప్రచారులా । ర్వేలవారు
విపులవిశ్రాణన । విఖ్యాతిజితశిబి
హరికుమారులునంద । వరపువారు
ప్రతిపక్షవారణ । ప్రథితమంత్రాంగవి
జ్ఞానశారదులాది । శాఖవారు
దేశపాండ్యసమాజ । దేశాహిరాజసం
కులతాపరులుమంత్రి । కులమువారు

తే-గీ. మొదలుగాఁ గల్గులౌక్యస । మూహములకు
రవిశశాంకనక్షత్రగో । త్రాధరంబు
లంబునిధులెంతకాలముం । డంతకాల
మనుభవింపుడనుచునుస । మాదరమున. 53

ఉ. ఇచ్చెన శేషభూదివిజ । బృందములెల్లనుతింపవేడుకల్
హెచ్చగవిద్యముల్ వసన । హేమవిభూషణభూప్రయుక్తిగా
నిచ్చెంబురాధికారముల । హీనమహాగణికాప్రధానతా
భ్యచ్ఛయవృత్తిశాసనస । ముద్ధరణంబొనరించిరిచ్చటన్. 54

తే-గీ. గ్రామణులుగని యోగిసం । ఘములఁజేసి
వైదికద్విజకోటుల । వారికెల్ల

తేషాంశ్రేష్ఠతమామాత్యోయాజ్ఞవల్క్యత్తమోద్విజః ।
గోపరాజాన్వయోత్పన్నో రామాఖ్యోగణకాగ్రణీః॥ 3
రక్తాక్ష్యబ్దేమాసిభాద్రపదేబహుళపక్షకే ।
దర్శేర్కగ్రహణేపుణ్యకాలేంగారకవాసరే॥ ౪
గణికానాంవిహితార్థాయసద్యశ్స్థాపనాయచ ।
లిప్తతశ్శశిమార్తాండౌయావత్తావచ్చవర్ధతాం॥ ౫
తేషాంరాజ్ఞాగ్రహీత్వాణాంకృష్ణవేణీతటేతథా ।
గ్రామస్థావరవృత్తీనాంసాక్షిణాస్సర్వదేవతాః॥ ౬
తస్మార్థర్మమిదంసత్యంనిర్మితంయోదురాత్మనాం ।
కరోతిచేదన్యథాసౌజాయతేఖరయోనిషు॥ ౭
ఆపస్తంబస్యసూత్రస్యశాఖాభేదఃప్రఉచ్యతే ।
యాజ్ఞవల్క్యతివిఖ్యాతోగోత్రంకాస్యపఇత్యథా॥ ౮
విప్రాణాంశాపముద్వేషంవేదభాష్యాశ్చకారయత్ ।
తచ్ఛాపవిముక్తిత్వంభానుశక్త్యాద్యపండితః॥ ౯
మాఖమాసేసితేపక్షేవిజయేవత్సరేతథా ।
పంచమ్యాంరవివారేచయాజ్ఞవల్క్యోద్భవోభవత్॥" ౧౦

వ. అనియిట్లు వినిపింప. 60

సీ. మంజులశ్రుతిపుటీఁరంజనంబుగబల్క విని విభ్రమానందఁవివశుఁడగుచు
సచివుఁగౌగిట జేర్చిఁసత్కృపాసంగుడై యురుభక్తియుక్తిబఁహూకరించి.
నీజన్మ సంసిద్ధిఁనెరపితి మజ్జన్మసాఫల్యమియ్యెడఁసలుపవైతి
వేయుమాటలు దలఁపోయ నేటికి పూర్వకర్మానుగతి నాకుఁగలుగదయ్యె

తే-గీ. నైననీబుద్ధి కుశలతఁనస్మదీయ
జన్మ పావనముగ సూర్యఁచంద్రతార
లుండువరకుండనీకార్యఁమొఁనరిచితివి
నీఋణంబెట్లుతీర్పంగఁనేర్తునయ్య. 61

తే-గీ. అనుచుబహువిధములఁసచివాగ్రగణ్యు

హవ్యకవ్యములకునాశ్రితాళిగాఁగ
ద్విజులకిటుజీవనావనస్థితులొనర్చె! 55

### మంత్రిప్రభువునకు రాజ్యముమరలనిచ్చుట.

వ. అట్టియెడనీకొండవీటిపురంబునకుఁ గౌశికసగోత్రజులును. నాపస్తంబ సూత్రులును నగు కొండాన్వయుల కేకభోగముల కరిణీకంబునడిపి తద నంతరంబయ్యమాత్యచూడామణి ప్రభుత్వకాలనిర్ణయానంతరంబున నమ్మహీశుపాలికింజని స్వధర్మానుష్ఠానంబునన్నృపతింజేరి దేవాయుష్మదను గ్రహాతిశయంబున మదీయమనోరథంబు దీర్చుకొంటినిక కాలాతిక్రమ ణంబయ్యెగానముద్రికంగొండనియర్పింపుటయు నృపాలుండుభవదీయ ప్రభుత్వప్రకారంబభినయింపుమనవుడు సవినయ వివేక భాషణభూష ణుండై యిట్లనియె. 56

మ. ఘనమాతావకరాజ్యమందుసకలగ్రామాధికారంబులన్
జనితానందనియోగిభూసురులకున్ సాగించితద్ద్విలే
ఖనముల్ సేయుచు గొల్వనేర్పరచిరకౌదృష్టితాంబూలచం
దనహేమాంబరరత్నయుక్తముగభూదానంబులం జేసిశా
సనముల్గూర్చితినీయశంబుభువి నాచంద్రార్కసత్ స్థాయిగాన్! 57

తే. అస్థిరములుశరీరములాస్తలేని
చిత్తములనుంటిమిక జన్మసిద్ధిమనకు
నగుటకిహపరసౌఖ్యంబులందగణిక
సరణిఁ జేసితిభూసురస్థాప్యములను. 58

వ. ఎట్లనిన. 59

### శాసన శ్లోకములు.

"గోత్రశాస్త్రింబరేందూనాం సంఖ్యాబ్దేశాలివాహనే ।
గ్రామస్థావరవృత్తీనాం ప్రథమోగణకాగ్రణీః ॥ ౧
శ్రీమాన్గణపతిర్యాభపోగజపత్యన్వయోద్భవః।
అస్తిభూమండలేతస్యబహవస్సంతిమంత్రిణః॥ ౨

నూరడింపుచు నుత్సాహమ్ముల్లసిల్ల
బలసి సామంతనృపులుకప్పంబుల ప్ప
గించనతి నీతిచేతనమంచితముగ. 62

క. పాలించెం బెక్కువర్షము, లోలి దిగంతరమహీశులుత్కటసేవా
శీలస్థితిఁగొలువఘన, శ్రీలంబ్రజల్ దనియఁబుడమిఁజేడియఁగడకన్. 63

వ. తదనంతరంబ యీతనితమ్ముండగు కాకతీయరుద్రదేవభూపతి ప్రభుతులు
పాలించుటయనంతె. 64

రెడ్లవృత్తాంతము.

క. ధరలోనఁగృష్ణవేణ్యు, త్తరమున వైశ్రవణురాజధానియనఁగ సుం
దరమౌచుఁజదలవాడన, గరమమరుందానఁనుండ్రు కాపులెవరన్. 65

సీ. బాడబాశీర్వచోవర్ధమానైశ్వర్యవంతులైతగువారుదొంతివారు
విద్యావిశేషప్రవీణతానిర్దోషవంతులైతగువారుదొంతివారు
విదురయోగనిదానవిదితతత్వజ్ఞానవంతులైతగువారుదొంతివారు
గోత్రానలయభాగపాత్రబాహుదాగవంతులైతగువారుదొంతివారు

తే.గీ. కంతురుచిరశరీరులాదొంతివారు
తుహినకరకీర్తిసారులాదొంతివారు
ధూర్జటిధనోరుధీరులాదొంతివారు
శాంతహృద్ధీరులారెడ్డిదొంతివారు. 66

క. ఆదొంత్యాన్వయసంభవుఁ
డైదినదినవర్ధితాఖిలైశ్వర్యయశ
శ్రీదుండల్లారెడ్డిమ
హీదయితసమానవిభవమెసగుచునుండున్. 67

తే-గీ. శ్రీచదలునాడనామపురీవరస్థ
రాఘవపదాబ్జసేవాభిరాముడగుచు
తత్ప్రసాదసమాసాదితప్రమోద
రాజితుండయ్యెఁ దచ్చతుర్థకులభవుడు. 68

అల్లారెడ్డికి ధనములభించుట.

మ. లసితాకారుడుదొంతివంశభవుడల్లారెడ్డి యొక్కర్థుఁడై
కృషి సేయంజని దున్నుచుండగ హలశ్శృంగో ద్ధతి క్షేత్రమ
ధ్యసముత్కీర్ణసువర్ణకుంభనిధిచెంతంగాంచి యానందమా
నసుఁడైచేకొని రాఘవేంద్రుకరుణన్ బ్రాప్తించెనంచేగినన్. 69

చ. అదివిని పౌరులెల్లరు ధనాహరణేచ్ఛలడాసి రెడ్డిపై
గదియుచుఁదద్ధనగ్రహణ గాఢదృఢాగ్రహవృత్తి మూగనా
పదజనరుండు భీతుఁడయి పైఁబడుటన్ దొలగింపు మంచునా
మదనగురున్ సురావనుని మాధవునిన్ నుతియించెనీగతిన్. 70

అల్లారెడ్డి వీరరాఘవస్వామిని స్తుతించుట.

ముక్తపదగ్రస్తసీసము.

శ్రీరమణీమనోహరహారోదార దార రాగా ధార ధారణాఢ్య
దీనావననిదాన దానవాధిపదానదానభృద్వరదాన దానకల్ప
రాజత్కృపారంగ రంగద్విబుధసంగసంగ హేమకురంగరంగధామ
మారకోట్యాకార కారణార్పితభారభారసారుణసార సారసాక్ష.

తే-గీ. దశరథసుతాంచదవతారతారకాత్మ
సాలి తాఖిలరసుజాలజాలహరణ
సంతతస్తుతమునిజనజనకజేంద్ర
రక్షితమహేంద్ర శ్రీవీరరాఘవేంద్ర. 71

## మహారథబంధము.



సీ. శ్రీవిశ్రుతాఖ్యనతావనచిత్సౌఖ్యచలదింద్రనీలకోమలశరీర
ఘోరారినిర్మూలకోదండదోర్మూలదైత్యరాణ్మండూకదందశూక
ఖండితరిపుకాండకాండలోకపిచండ దశరథరాజన్యతనయమాన్య
మతి మద్విచారగుర్వతిపౌరుషబ్రహ్మమయరూపజిహ్మకర్మానుతాప

తే-గీ. మన్మథమనోజ్ఞ కాయ ే సన్మౌని గేయ
పక్షిరాడ్వాహ వారాసింధుసం ే వసిత గేహ
రంజితజ్ఞానగుణధామ ే రామనామ
రఘుకులోదారదుగ్ధవా ే రాశిచంద్ర
రమ్యగుణసాంద్ర శ్రీవీర ే రాఘవేంద్ర. 72

అంత్యప్రాససీసము.

దివ్యద్యుమణిలస ే న్నవ్యరత్నకిరీట
రయకళాద్భుతపత్రి ే రాజఘోట
బహుచమూకృతవాయు ే భవముఖారణ్యాట
పరిమర్దితోగ్రరా ే వణనిశాట
సతతాయనీకృత ే స్వచ్ఛభూరికృపీట
భంగీకృతాభీల ే వల్మీకాట
దూరీకృతోదగ్ర ే వారణేంద్రారాట
సీతాసహావాస ే చిత్రకూట
తే-గీ. ఖరవిరాధకబంధరా ే క్షసవిపాట
అద్రిబంధనిరాఘాట ే హాతవనాట
అధికపాలితకౌశిక ే యజనవాట
రక్షితమహేంద్ర శ్రీవీర ే రాఘవేంద్ర. 73

ద్విపదమత్తేభవిక్రీడిత ఆటవెలది తేటగీతి కందగర్భితసీసము
వినతసంరక్షణ ే విశ్వసృడ్జనక నానావేషభాషాఘనాఘనాంగ
ప్రనుతపద్మోద్భవ ే పాలితత్రిదశసంఘదోహాదినేంద్రప ే భాహరాప్త
విధృతిసంక్షిపిత ే విశ్వపోషకరమాధీశ సరోజేక్ష ే ణాశుభాంగ
విధృతగోత్రాధర ే వేదవేద్యవరచారిత్రప్రశస్తాహ ే శ్రీముకుంద
తే-గీ. సనకముఖసుజనవిసర ే శరణనరప
తిరిపుసమదహారనృహరి ే పరమవినుత
నరసఖనిజనతతరణ ే నిరుపమభవ
ధరణిధరభరణవిమల ే తరణికులజ. 74

గర్భద్విపద.

వినతసంరక్షణ । విశ్వసృడ్జనక ప్రనుతపద్మోద్భవ । పాలితత్రిదశ
విధృత సందీపిత । విశ్వపోషకర విధృతగోత్రాధర । వేదవేద్యవర

గర్భమత్తేభవిక్రీడిత వృత్తము.

నతసంరక్షణవిశ్వసృడ్జనకనా । నావేషభాషాఘనా
నుతపద్మోద్భవపాలితత్రిదశసం । దోహాదినేంద్రప్రభా
ధృతిసందీపితవిశ్వపోషకరమా । ధీశాసరోజేక్షణా
ధృతగోత్రాధరవేదవేద్యవరచా । రిత్రప్రశస్తాహరీ

తేటగీతిగర్భితాట వెలది.

సనకముఖసుజనవి । సరశరణనరప
తిరిపుసమదహరన్నృ । హరిపరమవి
నుతనరసఖనిజన । తతరణనిరుపమ
భవధరణీధరభర । ణవిమలతర.

తేటగీతిగర్భిత గురుద్వయయుక్త కందము.

. సనకముఖ సుజనవిసరశ
రణనరపతిరిపుసమదహ । రన్నృహరిపరమా
వినుతనరసఖ నిజనతత
రణనిరుపమభవధరణీధ । రభరణవిమలా

ప్రతివాక్యాద్యక్షరనియమసీసము.

రామావతారణా । రాజభిద్వారణా రాజత్కృపాసాంద్ర । రామచంద్ర
రాజీవదళనేత్ర । రక్షోలతాదాత్ర రసపూరమృదుభాష । రమ్యవేష
రాకాశశాంకాస్య । రహితమాయాలాస్య రామవిక్రమధుర్య । రక్షితార్య
రాజితమణిహార । రాధికాహ్వాచ్ఛేరరాసకేళీలోల । రాజ్యపాల
తే-గీ. రసికనుతికేళికాపాత్ర । రణవిచిత్ర
రవికులోద్భూతసౌజన్య । రాజమాన్య
రాగమూలక్రియాదూర । రాగసార
రక్షితమహేంద్రశ్రీవీర । రాఘవేంద్ర.

సీ. కనకకస్యపపుత్రుఁ ఽ గన్నకృపాదృష్టికరి నేలినట్టిసం ఽ కల్పపుష్టి
అక్రూరుపైఁగల్గు ఽ నతిదయాసారంబువిదురు నేలినభూరి ఽ వితరణంబు
ద్రౌపతిఁ గాచువ ఽ స్త్రప్రదానవిధంబు అంబరీషునిఁ బ్రోచు ఽ నభిలషితము
నరునిపై నుంచిన ఽ పరమార్థ భావంబు ఆకుచేలుపయిబ ఽ హూంకరంబు
తే-గీ. నాపయినిఁగొంతరానిమ్ము ఽ నమ్మినాను
ఆపదలనుంటి నేడునీ ఽ ప్రాపుగంటిఁ
బ్రోవుమో రామచంద్రకా ఽ రుణ్యసాంద్ర
రక్షితమహేంద్ర శ్రీవీర ఽ రాఘవేంద్ర. 76

స్వప్నమున రెడ్డికి స్వామి ప్రత్యక్షమగుట.

వ. అనియిట్లుచ్చతుర్థ వంశవివర్ధనుండుత దేకనిష్ఠాగరిష్ఠుండై యిష్ట దేవ
తావతంసంబగు శ్రీ వీరరాఘవో త్తంసుని ప్రార్థించుటయు నప్పరమ
కృపాళుండగు రమాలోలుండుతద్భ క్త వరునిడుమ లెడలింపఁదలంపొం
దినాటి రేయి నాతనిస్వప్నంబున హరిప్రత్యక్షుండై. 77
తే-గీ. పలికె నల్లాఖ్యుతోదయా ఽ స్వాంతుడగుచు
వత్సతక్షణమీవీడు ఽ బాసివిపుల
దండనాయకపరిపాలి ఽ తస్థలంబు
చెచ్చెరకుటుంబయుతముగ ఽ జేరుమికను. 78
చ. అచటనురాఘువాకృతిన ఽ హర్ముఖకోటివిభాకరోజ్వల
ప్రచురవినూత్నరత్నయుత ఽ భర్మమయప్రతిమన్ సృజించినీ
వుచితసమార్చనారతిని ఽ నుండుముభద్రముగూడునంచుఁదా
రుచిరవచోప్రచారణప ఽ రుండగుచున్ గృపనానతిచ్చినన్. 79
తే-గీ. అధికధృతిబూని వేగఁదా ఽ నచటుఁబాసి
సతిసుతహితాదిపరివార ఽ సహితుఁడగుచు
దండనాయకపాలితో ఽ ద్దండమైన
హనుముకొండనువసియించె ఽ నతిరయమున. 80
చ. ఘనతరనూత్నరత్ననవ ఽ కాంచనరాజితమైనరాఘువేం
ద్రునమరిపించినైష్టికప ఽ రుండగుచున్ ధరణీసురోత్తరం

బునభజియింపుచుండె నచిరపుల్ బుధులాప్తుల నూనభక్తిఁద
న్ననిశముఁ గొల్వఁజెన్నదవె నప్పురిముప్పిరిగొన్న సంపదన్. 81

చ. పురములు జాగిరుల్ వనులు భూములు కండ్రిక లగ్రహారముల్
వరగజరాజబృందములు వారువముల్ రథముల్ భటావళుల్
ధరఁగలరాజసంపదలు దారము దాప్తిఁ బరిగ్రహించి తా
నరిదిగనుండె భూసురుల హర్నిశమున్ వినుతింపుచుండగన్. 82

వ. ఇట్లుండి. 83

క. విదితగిరికంధిసోమకు, ముదహితసంఖ్యగతశక ౧౧౮౭ స ముద్యత్సంప
త్ప్రదమగు తారణవర్షము, మొదలసుభిక్షుతర కాలమున నుత్సుకుఁడై.

“దృష్టాంతం శ్లో. శ్రీమచ్ఛకాబ్దేబుషి వార్ధి రుద్ర
సఙ్ఖ్యాప్రవర్తేసతి తారణాబ్దే
అల్లాతభూపేను ముకొండదేశే
దాంతాన్వయా కుండిన రాజధాని.” 85

అల్లారెడ్డి కుండిన దేశమునకు చేరుట.

సీ. వేదవేదాంగసంవేద్యులౌ వివిధ విద్వాంసులొక్క దిశను పన్యసింప
హితమిత్రభేదసుహృల్లాభసంధివిగ్రహముఖచణమంత్రిగణములలర
నిజబిరుదాంకమానితగద్యపద్యార్థకృతిపరద్వంది సంతతులుగొల్వ
ఘోరపత్రాపనిర్ధారణాధుర్యనాశీరనాధులు తనుఁజేరినిల్వ
తే-గీ. కుండినపురీసుదేశదిక్షోణియందు
కొండపల్లికి దాపునఁ గొమరుమిగులు
నట్టిదగు కవులూరను పట్టణమున
సౌధములుగట్టినసియించె సౌఖ్యముగను. 86

క. కవులూరిలోననాతని, నవవిభవాస్పదగృహంబునకొక దినము మా
ర్గవశంబున వేమనయను, త్రివర్ణజుఁడు విశ్రమింప దిగియితని గనన్. 87

మ. అతఁడభ్యాగత సేవనాభిరతుఁడై యత్యంత మాధుర్యవా
గ్వ్రతతిన్ వేమన నాదరించి కుశలోక్తిన్ జెప్ప నాలించి స
మ్మతితో భోజ్యపదార్థవారమిడి కొమ్మా వెళ్యవే భోజనా
దృతిఁగైకొమ్మ యటన్న నౌననుచు నెంతే మోదచిత్తంబునన్. 88

సీ. వేమనాభిఖ్యుండుఁవింధ్యాద్రివసియించివరఋషికృపఁగొన్నఁస్పర్శవేది
నొకపాత్రనిడివస్త్రఁశకలినిబంధించి చిలకొయ్యనిడికల్యఁములనొనర్ప
జనుటయువిధివశంబునఁదద్రసంబయశ్శకలంబునంటిహాటకముగాఁగ
గనిమాతృపితృవైరఁకారణహేమాయనమ యనువాక్యార్థఁనమ్రుడ
తే-గీ. తద్రసంబుస్రవించుచందంబు దెలసి [గుచు
కాంచనముగూర్చునాకాంక్షఁగడలుకొనఁగ.
కర్బురమొనర్చుశక్తినిఁగలిగినట్టి
స్పర్శవేదిహరించెనఁప్పాదజుండు. 89
ఆ-వె. తనదుగీమునకుహుతాశనమంటించి
స్పర్శవేదియింటఁభంగమయ్యె
ననుచువైశ్యుఁడెంచిఁయరుదెంచునని కాంచి
యుండవేమనాహ్వఁయుండునచ్చి. 90
మ. విధినిందూరుచు ఖేదమొందుచుకటాఁవింధ్యాచలంబేగితే
త్కుధరంబందు మునీంద్రులంగొలిచియఁస్తోకస్థితిన్ వారిది
వృదయన్ గాంచినస్పర్శవేదివిడిపోఁవంజాలుటెట్లొప్పునె
వ్యాధినోర్వంగల నిట్టిదుఃఖమనుచున్ ఁ వేమాఖ్యుఁడగ్నింబడెన్. 91
వ. ఇట్లావైశ్యుండు వహ్ని దగ్ధుండగుటయుహుతాశనోపశమనక్రియాం
రతినరుదెంచి నపౌరులెల్లరు నతనిమృతికి నత్యాశ్చర్యమునొఁదికీలి
కీలాభీలంబులగుశాలాంతరాళంబులకీలాలంబులచేనార్చిరంత. 92
సీ. ఆరాత్రిరెడ్డిస్వఁప్నావస్థయందునావైశ్యుఁడు వేమనఁవచ్చినిలచి
దుష్టాత్మనీసేయుఁదుష్కృతంబరసితివింధ్యాద్రిఁవసియించిఁవివిధశ్రమల
బడిమునికరుణచేఁబడసినస్పర్శవేదినిహరించితివిమఁత్తీవ్రశాప
వశమునరసముభూఁపతితమైనీవంశహరణ మానటులసేయఁగలనైన
తే-గీ. నీయెడఁగృపారసముగల్గెనీవునాకు
మున్నొసంగిన యాతిథ్యఁమునకుఁబదులు
మేలుగా వరమిడెదనఁమేయముగను
వినుమనుచు దెల్పె రెడ్డికిఁవేమవిభుఁడు. 93

ఉ. తావకవంశసంభవులు దారమతుల్ నృపులార్యరాశితా
బ్ధావధిభూమి నేలుదురు వారొనరించెడు ధర్మకర్మముల్
సేవలు నాకు నర్పణము సేయుచు నస్మదభిఖ్య వారికెం
తే వెలయించినన్గొలువ నిష్టము చేకుఱు నంచుఁ బల్కినన్. 94

క. వినిభవదాజ్ఞ నొనర్చెద, ననివేమనఁ గూర్చి మ్రొక్కి నతఁడంతర్థిం
గనినంత నెమేల్కనిశో, భనలీల వసించెఁ బురి నపారవిభవుఁడై. 95

వ. అనంతరంబయితని వంశజుండగు. 96

పోలయవేమారెడ్డివృత్తాంతము.

సీ. పోలయవేమభూ పాలుండు ప్రబలుఁడై మహిఁదినదినవర్ధ మానుఁడగుచు
స్వర్ణవేదిరససంప్రాప్తగాంగేయ విస్తారుఁడై విపులప్రశస్తిఁగాంచి,
ఆత్తపాలితపురాగ్ర్యములైనధరణికోటనుగొండపలిదుర్గమును సృజించి
హయరథగజభటోచ్చయములచేనొప్పుచతురంగబలసమార్జనము
తే-గీ. కుండినమహాత్వమెఱిఁగిత క్షోణినెల్ల సర్చి.
తేరువజయించియటఁగాక తీయకులుల
కొండవీటిపురంబునఁ గూల్చియచట
భద్రసింహాసనస్థుఁడై పరిఢవిల్లి. 97

వ. అంతనమ్మహీకాంతుండు నితాంతసంతోషితస్వాంతుండై కుండిననగర
పాలనానుకూల శేముషీవిశేషంబునఁ దత్కుధరంబునంగల దుర్గంబు
లెల్లం బరీక్షించి మర్మంబులందెలసి సురనరసేవ్యంబనితలంచి తనభృ
త్యనృపాలుర నిరువురధరణికోట కొండపలిపురంబులుపాలింప నియమిం
చికొండవీటి ప్రభుత్వసంపద్యుక్తుండైయందు రాజధానిగా నివసించి
యచ్చట. 98

మ. మునుద్వాపారమునందుభీష్మముఖులా భూపాలకులుల్ సేయుచో
ప్పునఁదా సురగిరిశృంగవాసులగునా మూర్తిత్రయిన్ సారభ
క్తినిబూజింపుచునాలయంబులనురక్తింగట్టనిత్యోత్సవా
ద్యనురక్తుండగుచున్ జెలంగెహరిసే వాయత్తచిత్తంబునన్. 99

ఉ. కుండిననాగభీష్మనృప కుంజరపాలితమైఖిలంబునై
యుండినవీడుఁజూచికన కోజ్జ్వలసౌధరవీందువీథులన్
మండితసాలశాఖికల మానితమైనపురిన్ సృజించితాఁ
గుండినమంచునామమిడి కుచ్ఛితఖండనుఁడోచు నేలుచున్. 100

తే-గీ. దానికిధనేశుదిశబహు తరవిశాల
దేశముండుటఁగాంచిధా త్రీశుడెలమి
ధరణికోటనుగలమట్టి త్రవ్వికట్టె
పుట్టకోటయనగనొక్క పట్టణంబు. 101

సీ. గిరిమీదపూర్వభూ వరులునిర్మించినయిమ్ములౌఖిల్లాల నెల్లజూచి
తనదుబలంబులందునిల్వగానెంచివిపులవప్రమునూత్న విధముగాను
నిర్మించిబహురాజ నిలయంబులమరించిపౌంజులనెల్లన ప్పట్లనుంచి
వేమనమృతిలబ్ధ విపులదోషంబెల్లపరిహారమగుటకై భక్తివెలయ

తే-గీ. భర్తనిర్మితకలశవి భ్రాజితముగ
సలలితముగనష్టోత్తర శతపరిమిత
హరప్రతిష్ఠలగావించె నవ్యయముగ
ప్రమథగణముఖ్యసేవిత ప్రథితములుగ. 102

తే-గీ. చదలువాఁడపురంబున బొదలునట్టి
రాఘవునకుఁబ్రతిగనుశ్రీ రామచంద్రు
మందిరముగట్టిరామసిం హాసనమను
పేరొసగిశౌరినిల్పసం ప్రీతితోడ. 103

ఆ-వె. శ్రీయహోబలాద్రి శ్రీశైలముఖమహా
క్షేత్రములకుబోవు యాత్రికులకు
సౌఖ్యపథములలర సోపానవీదుల
గట్టెనవ్విభుండు కడుముదమున. 104

సీ. ప్రతిగుహాస్థలునుగో బ్రాహ్మణపూజలుసలిపెడువసతులు సంతరించి
ఇంటింటబావులం పెనగంగఁద్రవ్వించికవివరపండిత గణనఁబెంచి

ధీరులకఖిలాగ్రహారముల్ నిర్మించి సకలశాత్రవులెల్ల సమయమించి
తోడరియెన్బదినాల్గుదుర్గముల్ గావించి కప్పముల్ గొంచు దుర్గతులడం
తే-గీ. రామరాజ్యానుమతుడౌచు రమణగాంచి [చి
పరగఁబండ్రెండునూర్ల నల్బదియు రెండు 1242
మొదలు యేబదిమూడుగ భూభరంబు 1253
గొనియె ద్వాదశవర్షముల్ కోర్కెలూరె. 105

అనపోత వేమా రెడ్డికథ.

సీ. విద్యావిశేషదర్శకరప్రావీణ్యమహితవిద్వత్సభామండలుఁడు
పటుభుజాబలసముద్భటనృపానేకశుంభద్దర్వభంజనభండనుండు
జగదభివ్యాప్తవిశ్రాణననిజభృత్యకాండదారిద్ర్యవిఖండనుండు
నిరతసుహృజ్జనానీకసంరక్షణాఖండదుష్టజనౌఘదండనుండు.
తే-గీ. అనగబాగడికఁగనుచతుర్థాన్వవాయ
కీర్తివిభ్రాజితుఁడు చక్రవర్తివిభుడు
విమతశిక్షానుదక్షుండు విపులయశుడు
పృథులుడనపోతవేమనరెడ్డిఘనుడు. 106
క. దినదినవివర్ధనుండై, యెనుబదినలు(84)దుర్గములకు నేలికయై భూ
జను లెనలేనిముదంబున, దనరఁగఁబాలింపుచుండెఁ దన్మండలముల్.
వ. అట్టియెడనప్పట్టణసామీప్యంబునంగల పర్వతంబున శ్రీబొల్లుమూరు
వేంకటేశ్వరుని వసితంబగు శిఖరశ్రేష్ఠంబునందు. 108

సిద్ధునికథ.

మ. ఒకసిద్ధుండు నితాంతనైష్ఠికతపోద్యోగారతుండౌచు దే
వకృతంబైన రమేశుమందిరసమీపంబందుఁగూర్చుండఁగో
పకులుం డొక్కఁడు మేషపోషణకృతవ్యాపారుఁడై వేంకటే
శకుభృత్స్థానికిఁబోయి సిద్ధుఁగని దాస్యుండౌటయున్ సిద్ధుఁడున్. 109
సీ. కరుణించి గోపకుఁడ గతివిషయకుశలోక్తులను నూరడించి భక్తుని గనెంచి
నీకుపకారంబు నెరవేదనాయందు భక్తిచే సేవానురక్తుడవయి

దినదినమ్మిక నుమహత్స్వకరార్హములగు క్షీరముల్ గొని నన్నుఁ జేరవచ్చి
నిత్యంబొసంగము నీకొక లాభంబు జేకూరునటుల నే జేయువాఁడ

తే-గీ. ననుచు బోధింప గోపకుఁడౌనటంచు
నట్లు సేయనకానెంచి నదిమొదలుగ
దుగ్ధమర్పింపుచుండ చతుర్థజాతు
నిట్లనుచు నొక్కనాడు ప్రశ్నించె జటుడు. 110

సిద్ధుఁడు గోపకునితో దివ్యవృక్షవిషయమై ప్రస్తాపించుట.

ఉ. గోపక కాననెందుననుఁ గొట్టగ వేఁజిగురొత్తు వృక్షమున్
జూపితివేని నీకధిక శోభనముల్ ఘటియింతుఁగాన నీ
వేపగిదిన్ వనంబు చరియించి కనుంగొని దానిపై ఘృణల్
దోపక యుండ కంటకతతుల్ పడఁద్రోచి వచింపు మాగతిన్. 111

వ. నాపుండునతికుతుకభరితమతియై సంతతంబును మునిసేవాభిరతుండై వనంబుఁ గుమ్మరునెడ నప్పు నిబోధిత ప్రకారంబుగా ప్రతివృక్షంబునుం బరీక్షింపుచుండుటయుఁ గతిపయదినంబులకు నొక భూరుహంబును గనుంగొని కంటకప్రకరసమావృతం జేసి తద్వృత్తాంతంబు జటికిం జెప్పిన నతండును సంతసించి. 112

తే-గీ. శుభకరముహూర్తమొక్కటి చూచి జటుడు
గోపకసమేతుఁడగుచు నాక్షోణిజంబు
కడకరిగి వేదమయమంత్రకముగ షోడ
శోపచార ప్రకరపూజ లొప్పఁ జేసి. 113

ఆ-వె. శిఖిఁ దగిల్చి మాని చేబూని గోపకు
హుతసమగ్రవీతి హోత్రునకుఁ బ్ర
దక్షిణంబొనర్పఁ దరలించి వేమరు
పాటునుండఁ జూచి పదజునతడు. 114

సిద్ధుని గోపకు డగ్నిం ద్రోయుట.

శా. దుష్టజ్వాలలఁ గ్రాలు పావకుఁబడన్ ద్రోయంగ గొల్లండు దో
ర్దలప్టిన్ జూచి మదీయదుగ్ధముల నద్రింద్రావినన్ జంపె దో

భ్రష్టాచూడు మిదేవధింతు ననుచుఁ బాహాబలం బొప్పఁగా
స్రష్టాదుల్ గని విభ్రమింపఁగ సిసీ అఁ ద్రోసె వహ్నిఁ మునిఁ.115

వ. అంత న మ్ముని స త్తముండు నిరతోపవాస కృశీభూతుం డగుట నా చతుర్భుజా టోపంబున కోపంజాలక వహ్నింబడిపరితప్తుండై డ్రెళ్లుట యు నాగోపాలుండు నిజప్రాణ రక్షణ ప్రజ్ఞావిశేషంబున కుబ్బుచుఁ గొబ్బున తన గీమునకరిగి మరుదినంబున. 116

క. తనకపకృత్యమ్మును సే, యనకాదలచినమునివ్మృతుఁ డయ్యెనో లేదో,
కనివత్తు ననికుఠారము, గొనిచనెత త్తద్రుమస్థకుధరంబునకుఁ.117

వ. అచట త త్తద్రుమ ప్రభావంబున. 118

సీ. ఘనతరభుజయుగ గ్రసనాగతినిమించు
పటుతరంబగుజటా పటలమమర,
పూర్ణిమ చంద్రికా స్ఫురణజెన్నలరారు
మోపూర్ధ్వపుండ్రంపు బూతినలర,
వక్షఃకవాటసం వ్యాకీర్ణములగుచు
రుద్రాక్షసరులు శిరోధి ప్రేల,
భూత పిశాచ సంజాతముల్ దోలగించు
దండకమండలో ద్ధతితలిర్ప.

తే-గీ.విలసితంబగు సౌవర్ణ విగ్రహంబు
వైరి జడదారి రూపంబు వరలి జీవ
రహితమై నిల్వఁగాంచి తీ వ్రప్రతాప
వివశుఁడై యేర మరల జీ వించితనుచు. 119

గొల్లడు సువర్ణ విగ్రహమును చూచుట.

మ. ఖర తేజోగ్ర కుఠారఘాతఁ గరముఁ ఖండింపవే వ్రయ్యలై
ధరఁగూలం గరమెప్పటట్లు త్రుటిమా త్రఁ బుట్టి శోభిల్లఁదా
గరమాశ్చర్యము బొంది హేమహరణా కాంక్షఁ మదిఁ మేలటం
చురహాస్యంబుగఁ గేలుఁగేలఁగొని వైశ్యుంజేరె మూల్యార్థిఁ.120

తే-గీ. వైశ్యుఁడదిగని గోపక వశ్యుఁడగుచు
గోపకకులీన నీకోరు కోర్కెలెల్ల
తెలియఁజేయుము నేనిప్డు తీర్చువాఁడ
కొఱఁత లేదెందు ననునమ్ము కొంటివేని. 121

వ. నావుండును సంతుష్టాంతరంగుండై వైశ్యుంజేరి పీడ్య పదార్థంబులం
గోరి యవియెల్ల నిత్యంబును హేమమునకుఁ గొనుచుండుటయు త
ద్వైశ్యుండు కాంచనార్జనా విశేషంబున నితాంతద్రవ్యవంతుండై
ప్రభు సమ్మానంబునం బరిఢవిల్లుచుండ నీవైశ్యుని భాగ్యాతిశయంబు
నంతంతఁ జారోక్తిని దండనాయకుం డెఱింగి నిజాస్థానంబునకు నత
నిని రావించి దండించు వచనంబుల నీకీభాగ్యంబు స్వల్పకాలంబున
లభించుటకేమి కతంబని యడుగుటయు నతండు పరికంపితాంగుండై
తానెఱుంగు తెఱంగెల్ల విన్నవించిన. 122

ప్రభువు సువర్ణ విగ్రహమును గూర్చి విచారించుట.

క. వినిబంగరు బొమ్మంగన, మనమున నూహించి మిగుల మత్సరమున గొ
ల్లనిబిల్వఁ బంపి తద్విధ,మునుఁ దెలసికొనంగ నిట్లు భూవిభుఁ డడిగెన్.

శా. ఏరా గోపక కులాధమ మాయెటులనీ హేమంబు నార్జించియీ
బేరుల్ జేర్చుచునుంటి వేరినైనన్ భేదించుచున్ దుర్గతిన్
జోరత్వంబునఁ గొంటివో పలుకు మీ చొప్పెల్ల నిక్కంబుగాఁ
గ్రూరా రాసిన్ వధియింతు నక్కజపుఁ బల్కుల్ బల్కకున్నంజుమీ.

చ. అనుటయుఁ గోపకుండు వినయంబెనయన్ బరికంపితాంగుఁడై
మనవి యొనర్చి నంజలిని మస్తకమందునఁ జేర్చి దీన ర
క్షణవినుమయ్య నాయెడ పచార మొకింతయు లేదటంచుఁ దా
కనినది విన్నదిన్ గిరినిఁ గల్గిన దెల్లనుఁ దెల్లమై తగన్. 125

చ. వినివిని నెమ్మదిన్ మిగుల విస్మయమొంది కృపాంతరంగుఁడై
తనకడకుం గుమారుని విధంబున గోపకుఁ జేరదీసి నీ
మనమునఁ గల్గు కోర్కెలను మన్నెదఁ దత్ప్రతిమంబుఁ జూడగన్
జనెదము రమ్మురమ్మనుచుఁ జయ్యన గోపకు నుత్సహింపుచున్. 126

సీ. తనమంత్రులకునివ్విరోధంబు వక్కాణించి
తత్కాలమెనుముహూర్తముగ నెంచి,
హేమవిగ్రహదర్శ నేచ్ఛనెదవహించి
మంత్రిప్రతతి గొల్వరమరగమించి,
గోపకయుక్తుడై కొండపై కేతెంచి
యపరంజిమయ విగ్రహంబుగాంచి,
దైవజ్ఞుగాగ యాదవునిసంభావించి
మహిధరాతిశయము మదిదలంచి

ఆ- వె.విభ్రమాతిరేక వివశుడై భర్మంబు
తనకులభవ్యమగు విధంబులెల్ల
నరసి దెలసితత్ప్రకరణంబు లొనరించి
గీము జేర్చి పూజ క్రియలనుంచి. 127

తే-గీ. ధర్మమార్గనుడై లోక తతులనుతులు
బొదల బండ్రెండు నూర్లయే బదియునాల్గు 1254
మొదలు యెన్బది మూడుగ భూధరంబు 1283
నతడు వహియించె ముప్పది హాయనములు 128

వ. తదనంతరంబ. 129

అనవేమారెడ్డికథ.

సీ. త్రిభువనమోహనదివ్యసుందరమూర్తి ప్రబలరాష్ట్రాదికభయనివర్తి
నిజవితరణగుణవిజితదారిద్ర్యార్తి సదమలకరుణారసప్రపూర్తి,
లాలితధర్మప్రహేళితసమవర్తి నతహితాదికసమానప్రవర్తి,
విద్వత్కవిఖ్యాతి విపులవచోవర్తి దశదిశవ్యాప్తవిస్తారకీర్తి.

తే-గీ.అష్టదిగారతీరస మావృతోర్వ
రాభిదానప్రశస్తాంబు జాకరస్థ
ధీరహృత్కమల త్రిమూర్తిస్వరూప
సతతనుతమూర్తి యనవేమచక్రవర్తి. 130

క. అతఁడు నిజాటోపంబున, కుతలభరం బెల్ల మోయఁ గోరిఘనుండై
పితృదత్త దుర్గములకుం, బతియైయుండినను వేడ్కఁ బాలింపునెడన్.

వ. తదాస్థానమునందు. 132

శా. కాశీఖండముఖప్రబంధరచనా కౌశల్యుడున్ మారమం
త్రీశాత్మప్రభ వుండుగో విదగణా ధీశుండు మారాంగుడున్,
కాశీ సేతుపరీతభూ ప్రథితవి ఖ్యాతుండుఁ బూతుండునా
నాశాస్త్రార్థవిశారదుండు కవి శ్రీ నాథుండు విద్వాంసుడున్. 133

మ. తన తేజంబు వహింపభాస్కరుఁడు స ప్తస్యందనుండయ్యెధా
రుణికింబాంధవుఁ డయ్యె బ్రహ్మహరి రు ద్రుండయ్యె నెప్పట్లఁదా
నెనరామిన్ జర మాద్రికింజని తపం బేరోజుఁ గావించునో
యనగన్ రాయని భాస్కరుండలరె ము ఖ్యామాత్యుడై యచ్చటన్.

క. శ్రీనాథుఁడెల్లజగముల, బూనికరక్షింపుచుండ భూమిస్థలినీ
భూనాయకు కడకవియై, శ్రీనాథుడు గొల్చుచుంట చిత్రముగాదే.

క. భాస్కరు డధికారంబున, శుష్కింపగఁ జేసిప్రజల సొంపణచునయా
బాస్కరుఁడధికారంబున, శుష్కీభూతులగుప్రజల సొంపలరించున్.

వ. ఇట్లు విద్వన్మంత్రి పుంగవులు పరివేష్టించియుండ నిజ భుజాటోపంబున దేశంబులజయించుచు కవీంద్రదత్త కృతి ప్రకరప్రభావంబున బడయు మహదైశ్వర్యంబున నోలలాడుచు స్వస్థాన విద్వన్ముఖుల నన్యసంస్థానంబులకుఁ బంచుచు వారలు తత్తత్సభాసదుల నోడింపుటకు మిగుల నుత్సాహింపుచుండె. 137

## అనవేమారెడ్డి బిరుదు.

"వ. స్వస్తిశ్రీ సకలగుణాలంకార చతురచూడాకార విశ్వంభరవహన దక్ష దక్షిణ భుజోద్దండ జగమేశ్వరగండ అయోమండలీకార గండరా చేకులదండ అర్థిప్రత్యర్థి హేమాద్రిదాన నిరత ప్రజాపరిపాలన భరతావనీ భరణ భూప నారాయణ వీరనారాయణ భుజాబలభీమ కోదండరామ అపరిమిత భూదాన పరశురామ అనేక నగరవసుంధర ప్రతిపాలిత బహువిధరామ సంగతి రక్షపాలక జగదగోపాలక ఘూర్జరిత

దివిభోళ ఘనభుజ మేజనామ కరవాల రాచూరుదుర్గవిచోళ అనవరత పురోహిత సోమపాన శ్రీ పర్వత అహోబళ వేంకటాచల నిర్మిత సోపాన దిక్కాంతా మనోహార కీర్తి కుసుమామోదకుండి ప్రభాసహ్య జగౌతమీ జలక్రీడా వినోద విరోధ నృపదానవ నారసింహ పాండ్యరాజ జగసింహ ప్రజ్ఞా చతుర్విధోపాయ వేళాధిరాయ నిత్యపరిపాలిత సత్య పర్లవాదిత్య రిపునరపతిగో ధూమఘట్టన ఘరట్ట అప్పయ గోపయదిశా పట్టసంగ్రామ సముద్దండ చండ భుజాసి విఖండిత శత్రుకీలాలపవమాన పిశాచగణస్తూయమాన యశోమండన అళసీయ వరదశిరఃఖండన దుర్మదవైర భయంకర బసవశంకర అమరేశ్వర చరణ సరసీరుహాదంత భావసండనగార బ్రహ్మగుండి కృష్ణవేణి గోదావరీ మహానదీ తటద్వయ సార్థ్య దేశదత్తానేకాగ్రహార అగణ్య పుణ్యక్షేత్ర సత్రదత్త బహువిధ హారవరపుర హారణ మృత్యుంజయ సంగ్రామ ధనంజయ ఉత్తుంగ చతురంగ బలరిపు సేనాసాధక త్రిపురాంతక దేవదివ్యపాద పద్మారాధక ప్రేరిత మల్లనాథపయః పారావార పరిపూర్ణ సుధాకరుండైన శ్రీ మదన వేమారెడ్డిగారు.” 138

క. ఈరీతిని బిరుదులు జెలు, వార మహీసురుల కగ్రహారంబులువి
స్తారముగ నిడుచు కృష్ణా, తీరంబున నతఁడు మిగుల ధీరత వెలయన్.

క. అమరేశ్వర ప్రతిష్ఠను, క్షమయందా చంద్రతారకముగా గనోన
ర్చిమహోత్సవాది విభవము, లమరగ బహువసతు లెల్ల నతఁడిడె భక్తిన్

తే-గీ. ఇత్తెఱంగున నమ్మాన వృత్తముందు
సకలధర్మ స్వరూపుడై సదయుడగుచుఁ
బరగి పండ్రెండునూర్లపై నదియునాల్గు 1284
మొదలు తొంబదియైదుగ బుడమి నేలె. 1295 141

## కామగిరి వేమారెడ్డి వృత్తాంతము.

క. కామగిరి వేమభూవిభు, డామహితస్థానికధిపుడై యెనబదినాల్
సీమల ప్రభుత్వ సంపద, చే మహి పెంజెలగ వివిధ చేష్టారతుడై.

సీ. తనపూర్వు లొనరించు పనులెల్ల వీక్షించి
మరి ద్రవ్యనయమని మదిదలంచి
మంత్రి ప్రముఖుల సన్మంత్రముల్ వర్జించి

భూరిబ్రహ్మద్వేష మునువహించి,
దేవగో బ్రాహ్మణ జీవనంబులడంచి
అతిథివర్తనలెల్ల నపహరించి.
సాధుబృందముల విషణ్ణత్వమునఁగాంచి అల్పులసేవల నభిలషించి
తే-గీ. పరుసతనమున ప్రజలని ర్బంధపఱచి
చిన్న నేరంబులకు ఘోర శిక్షణముల
దండితప్పుల కత్యల్ప దండనముల
నిడుచుఁ బాలించె నిజప్రజ లిడుమలొంద. 143

వ. అట్టియెడ నఖండ మహీమండలంబులంగల పురులు శిరులవిడనాడి తె
న్నివాసులెల్ల క్షామవ్యాధ్యాభీల విశీర్ణమానులై యీరాజ కృతాప
కృత్యంబున నిట్లిడుమ లొందవలసెనని దూలనాడుచు పరరాజ్యం
బుల కరుగువారును గొప్పతనంబునం దెప్పరిలునప్పురనాథులు కప్పం
బు లర్పింపక దుర్ణయంబునం దెరలువారును వివిధ విద్వత్కవిగాయ
క వైతాళిక వంధిమాగధ వితానంబులు తమతమ పరివర్తనంబులు
నివర్తనగాఁ క్షోభించి భూపసన్మాన విహీనులై నృపాల విఫాలనంబు
నిరీక్షింపుచు విశేషభీషణ దూషణ భాషణంబుల శ్లోకరూప
కంబుగా నాశీర్వదించువారును శాత్రవ సమాజంబులు సవితృతేజో
విరాజమానులై జయాకాంక్షల ముట్టడిగొన నిజజన నాథాదరణ
విహీనంబున దండధర కాండంబులు పరరాజా భీలాంభోనిధిని
మగ్నులై శత్రురాజన్యుల జేరువారును నైయుండ దేశక్షోభాతి రే
కంబునం బాలింపుచుండె. 144

ఆ-వె. వర్ణహీనమయ్యె హర్షంబు గతమయ్యె
స్పర్శవేదిరసము భంగమయ్యె
విమలకనకవిగ్ర హముమాయమయ్యెన
భాసమయ్యెదురని వాసమయ్యె. 145

తే-గీ. ఇత్తెరంగునభువి నీనవ్వృత్తిదోప
వసుధబండ్రెండునూర్ల తొంబదియునారు 1296

మొదలు పదమూఁడు నూర్లతొ । మ్మిదివరకును 1309
నేలెఁ బాండవ వనవాస । కాలమనఁగ. 146

### కోమటి వేమారెడ్డి కథ.

వ. అంత. 147

ఉ. కాముఁ డదృశ్యదేహుఁడయి । కల్వలరేఁడు వియత్ప్రదాతుఁడై
సామజవైరి యుగ్రవన । చారణుఁడై నిధినాథుఁ డంబికా
స్వామికి మిత్రుఁడై మనఁగఁ । జాలిరి గాకటు కాకయుండినన్
కోమటివేము త్వన్ముఖని । కుంఠితశౌర్య ధనాళికోడరే. 148

తే.గీ. అనఁగ నతఁడప్పురంబుల । కధిపుఁడగుచు
సకలనృపరాజరాజిమ । స్తకకలాప
ప్రోజ్జ్వలత్పద్మరాగ ప్ర । ముఖవిరాజి
తాంఘ్రిపీఠుండనంగ సొం । పలరుచుండె. 149

మ. తనపూర్వాచరణప్రకారమున నా । స్థానంబునం బెక్కువ
త్తనలన్ బెంపలరించి దుర్గచయముల్ । ధర్మజ్ఞుఁడై యేలుచుం
డనమాత్యాగ్రణి భాస్కరుండు కవి శ్రీ । నాథుండునై యొప్పఁ బ్రా
జననాథుండు నిరంతరోజ్జ్వలమహై । శ్వర్యంబునం దేలఁగన్. 150

మ. ఇటులొప్పుచుండఁ దత్సభాస్థాన విద్వత్కవినాథుండగు శ్రీనాథుండు నిజపాండిత్యాతిశయంబు ననవనీనాథుంబొదల్చి తదాజ్ఞానుసారంబుగా నూరులసంస్థానంబులకుం జని యచ్చటి విద్వన్ముఖుల నెల్ల నోడింపుచు బహుమతులం బడయుచు. 151

### శ్రీనాథుఁడు విద్యానగరమునకు చనుట.

ఉ. ఆనరవంద్యుఁ డొక్కసమ । యంబున వేడుక మీఱ నాత్మభూ
జానియనుజ్ఞ చేకొని ప్ర । శస్తమణిస్థగితాలయాళిచే
శ్రీనిలయంబనం గరము । చెల్వగు పండితకల్పకంబు వి
ద్యానగరంబుగన్గొనఁగ । నాత్మఁదలంచి చనంగ నప్పురిన్. 152

తే.గీ. హరిహరకుమారదేవరా । యాగ్రగణ్యుఁ
డఖిలవిద్వత్పరీవృతుఁ । డగుచు వెలయు

తత్సభాస్థానికు లేరి కెఁ దగుసపర్య
లొందిరుశలంబు దెల్పవా కందఱలరి. 153

క. ఏదేశంబుననుండుట, లేదేశప్రభులసభికు లెందరిగెదరీ
సాదృశ్యహీనవాగ్విభ, వాదిగుణోన్నతికిఁగుతుకమగుడనవుండుఁ. 154

శ్రీనాథకవిరచితము.

సీ. "పరరాయపరదుర్గ ♦ పరవైభవశ్రీలఁ గొనకొని విడనాడు ♦ కొండవీడు
పరిపంధిరాజన్యబలములబంధించుగురుతైనయురిత్రాడు ♦ కొండవీడు
ముగురురాజులకును ♦ మోహంబుపుట్టించుకొమరుమీరినవీడు ♦ కొండవీడు
చటులవిక్రమకళా ♦ సాహసంబొనరించుకుటిలాత్ములకుసూడు ♦ కొండవీడు.

తే.-గీ సాధుసైంధవభామినీ ♦ సరసహేష
భటపటానేకహాటక ♦ ప్రకటగంధ
సింధురాద్భుతబహుళాన ♦ శ్రీలదనరు
కూర్మినమరావతికిజోడు ♦ కొండవీడు." 155

క. ఆమండలమేలుధరా
క్షేమంకరుడఖిలవిబుధసేవాసక్తుఁడా
కోమటివేమారెడ్డి
క్ష్మామానినిభర్తృసముఖ కవిసత్తముడఁ. 156

క. శ్రీనాథకవిసమాఖ్యుఁడ
శ్రీనాథపదారవింద సేవనలబ్ధ
శ్రీనాథుఁడసకలకళా
శ్రీనాథుడనంగనొప్పు శ్రీనాథుండఁ. 157

వ. అని యనేకప్రకారంబుల నతండు ఖండ పాండిత్య వైఖరీ విశేషం
బులఁ దనవృత్తాంతంబు గద్య పద్యాత్మకంబునం దెలుపుటయు నచ్చ
టంగల నృపాలాది సకల విద్వత్కవిబృందంబుల మందానందంబునొంది
యక్కవి కుంజరుంజేరి యశేషవిశేషంబులు ప్రస్తాపించుచున్నెడల నమ్మ
నుజేంద్రచంద్రుడు సభికులందఱుంగని యిట్లనియె. 158

ప్రభువు గృహారాజు మేడవిషయమై సభికులనడుగుట.

సీ. వినుఁడు దెల్పెద లోకవిశ్రుతంబుగ
నెందుబరగనినూత్నపు పద్ధతిగను,
భర్మ హర్మ్య కవాట నిర్మలాట్టాలక
బహురత్నతోరణ భ్రాజితముగ
నేకధ్వజంబున నెసగెడుగృహారాజు
మేడ నొక్కర్తున మేయ విభవ,
మమరంగనిర్మింప నాత్మనుత్సుకమంది
యున్నారమింకనీ యుర్విలోన
తే-గీ. గలధరాధిపులెవ్వరైన గట్టినట్లు
గలదెయొండైన మీరలు గన్నపట్లు
వినుటయునుగల్గెనేయిట్టి విధము మీరు
సరగునవచింపుడీ మాకు సభికులార. 159

చ. అనుటయుఁ దత్సభాసదులు నప్పుడలేచి పరాకులన్ బ్రభూ
గనుగొని విన్నవించిరొక కంబముపై గృహారాజుమేడనిం
వెనయ సృజింపరాజ పరమేశ్వరులై తగుతారు దక్క తి
క్కిన నృపాళికిందరమె కేశవునంతటి వానికేనియున్. 160

క. కనుఁగొనలేదెచ్చట మును, వినగను లేదిట్టి వార్త విశ్వంబునఁ ద
ద్ఘనమైన కార్యమెవ్వం, డొనరింపగ లేడు ప్రభువులొక్కరుదక్కన్.

వ. అనినవిని శ్రీనాథుండు సంభరితరోమావరోధనుండై పుల్కాంకుర శా
రీరంబునఁ దటాలున సభామధ్యంబున నిలిచి నృపాలాభిముఖుండై
యిట్లనియె. 162

తే-గీ. అవధరింపుము చంద్రవంశావతంస
తారుశెలవీయు దానికుత్తరము నేను
దెలసినకొలంది వ్రాకుత్తుఁ దేట పడగఁ
జిత్తగింపుడు దేవర చిత్తమలర. 163

ప్రభువునకు శ్రీనాథుడు గృహరాజుమేడ సంగతిచెప్పుట.

మ. బలభిత్సన్నిభవైభవుండు శశివిభ్రాజత్కళాశాలిని
స్తులశౌర్యద్విరదారిభర్త బుధసంస్తుత్యప్రభావాధికో
జ్జ్వలుడా కోమటివేమభూపతి ప్రపంచంబద్భుతంబందఁద
న్నిలయంబై తగుకొండవీటినగరిన్ లీలావిహారార్థియై. 164

ఆ. ఒంటికంబమునమహోజ్జ్వలసోపాన, హర్మ్యజాలజాలకాదికముగ
గట్టినద్భుతముగనట్టాలకముగృహ, రాజుమేడనాఁగ దేజమెసఁగ.

తే.గీ. అనుటయునునమ్మహీవిభుండవధరించి
విభ్రమావేశుఁడై కొండవీటికథల
నరసి తెలిసి నిజేచ్ఛ హేయముగ నెంచి
యొక్కచోఁగలదానివే యొక్కచోట
గట్టుటను చితమనిదాని మట్టుబెట్టె. 166

సీ. ఆమహీపతికవిగ్రామణిఁబూజించి
బహువస్త్రభూషణప్రతతులొసఁగి
తగుసపర్యలనాబుధస్తుతుఁబొదలించి
దుర్వారబహుమానతుష్టుఁజేసి
ప్రాసాదమహిమనువార్తలఁగడునాలించి
నిజసభాధ్యక్షుఁగా నిలుపనెంచి
తనమనంబునబహుతరవాంఛలుప్పొంగ
మంత్రిబోధనలెల్ల మదినిగుచ్చి

తే.గీ. కవినచటనుంచి తనహారకారగముల
రాజబంధుపురోహితరాజినెల్ల
సాధనిరుపమవిభవాతిశయముగాంచి
రాఁబనిచెఁగొండవీటిపురమున కతఁడు. 167

కొండవీటిగృహరాజుమేడవృత్తాంతము.

వ. అంతనక్కవికాంతుండదియంతయుఁ దెలిసితనవచనస్థాపనానుకూలం
బగు కీలునాలోచించి విమలహృదయంబునఁ గృతస్నాతుండై సద్భక్తి

పూర్వకంబుగా నిష్టదేవతావతంసంబగు నవులూరిపోతరాజునుపాసించి తదనుగ్రహబద్ధంబుగా నొక్క పత్రంబున పోతరాజునకు "దేవా! తావకసేవకుండగు శ్రీనాథుండనేక శిరస్సాష్టాంగప్రణామంబులు తదుపరి యుష్మన్మందిరపురోభాగంబునంగల తుమ్మచెట్టును మదీయప్రభులగు కోమటివేమారెడ్డిగారి గృహరాజుమేడకొసంగుము. ఆ నరపతిమిమ్ము నంబూజించి యామ్రానుంగొట్టించి యుంచ భవదీయ యోగబలంబున కొండవీటి పురసాలాంతరాళంబునం జేర్పుఁ"డని ప్రార్థించి యుత్తరంబువ్రాసి యేతద్వృత్తాంతంబెల్లం దెల్లంబొనర్చుచు నీపత్రికం గాంచుతోడనే మీరాపోతరాజుమందిరంబునకుం జని తద్దేవతావతంసునిఁ బూజించి యీయుత్తరంబెదుటనునిచి తదాలయాభిముఖంబునంగల మ్రానింగొట్టించియుంచ నది యారాత్రివేగులోన, పోతరాజు యోగబలంబున మీకోటలోనం జేర్చుఁగావునఁ దక్షణంబున నట్లుచేసి యతిత్వరితంబుగా నామ్రానింజెక్కించి నిల్పి చిత్రవైఖరిఁ గృహరాజుమేడం గట్టించి యందుఁగొల్వమరుండు. దానింజూడ నిటనుండి రాయలహర్కారులు వచ్చుచున్నారు వారువచ్చు సరికిసమస్తంబు సృజింపుఁడని ప్రభువునకువ్రాసి యీ రెండు పత్రికలను మిగులరహస్యంబుగా రెడ్డికనుపనతండట్లయొనర్చి దేవతాగారంబునకెదుటంగల సప్తతాళప్రమాణోన్నతంబును, సప్తరజ్జుప్రమాణవలయంబునుంగల వృక్షంబునుంగొట్టించియుంచుటయు నది యట్లకోటలోనం జేర నప్పుడమిరేడుమిగుల వేడుకపడి శ్రీనాథుప్రజ్ఞాతిశయంబునకునాశ్చర్యంబునొంది ప్రాసాదనిర్మాణకృత ప్రయత్నుండై. 168

ఆ. వేనవేల శాస్త్ర • వేత్తల సౌవర్ణ
కారులాదిశిల్పి • కారతతుల
వేమభూవిభుండు • వేవేగ రావించి
మేడఁగట్టనుద్య • మింపుడనిన. 169

సీ. వారలందరు మహా • వైభవోపేతులై
భోజనమజ్జనం • బులనుదీర్చి

నృపబహూకృతభూష ♦ నిచయముల్ ధరియించి
పరమకుతూహల ♦ స్వాంతులగుచు
జనవిభునాజ్ఞగై ♦ కొని వేడుకను పరి
కరములు గొనిశిల్పి ♦ కారులెల్ల
చిత్రవైఖరులుభా ♦ సిల్లఁగఁగంబంబు
జెలువంబుబొలుపారఁ ♦ జెక్కి చెక్కి
తే-గీ. రేయుఁబవలును నిర్జితోపాయులగుచు
నిద్రరయునోగిరంబులు ♦ రద్దుజేసి
పరమసంతోషకలితులై ♦ బహువిధముల
దీర్చిరిట్టులఁగంబంబు ♦ తేజమెసఁగ. 170
సీ. వజ్రంబునకుమారు ♦ వలుకు చందంబునమిగులదృఢంబైన ♦ మేనుతోడ
దండశూకకులీను ♦ తనువులీలవహించుడంబగువర్తుల ♦ త్వంబుతోడ
పుటపాకమొదవిన ♦ పుత్తడికైవడి మిసమిసల్ జెలువొందు ♦ పసిమితోడ
వింధ్యాచలమువిర ♦ వీఁగినిల్చినమాడ్కి మితముమీఱినసము ♦ న్నత [ముతోడ
తే. వెలయగాఁగంబమును దీర్చి ♦ విబుధవరులు
దీవెనలొసంగ బ్రాహ్మణ ♦ దేవపూజ
లెల్లఁగావించివప్రమం ♦ దుల్లసిల్ల
నాటిరుర్వినిభరియించు ♦ నాగమనగ. 171
తే-గీ. దానిపైఁగుడ్యములమర్చి ♦ వానిపైని
కనకజాలకహర్మ్యని ♦ కాయ్యములను
కరిహరిప్రముఖాది వి ♦ గ్రహములెల్ల
చిత్రముగఁజెక్కికట్టిరా ♦ చిత్రగృహము. 172

గృహరాజు మేడ వర్ణన.

వ. మఱియు ననవద్య విద్యావైశద్య ప్రాచుర్యతర బహువిధ పుష్పితారామ నదన దీపుట భేదన చతురంగబలప్రముఖామిత విచిత్ర చిత్రిత నవరత్న సంఘట్టనాభేద్యంబులగు కుడ్యంబులును, నితాంతలతాంతానేక విధ లేఖనోజ్జ్వల శృంగార మదేభ తురంగ శతాంగనిచయ గమ

నాగమ నానుకూలంబులగు ద్వారంబులును, అహర్ముఖ విరాజమాన విభాకరబింబ సదృశానర్ఘ్య చిరత్నరత్న స్థగిత రుక్మ సింహాసన వ్రజంబులును, అంతరిక్ష వ్యాప్తవిమల స్వర్ణకలశ కలిత శేఖరనివహ పరిచుంబిత గోపురంబులగు గోపురంబులు, విచిత్రగాత్ర పుష్పికాసందోహ సంకీర్ణ పంచవర్ణ వ్యాకీర్ణంబులగు వితాన వితానంబులును, అఖండ మహీమండల మండనాయమానేంద్ర నీలాదిదివ్య నవ్యోపలస్తంభ సంభృతంబులై మింటిఁదవులుమంటపంబులును, మహారజత శృంఖలంబులం బాటమిమిగిలి దీటులేక ధాటివెలయు కవాటంబులును, భరతశాస్త్ర ప్రవీణతాశ్లిష్ట ధీమంతులగు కళావంతులును, రవి శశాంక కళావిస్తారంబుల నోజందేజరిల్లు దీపికానిచయంబులును, సారతర సౌరభోజ్వల సువర్ణపత్ర కుసుమ ధారణంబులగు తోరణంబులును, అనారతంబు మలయమారుతంబు మలయందుల లేని భాతిఁ భూతిమిగులు వాతాయనంబులును మోదంబె దలంబాదుకొల్పిరయిప్పల కుప్పలై యొప్పు పుష్పాదుల తిప్పలగప్పు నడిమేడురంబులగు వేదికలును, నవరసోల్లసిత విగ్రహసమగ్రంబులై దిక్తటసమాకీర్ణ ప్రభాపటలంబులగు పటంబులును, అభినవాభినయ విశేషంబులం బంచశరశర సమానభాసమానంబులగు పాంచాలికా సంచయంబులును, వెలయు తత్ప్రాసాదంబు కాపాలితెఱంగున సర్వమంగళాభిశోభితంబును, సుకవి ప్రబంధంబు విధంబున బహువిధాలంకార వితానవిభ్రాజితంబును చంద్రమండలం బుడంబున నమోఘమృగ ప్రతిమాభిరామంబును, సురేంద్రుపగిది వజ్రకాండ జేగీయమానంబును, విభావసుని లేవ సభామండల మండితంబైన భోమండలంబుగతి భూరి తారకామాలికానుగతంబై పాండుమధ్యముని క్రియధర్మగుణ కలాపావాసంబై పన్నగంబుంబలె చక్షుశ్శ్రోత్ర మంజుళంబై సురపురి కరణి సుమనోవిలాసంబై సమరధీరునితీరున పరిఘాది భాసురంబై ఋష్యశృంగ నామధేయంబును పర్వతాగ్రంబును ననుకరించి సముత్తుంగ శృంగశృంగారంబై సముద్రంబును, పరాజయంబునుబోలి

బహుభంగ సంగతంబై జడస్వభావంబును, నృసింహావతారంబును నను నయించి యేక స్తంభ నిరూఢంబై కుమార ప్రభావంబును, పరే తమండలంబును, మహేశ్వర శరీరంబును నుద్దిగని శక్తియుక్తంబై రాజభూషణోత్కరంబును, శైలంబునుంబోలే నవ్యోపల విరాజ మా నంబై విష్ణుస్వరూపంబును, భూతలంబును, పన్నగేంద్రంబును, నాక సంబునుంబోలె ననంతాభిరామంబై నిశాధిప మండలోన్నత ప్ర సిద్ధంబయ్యున నిశాధిప మండలోన్నతప్రసిద్ధంబై నయసంపన్న విరాజ మాన నిర్మితంబయ్యుననయసంపన్నవిరాజమాన నిర్మితంబై, మం దరాగ సంచారాధిక గాయకగాయనీ జనవిలసితంబయ్యున మందరాగ సంచారాధిక గాయకగాయినీ జనవిలసితంబై సదృజ్ఞనోజ్ఞంబయ్యున సదృజ్ఞనోజ్ఞంబై విసమస్వరూపంబయ్యు నవిసమస్వరూపంబై ఒక్కొ క్కదిశం ద్రిదశ గురుసదృశ శారదావిశారద వచోవిలాస నిజాంగణ ప్రబంధిత దశదిశ వ్యాప్త యశోధురంధర ప్రభుప్రముఖ దత్తమ త్తేభు లగు విద్వన్మత్తేభు లొనర్చు శాస్త్రచర్చ లెసంగ నొక్కొక్కచెంత దురంతలతాంత వాసనా నిశాంతలగు కాంతాసంతానంబు కనత్క తనక కంకణనిక్వాణం బెనయం జెలువంబున వీవు చామరవీచిక లుప్పతిల నొక్కొక్క ప్రకేవ కేవల భావిభావుక జ్ఞాన పారీణులగు సు ప్రధాన సత్తములు కొలువు వెలయ. నొక్కొక్కయిక్క మిక్కిలి చొక్కంబులగు ఘుమఘుమలు పిక్కటిల మనంబులకు మక్కువ నెక్కడించు కర్పూరాగరు ధూపధూమంబులు స్థేమంబులై మలయ. నొక్కొక్కతరినమందానంద కందళిత తరంగితాం తరంగంబులం బొంగుచు నిజమస్తకవిన్యస్తహస్తకమలులై ప్రశస్తిం దెలుపుచు స్తుతించు వందిమాగధ వైతాళికాది కృతకైవారంబులలర. నమ్మ హీపతి సభాభ్యంతరంబునని జేష్టదేవతావతంసంబగు శ్రీమద్రాజ రాజేశ్వరీదేవిని నితాంతమణి సంతాన జేగీయమానంబును యస మాన శోభాన్వితంబును నగు సింహాసనంబునంగొల్వుదీర్చితత్సముఖం బునసకల సామంతమంత్రి పురోహిత ప్రచయంబెల్లంగొలువచెలువు

మిగిలి శృంగార లీలలు గ్రాలుచుండ నిండోలగంబుండునవసరంబున.

రాయలహర్కారులు కొండవీటికి వచ్చుట.

సీ. రాయలపనుపున రయమున నేతెంచు
హర్కారగములు న య్యవసరమున
కుండినపురపుర క్షోణికి నేతెంచి
యిదికొండవీడని యెఱిగియెఱిగి
నిలయంబునకుఁ బురా న్వేషణమొనరించి
విపులస్థలంబున విశ్రమించి
అవనీశదర్శనో త్సవచిత్తులై దండి
సాలముల్ సొచ్చి త త్సరణిఁ గనుచు

తే-గీ. మదికివింతయి శీర్షకంపము తలిర్ప
పృథుల గీతంబుఫీనుల విందుసేయ
విభ్రమావేశులై సౌధ వీథులెల్లఁ
దిరుగుచుండిరి మార్గముల్ దెలియలేక. 174

చ. చనిచనిచిత్రశాలలను సామజశాలలు నశ్వశాలలున్
ఘనచరశాలలున్ రజత కాంచనశాలలు నాట్యశాలలున్
గనుగొని మార్గదర్శకని కాయసహాయమునన్ జనేశుగీ
మునుగన జాలిలోపలికిఁ బోవననుజ్ఞను వేఁడియంతటన్. 175

క. నరవిభునియాజ్ఞ చేమం
దిరముఁ బ్రవేశించియరుగు దెంచిరిరత్న
స్ఫురిత సోపానములఁ దమ
చరణంబులఁ ద్రొక్క మిగుల సంశయపడుచున్. 176

వ. ఇట్లుచను దెంచుచుఁ దమలోన. 177

సీ. వజ్రకాండంబుల వర్ణించివర్ణించి వజ్రకాండభ్రమ బడెడువారు,
పద్మరాగంబులఁ బరికించిపరికించి పద్మరాగభ్రమ బడెడువారు,

తారకామాలికో । త్కరదీప్తిఁగనికని తారావళిభ్రమ । దవులువారు
నీలోపలచ్ఛవి । నీక్షించివీక్షించి నీలోత్పలభ్రమఁ । దేలువారు
తే-గీ. నగుచుమదిగల్గు తమసంశ । యములు దెలియ
నోరులఁబ్రశ్నింపుచును వెన్క । నుండువారు
వారికై వెన్కముందాడు । వారునగుచు
నగుచుఁ జనుదెంచుచుండిరి । నవగృహమున. 178

వ. మఱియుఁ గుడ్యంబుల విచ్చలవిడిపెచ్చరిలి వెలుఁగు నచ్చపు పచ్చరాల మెఱుంగు తెరంగులఁగనుఁగొని పచ్చికలనియిచ్చ మిగిలి పరుగులిడు కురంగంబుల నీక్షించి గండుమిగులు పుండరీకంబుల గండడంపనుద్దండదండపాణులై యుండు మృగయాపరబృంద ప్రతిమాదుల విధంబుల లోచనంబు లార్పకఁజూచువారును, నిద్దంపు టద్దంబులం దిద్దిన సద్దుమిగిలి విభులయొద్దం జేరి యొద్దికల ముద్దుగుల్కు ముద్దియలం దిలకించిపులకాంకూర శరీరంబుల సంచలింపంజాలక పంచశర భిన్న మనస్కులై తద్గతియె తమకుం గూర్పుమని విరించిఁగురించి వేడువారును; వల్లరీనిభకుచ పల్లవాధరీక దంబ మృగమద మిళిత సుగంధ సంసిక్త కనత్కనక భూషణ ఝణఝణాత్కార సంయుక్తకర పల్లవ కృత సల్లలితంబులై కొల్లలగుతావులం గొని విలసిల్లు చల్లని తెమ్మెర పిల్లగముల కుల్లంబులు రంజిల్ల నవియెల్లఁ దమదెస విసరుగాకయని మసలువారును నవరత్నకలిత కవాట జాలోన్నత ప్రకాశంబులకుతను వికాసంబులు మారువడి యొండొరుల గుర్తింపనేరకఁ దిరుగువారును అంగజ ప్రసూన శరసన్నిభులగు నన్నుఁ దలమిన్నల సంగీతభంతంగబుల నంతరంగంబులని గుచ్చి తద్రంగంబున రంగుమిగిలి స్వేచ్ఛలఁజెలంగువారును, ఇచ్చటి యచ్చెరువగు ముచ్చటలంగాంచి అచ్చటికింజన నిచ్చవచ్చునే యీసచ్చరిత్రువేడి హెచ్చగువచ్చు బడలంబుచ్చుకొని యిచ్చటనే వసించెదమని పంతంబులుసేయువారునునై పలువిధంబులగు వింతలెల్ల నుచితాసనంబుల కతిపయకాలంబు గూర్చుండి వీక్షించి తనివిందవిలి ప్రభునాజ్ఞగొని వెడలి తమ పురంబునకుం జని

గృహరాజు మేడంగట్టిన వృత్తాంతం బాంతర్యంబుగాఁ దెలసి సానం దాష్ట్యతాంతరంగులై తమ రాజన్య సభాస్థలికిం జనుటయు నతండు వీరింగని కుశలం బడిగి కుండిన నగర వృత్తాంతంబులు దెలుపుఁడన వారిట్లనిరి. 179

హర్కారులురాయలకు కొండవీటిమేడవృత్తాంతముచెప్పుట.

క. అయ్యాభవదాజ్ఞనుగొని
చయ్యనఁగుండినపురంబు ♦ చను దెంచితిమే
మయ్యెడఁగలచందంబుల
నియ్యెడఁదెలుపంగజాల ♦ మింతంతనుచున్. 180

ఉ. అచ్చటిరత్నకందరము ♦ లచ్చటిదివ్యసువర్ణభూములున్
అచ్చటిసౌరభానిలము ♦ లచ్చటిహెచ్చగువారకామినుల్
అచ్చటివైభవోన్నతులు ♦ నచ్చటిచందములెల్లఁగాంచినన్
అచ్చరలచ్చెరుందవిలి ♦ యచ్చటుబాయఁగనోపరిచ్చలన్. 181

వ. మఱియు. 182

సీ. అచటిచందంబుల ♦ నవలోకనము సేయ
నాత్మలవిభ్రమం ♦ బలిశయిల్లె
అచటిగోపురతతు ♦ లవలోకనము సేయ
నాత్మలగౌతుకం ♦ బధికమయ్యె
అచటిగీతారావ ♦ మాలకింపంగమామ
తులుబ్రహ్మానంద ♦ మయములయ్యె
అచటిపురాణాదు ♦ లాలకింపగమాకు
విద్యావిశేషమై ♦ శద్యమొప్పె
తే-గీ. నచటి విభవాభిజాత్యంబు ♦ లరయనరయ
నప్పురముఁ బీడమానసం ♦ బొప్పదయ్యె
నెచటఁగన్గొనగాలేము ♦ యీపుడమిని
హరిహరకుమారదేవరా ♦ యాగ్రగణ్యా. 183

వ. అని యిట్లనేకప్రకారంబుల కొండవీటిపురమహాత్మ్యంబును గృహరాజు మేడవృత్తాంతంబునుం దెలుపుటయు నమ్మనుజేంద్రుండు విని విస్మయంబునొంది శ్రీనాథునితనగద్దియం జేర్చి పునః పునదండప్రణామంబులిడుచువినయవిశేషభాషణంబుల భూషింపుచు తనరాష్ట్రంబునంగల మెతుకుసీమకై లాస కోట మొదలుగాగల జాగీర్లనొసంగి బహూకరించిపనుపుటయునక్కవినాథుండు కొండవీడుప్రవేశించి ప్రభుందర్శించి ఏతద్వృత్తాంతంబులకు నొండొరులుసంతసించుచు తనుగొన్నరాజ్యంబులు ప్రభుస్వాధీనంబొనర్చి మహనీయుండై పరిఢవిల్లుచుండెనంత. 184

సీ. అమ్మహీవిభుడురా | జాఖ్యధిపుడై ధర్మ
మార్గవర్తనమున | మనుచుభక్తి
బొలుపొందనవులూరు | పోతరాజునకు
బల్ జాగీరులిచ్చెను | భోగములకు
మున్నురుక్మిణికొల్చి | చెన్నుమీఱినగౌరి
దేవతకుంబునఃప్ర | తిష్ఠ జేసి
ముల్లగూరను నామ | మునవొక్కపురిగట్టి
యాదేవతకునగ్ర | హారమొసగి.

తే-గీ. పెక్కువసతుల దేవత | పేరనొసగి
పుణ్యచారిత్రుడై పద | మూడునూర్ల 1310
పదిమొదలు ముప్పదియునేడు | వరకతండు 1337
మేదిని భరించె నిర్వాద | నిమ్మది శరదులు. 185

రాచ వేమారెడ్డి చరిత్రము.

తే-గీ. అంత శ్రీరాచ వేమాఖ్యుడను | ఘనుండు
రత్నసింహాసనస్థుడై | రమణఁగాంచి
దుర్గవర్గంబులకుఁ దాన | దొరయగుచుఁ బ్ర
భుత్వసామ్రాజ్యుడై యొప్పె | సత్వుడగుచు. 186

క॥ తనతల్లిసూరమాంబకు, మనమునఁగల కోర్కెలను స | మర్థింపగఁదా
జననియాజ్ఞానుసారం,బునఁబురికిసమీరభాగ | మునసొంపెసగన్. 187

సీ. కమనీయ రత్న సంఘట్టణసౌవర్ణ జాలజాలోజ్జ్వలాట్టాలకములు
నిబిడశాత్రవబృంద నిర్దళితోత్తుంగ ప్రాంచితఘనవప్రసంచయములు
పనస జంబీర రంభాకుట్మలతమాల కూటోజ్జ్వలోద్యానవాటికములు
రాజరాజనివాస రాజమానవిలాస రాజేందురాజ మార్గవ్రజములు
తే-గీ. వెలయ భూమహిళాహస్త కలితకలశ
మన సృజించె నచట సూరమాంబ పురము
నవ్యముగను విద్యాపూడి నామమునను
ధరణిఁ దనరారెడు పిరంగిపురము చెంత. 188

క. ఆపట్టణమునకుంగడు, దాపున నమ్మనుజపతి సుధారస ధారల్
దీపింపఁ బ్రతిష్ఠించెను, ప్రాపుగ సంతాన సాగరంబనుకొలనున్. 189

వ. మఱియుఁ దత్కాసారంబునకు నొక్క కాలువం ద్రవ్వించి తన తల్లి
యాజ్ఞానుసారంబుగా జగదంజ గండికాల్వ యను నామంబు నొసంగి
మిగుల ప్రశస్తుండై. 190

తే-ఆ. ఆమహిజాని తత్పురమందు వేడ్క
బొదల పదమూడు నూర్ల ముప్పది యెనిమిది 1338
మొదలు పదమూడు నూర్ల నల్బది యొకటిగ 1341
బరగె సర్వం సహా పరిపాలనమున. 191

ఆరుగురు రెడ్ల కాలనిర్ణయము.

సీ. పోలయవేమ భూపాలుండు పోషించె
మహినిఁ బండ్రెండు సంవత్సరంబు 12
లనపోత వేమాఖ్యుఁ డవనిభరం బూనె
ననఘుడై ముప్పది హాయనమ్ము 30
లన్న వేమ మహీశుఁ డలఘు సంపన్నుఁడై
ద్వాదశాబ్దంబులు ధరణినేలె 12
మహితకామగిరివేమక్షితీదయితుండు
భువి జతుర్దశ వర్షములు భరించె 14

తే-గీ. ప్రోచెఁ గోమటి వేమన పుడమినిరువ
దెనిమిదేడులు తతభోగ మెనయరాచే 28
వేమనాబ్ద చతుష్కంబు వెలసె రెడ్డి 4
వంశభవు లేలిరిల నూరువత్సరములు. 100 192

వ. తత్కాలంబునందు. 193

శ్లో. ప్రయోవేగికులేభ్యశ్చ ద్రావిడేభ్యశ్చముత్తమాః
వెలనాటి కులేభ్యశ్చ షట్త్రింశ గ్రామసత్తమాః

శ్లో. శ్రీకృష్ణవేణ్యోతటి పుష్యవేషు శ్రీతుంగభద్రాతటి పుష్యమేషు
శ్రీరెడ్డిభూపాలక రాజవర్య బాహ్యాగ్రహారాగతి వేగసంఖ్యాః.

వ. ఇట్లు పలువిధంబులగు శాసన రూపకంబుగా నగ్రహారంబులు విప్రుల
కొసంగి నిఖిలైశ్వర్య విరాజమానులును ఆసేతు శీతనగపరీత భూతల
వ్యాప్త కీర్తివిస్తారులును, షట్చక్రవర్తి ప్రభాధికులును నైన త
త్షట్చక్రవర్తులును ధరాపాలనం బొనరించిరి. 194

క. అనుచును నాశీరున కతి
వినయం బెనయఁగఁ ద్రిలోక విదుడగు వనజా
సన సుతుఁ డగు నారదుఁ డాగి
వినుపించెను కొండవీటి విభుచరితంబుల్. 195

నర్కుటవృత్త చంపకమాలికా వృత్తతేటగీతి కంద గర్భిత
చంపకమాల వృత్తము.

చ. నరవరభవ్యధామశుభ నామరసాసుర పాలనక్రమా
శరధి శయానరమ్య ఘన సారస లోచన శ్రీనివేశనా
సురుచిర దివ్యశీలరణ శూరర మాధవ ధీర భాసురా
హారహిత ధీవిశాలమణి హారసతామర పావనాత్మకా. 196

నర్కుటవృత్తము.

నరవర భవ్యధామ శుభ నామర సాసుర పా
శరధిశయాన రమ్య ఘన సారసలోచన శ్రీ

సురచిర దివ్య శీలగణ శూరర మాధవ ధీ
హారహిత ధీవిశాలమణిహార నతామరసా.

చంపక మాలికా వృత్తము.

శుభనామ రసా సురపాల నక్రమా
ఘనసారస లోచన శ్రీనివేశనా
రణశూరర మాధవ ధీరభాసురా
మణిహారన తామర పావనాత్మకా.

తేటగీతి.

పాలన క్రమ శుభనామ భవ్యధామ
శ్రీనివేశన ఘనసారయాన రమ్య
ధీరభాసుర రణశూర దివ్యశీల
పావనాత్మక మణిహారధీవిశాల.

కందము.

వరభవ్యధామ శుభనా
మర సాసురపాలన క్రమా శరధి శయా
చిర దివ్య శీల రణ శూ
రర మాధవధీర భాసురా హారహిత ధీ.

గద్య.

ఇది శ్రీమ జ్జగత్ప్రాణతనయ వరప్రసాద లబ్ధ కవితా సంకలితాప స్తంబ సూత్ర కౌండిన్య సగోత్ర పవిత్ర వివిధ విద్వన్ముఖ సరోజాతమిత్ర మద్దుల పలివంశదీపక వేంకటప్పయాభిఖ్య తనూజాతక సుకవి జనసేవక గురుబ్రహ్మనామక విరచితం బగు శ్రీ కొండవీటి చరిత్రంబునందు ద్వితీయాశ్వాసము.

శ్రీరస్తు.

# శ్రీకొండపీటి చరిత్రము.

## తృతీయాశ్వాసము.

శ్రీమద్రఘుకుల సోమా
సోమాది ప్రణుతనామ సుగుణోద్దామా
దామోదరాభిరామా
రామా కోదండరామ రామవిరామా

క. అవధారు పంకజాసన
భవుచే నాదివిజలోక పతివిని దానన్
దవిలి తదనంతర కథను
వివరింపుమటన్న నిట్లు వినుపించె నొగిన్. 2

వ. తదనంతరంబ. 3

ఉ. రాజవిహీనమైన నడిరాతిరి రీతిని పద్మినీసతీ
రాజవిహీనమైపొలుచు రాకమలాకరమట్లు ద్రౌపదీ
రాజవిహీనమా కరిపురంబువిధంబునఁ గొండవీడిలన్
రాజవిహీనమై పరుల రాకడకాకరమాటఁ దెల్పెడున్. 4

వ. అట్టియెడ. 5

### లాంగూల గజపతి కొండవీడు ప్రవేశించుట.

సీ. శ్రీధరసేవారు చిపరవశుఁడయ్యుఁ
బరవశత్వంబునఁ బరగఁడెపుడు
కరమాశ్రితులయెడఁ గారుణ్యవిషరాశి
దాల్చియు విషరాశి దాల్పఁడెపుడు

పనియెడ ఖచితంపు భావంబు గల్గియు
మొగమాటమినిదాట ముగియడెపుడు
అర్థికిదానక త్యాగమయ్యునపాత్ర
దానంబులీయగా నూనడెపుడు

తే-గీ. అనగ జగముల పొగడిక్క ననఁగదనెడు
మొగమునిగని గలఁదొగల మగనిఁ దెగడు
పగలతెగువలఁ దెగనాడి నెగడుమగడు
మహితలాంగూల గజపతి మనుజవిభుడు. 6

చ. వికసితమైనమరందము స్రవించెడు పద్మవనంబుపై నళి
ప్రకరము సంతసంబొదవ ప్రాలినభంగిని తండుకొంత సై
నకనికరంబుతోఁ దనదు నేర్పునఁ బాలన సేయగా మహీ
ప్రకటితమైనకుండిన పురంబరుదేరి ముదంబెదందగన్. 7

చ. అటఁదన రాజధాని పొలుపారగఁ జేసి తదంతరంబులో
పటుతర దుర్గవర్గముల పాలనమెల్ల వహించిమించిదో
ర్బటుల బలోన్నతిన్ యుదయ శైలపురప్రభుతిన్ జెలంగునా
కటకపురీపరీతనృపకాంతము నెల్ల జయించెఁబెల్లుగన్. 8

సీ. తనుజయించిననృపస్థానంబులందెల్ల నిజబిరుదాంకముల్ నెగడఁనటుల
శాసన స్థంభముల్ స్థాపించిపురముల జనులెల్లసుఖమునఁ దనరునటుల
జలనిలయాంది పరిసతులెల్లనమరించి స్థిరపదంబును దాను జెందఁనటుల
సప్తసంతతులఁబ్రకీర్తిగాఁగావించి పుణ్యమార్గస్ఫూర్తి బొసగునటుల

తే-గీ. జేసి పెద్దమలెముకోటచిన్నమలెము
కోటయనఁగట్టి పూర్వపు కోటలెల్లఁ
గడుదురస్తులొనర్చి దుష్కృగపథంబు
లడచిప్రోచె భువికి సుఖమబ్బునటుల. 9

క. పదమూడునూర్లపై నలు, బదిరెండవయేడు మొదల భాసిల్లగనే 1342
బదమూడవసంఖ్యతుదం, గదురగ ద్వాదశశరదులకాలంబేలెన్. 10

కర్ణాటకరాజులు కొండవీడువచ్చుట.

సీ. అటుమీఁదకర్ణాట ǂ కావనినాథులు నరపతిసింహాస ǂ నస్థులురణ
కోవిదుల్ప్రతాప ǂ దేవరాయాఖ్యుండు హరిహరదేవరా ǂ యాగ్రగణ్యు
డిరువురుండఁగుండిన ǂ యేలికలజయించి దుర్గవర్గంబుల ǂ దొరతనంబు
జేకొనిశాశ్వత ǂ శ్రీలుప్పతిల్లంగ బాలించిరచ్చటి ǂ పట్టణములు

తే. శైలషోడశసంఖ్యల ǂ పాలనంబు
ప్రబలిపదమూడునూర్లయే ǂ బదియునాలు 1354
గాదిగాఁడెబ్బదారన ǂ దంత్యముగను 13 1376
వత్సరములిరువదిమూడు ǂ వాంఛలూర 11

కపిలేశ్వర గజపతికథ.

క. గజపతిసింహాసనుఁడురు, గజపతినిభబాహుసత్వ ǂ కలితుఁడునృపది
గ్గజపతినాకపిలేశ్వర, గజపతిదేవప్రభుండు ǂ కడుబల్లిదుఁడై. 12

చ. అరిగతమైనభూమిఁబడ ǂ యంగఁదలంచికృతప్రయత్నుఁడై
శరధిరవంబెసంగపటు ǂ సైనికఘోటగజాన్వితంబుగా
నరపతిపీఠుపైఁజనిర ǂ ణంబునగెల్చిమహేంద్రవైభవా
కరమగుకొండవీటిపుర ǂ కాంచనపంచముఖాసనస్థుఁడై. 13

తే. రక్తిమీరంగఁబట్టాభి ǂ షిక్తుఁడగుచు
పురిపురికిరాజమార్గముల్ ǂ పొందుపఱచి
జారచోరభయాదులె ǂ చ్చటనుగనుట
కైనఁబుడమినిఁగనరాని ǂ యట్లొనర్చి. 14

క. పదమూడునూర్లపైఁడె, బ్బదియేడవయేడుమొదలఁ ǂ బరగంగనునె
న్బదిమూడవవర్షముతుద, గదురఁగఁదగుకాలముర్వి ǂ ఘనతవహించెన్.

పురుషోత్తమ గజపతికథ.

సీ. తదనంతరంబయే ǂ తన్నృపాలునకునౌ
రసపుత్రుడధికవి ǂ క్రాణనప్ర
భావుఁడుశ్రీపూస ǂ పాటివీరప్రతా
పపురుషోత్తమగజ ǂ పతివిభుండు

యక్షసింహాసనా ✽ రూఢుండై కుండిన
ప్రాజ్యరాజ్యైకసా ✽ మ్రాజ్యుడగుచు
పుడమిపోషింపుచోఁ ✽ బురుషోత్తముండని
జగములుబొగడంగ ✽ నెగడిసకల

తే. దేశములనెల్ల నార్జించి ✽ తేజమొదవ
కులవిరోధుల నరపతి ✽ కులులనడచి
ఆనుగొందిఁనృసింహరా ✽ యాఖ్యుగెలిచి
పుచ్చుకొనియెను కర్ణాట ✽ భూమినెల్ల. 16

వ. ఇట్లితండు పెక్కుదేశంబుల జయించి కూడిన రాజ్యాభివృద్ధి గావించి యెల్ల జనులు సల్లలితంబగు నుల్లాసంబున నుల్లసిల్ల చల్లనిమార్గంబున నేలుచుఁ దననామంబు సుప్రసిద్ధంబై యుండునట్లు పురుషోత్తమ పట్టణంబను పురంబును గట్టి యీవిధంబున దేశంబున కొక ధర్మ శాసనంబు వ్రాయించె. 17

శాసనము.'' శ్రీ చతుర్దశభువనాధిపతి. శ్రీమత్పురుషోత్తమ దివ్య చరణసేవశతా నవరత్న వుంచానవైరి మర్దన భుజాబల పరాక్రమ పరమవైష్ణవ పరమ భట్టారక భాగ మూల కారణ శ్రీ పురుషోత్తమ పుత్రసూర్యవంశాధార మహారాజాధి రాజరాజ పరమేశ్వర ఇక్ష్వాకు కులసంభవ రామచంద్ర చరిత్రాలంకృత పాతనాటిమండలేశ్వర నవకోటి కర్ణాకాలంబరేశ్వర పంచనాదైశ్వర్య శ్రీ వీరప్రతాప పురుషోత్తమదేవ మహారాజాలంకార విజయరాజ్య సమస్త శ్రాయిక న్యా శుద్ధపంచమి శుక్రవారంస్వస్తి శక వర్షంబులుగ౧౪౧౧తదునాలుగునూర్ల పదునొకొండవనగు నేటి కీలకనామ సంవత్సర భాద్రపద శుద్ధపంచమి ౫ శుక్రవారం దుర్గాప్రసాద కొండవీటి సమస్త దేశాలగ్రామాల అష్టాదశవర్ణాల ప్రజకున్నూ పెండ్లిసుంకాలున్నూ అడ్డగడ పేట సుంకాలున్నూ ఆచంద్రార్కస్థాయిగా మానితిమి ఈసుంకములు కరణాలు | తెలుగు రాజులు యెవరైనా తప్పితే గోహత్య బ్రహ్మహత్య శిశుహత్య చేసిన పాపమునఁబోదురు. తురక రాజులు తప్పితే పందినిఁదిన్న పాపానఁబోదురు.''

సీ. అని యివ్విధంబున ఽ నాస్థానమందున
వర్తనల్ శాసించి ఽ కీర్తితనరఁ
బ్రజలు సౌఖ్యస్ఫూర్తిఁ ఽ బరిఢవిల్లంగస
ద్ధర్మంబు నాల్గు పాఽదములనడువ
నరపతి సింహాస ఽనస్థులడగియుండ
నెడలేని సంపద ఽ లింపుమీఱ
పదమూడునూర్ల మెఽన్బదినాల్గు మొదలుగఁ 1384
బదునాల్గువందల ఽ పదెనిమిదవ
తే. యేటివరకు ముప్పదియున్నై ఽ దేండ్లతండు 1418
కొండవీటిని పీఠినిఁ ఽ గొల్వుదీరి
పర భయంకరు డగుచు శుంఽభన్నృపాల
వైభవస్ఫూర్తిచేఁ బ్రభుఽత్వం బొనర్చె. 19
తే. అంత బురుషోత్తమావనీ ఽ కాంతునకుఁగు
మారుడును బల విజిత కుఽమారుడునుఁ బ్ర
తాపరుద్రుం డనంగఁ బ్రఽతాపరుద్ర
గజపతి యనంగ సత్వ దిఽగ్గజపతియన. 20

## ప్రతాపరుద్ర గజపతి కథ.

చ. పరగెఁ బ్రతాపరుద్ర నృపఽబాలుడు బాల్య వయోవిముక్తుఁడై
పురముల దుర్గవర్గముల ఽ పోషణనెల్ల వహించి రత్న భా
సురమగు పీఠిపైఁ గొలువు ఽ చొప్పడిదిగ్విజయార్థుడై మహా
హరికరిసైనికౌఘ యుతుఁ ఽ డై వెడలెన్ బహు రాజరాజిపై. 21
ఆ. అమ్మహీశుడిట్లు ఽ లందరినిజయించి
గెలుచు పురములొక్క ఽ కేలునందు
నిడి చతుర్దశశత ఽ యేకోనవింశతి 1419
మొదలు కొన్ని వర్షఽములు భరించె. 22
క. అంతఁదగెనితనిపుత్రుఁడు, శాంతిక్షమదమగుణాళిఽ సంచయుడురమా
కాంతపదభక్తుడాకృతి, కంతుండగు వీరభద్ర ఽ గజపతిప్రభువై. 23

కృష్ణ దేవరాయల వృత్తాంతము.

వ. అంత,తుంగభద్రాతీరంబునంబరగువిద్యానగరసింహాసనాధ్యక్షుండు. 24

రాజచంద్ర వర ద్వంద్వార్థ గత సీసము.

సీ. తనకరపరిముక్త దానామృత సువృష్టి
యనిశంబు విబుధ జీవనముగాఁగ
తన కమలావాస తతసభామండలి
సత్ప్రధానాళికా శ్రయముగాఁగ
తన యనంతవిచార ఘనిరుపమప్రౌఢి
మంబు కువలయావనంబుగాఁగ
తన ఘన రాజాంగ దర్శనస్ఫురణంబు
ప్రమదారి భేదనో ద్యమముగాఁగ

తే. వెలయు దిఙ్మండలవ్యాప్త విపులయశుఁడు
నరపతి సమాఖ్యసింహాసన ప్రధాన
నరసభూపపులోమజా నాధసుతుఁడు
చంద్రవంశుడు కృష్ణరాయేంద్ర నృపుడు. 25

చ. అతఁడు కవీంద్రసాంద్ర కమలార్యముఁడై ప్రతిపక్షదక్షమా
రుతభుజగేంద్రుఁడై యమృత రుక్సరహీర పటీర తారసా
రతరయశోన్నతుండయి ధరారమణీ మణిహార రత్నశో
భితవిజయాభిధాన పుటభేదన పంచముఖాసనస్థుఁడై. 26

తే-గీ. అనఘకౌండిన్యకులుఁడు వేమయ*తనయుడు
రాచయామాత్య* నందనరత్నమార్య
సన్నుతుఁడులక్ష్మధవుండు సాళ్వతిమ్మ
విభుఁడుసచివుండగుచుఁ గూర్మి వెలయుచుండ. 27

వ. అఖిల సామంతరాజ బృందంబులిచ్చు కప్పంబులం బుచ్చుకొనుచుఁ
గర్ణాటక రాజ్యంబెల్లఁ జల్లనిమార్గంబుల్లసిల్ల నేలుచు నొక్కనాడ

* తనయుడు. ఔరసుడు. నందనుడు. దత్తపుత్రుడు.

మాత్యయుక్తుండై వినోదార్థంబుగా బట్టపుటేనుంగునెక్కి పురవీథులం
బ్రగుమ్మరుచున్న సమయంబున. 28

గాండ్లసంగ యను స్త్రీవర్ణన. ధ్వని.

సీ. తనముల్కులగుపువ్వుకోలను ద్రుంచి రెండు గు
త్తులఁజేసి పైటలోఁ దురిమిపెట్టి
తన వార్వమగు శుకంబునుఁ బట్టి మాట మా
త్రన బెదరించి పారంగవైచి
తనకు సాయుడగు చంద్రుని ముఖాముఖిఁబోరి
పలు కళల్ హరియించి పరిభవించి
తన వింటి త్రాటి భృంగనికాయమును కండ్ల
నదలించి మింటిపైఁ జెదరఁ ద్రోలి

తే-గీ. తనునుఁగూడ వధింపంగఁ దలచుటెఱిగి
మారుడతనుతఁ గని విటమగలఁ జేరి
దీనపై బురికొల్పి కయ్యానికేగ
జేసెనానొప్ప నప్పురిఁ జేడెయొకతె. 29

తే-గీ. అది సుధారసపూర వాచానుషంగ
లలిత జనమోహనచణ కళాప్రసంగ
నీరజాత సదృశమృదు నిర్మలాంగ
గమన నిర్జిత సారంగ గాండ్లసంగ. 30

కృష్ణరాయలు గాండ్లసంగను మోహించుట.

క. అను విటకత్తియను నిజాం
గణమున నిలిచికనుదానిఁ గనుగొని మరు సూ
నని శాతశరహతుండై
మనమున నాచెలియనంటు మమతజనింపన్ 31

వ. అతండు నాటంగోలె తదీయ మోహాతిరేకంబున నేమియుందోచక. 32

చ. సభకరుదేర డెన్నడును సభ్యులఁజీరి వచింపడాచమూ
విభవమునైనఁ గన్గొనడు వింతయొకింతయుఁ జూడఁబోడు వై

రిభయముఁ గూర్చి యెన్నఁ డొక ఽ రిక్తుని ప్రార్థనకుం జెవీయఁడా
యిభనిభయాననొంద నగుఽనిచ్చనుఁ బెచ్చిన మచ్చరంబునన్. 33

ఆ- వె. కవరజాణకత్తె ఽ టక్కులాడి పడంతి
దాసియైనయొక్క ఽ దానిజీరి
మనము దెల్పినీదు ఽ మహిమ మీఱఁగ దాని
నిందు తెమ్ముపొమ్ము ఽ యిందువదన 34

చ. అనవుడు వల్లెతావక దఽయారసముండినఁ జాలునీపనిన్
బొనరుచు దాననొక్కత్రుటిఁ ఽ బోయెదనిప్పుడటంచుఁ గాంతకై
జనితమి వృట్టనేర్పునఁ బ్రఽసంగమొనర్చి మనంబు ద్రిప్పి తె
ద్వనితనుఁ దోడితెచ్చె నరఽవల్లభుడుండు నగళ్లలోనికిన్ 35

వ. అంత నితాంత సంతోషితాంతరంగుండై యమ్మహీకాంతుం డత్యంత ప్రేమాతిరేకంబున నారంభోరు యుగళిని సంభావింపుచు మజ్జనభోజన మాల్య భూషణాదుల నమరించి నాటిరేయి కనుకూలపరపుడని యాజ్ఞయిడి భూవిభుం డుత్సుకుండై భోజనకృత్యంబులం దీర్చికొని నిశాసమయంబున. 36

ఉ. భాసుర రత్నభూషణప్రఽభల్ ప్రభవింప దుకూలధారియై
లాసపుమోము షోడశకఽళల్ తగు నిందుని నిందసేయ సద్
వాసనలన్ భుగుల్ తగు సుఽవస్తులదాల్చి విడెంబుబూని బల్
మీసలు మీటుచున్ మదిని ఽ మీఱిన మారునిబారి గూఱఁగన్. 37

పడకటింటి వర్ణనము.

సీ. చౌసీతిబంధ ప్రఽశస్తపాంచాలికా
ప్రాభవోన్నత పటఽశోభితంబు
కమల దృక్కంకణఽక్వణమిళత్స్వరభా
స్వితశైత్య మందమాఽరుత యుతంబు
రత్నమౌక్తిమహాఽరజతలతాకీర్ణ
బహు తోఽరణయుత ఖఽట్వస్థలంబు
రవి శశాంక కళా విఽరాజిత శ్రీయుత

వైచిత్రతర దీపికా చయంబు
తే-గీ. సార ఘనసార వీడ్య పుష్ప వ్రజంబు
మృదు మధురగీత మంజులా మ్రేడితంబు
ప్రవిమలాగరు ముఖ గంధ బంధురంబు
అనుపమంబు నృపాల శయ్యాగృహంబు. 38

క. చేరగ దాసీపడతులు, భూరివిభూషణదుకూల పుష్పసరోలం
కారమ్మునఁ దెచ్చిరి దే, వేరులు గనకుండఁ జెలిని విభుసన్నిధికిన్. 39

క. తెచ్చినఁ జెలితనపైఁ దమి, పెచ్చరిలినవిభుని నచటి పృథులతరరుచుల్
మెచ్చికనుగొనుచునిలచెను, యచ్చప్రతిమయనఁగ విస్మయామ్రేడితయై.

ఉ. అంత విభుండు మోహ వశుఁడై తన చెంతకు రాగ దాని నెం
తెంతయు సన్నలం బిలువ నింతి చలింపకయున్నఁ జూచి య
త్యంత ప్రియంబునం జెలికరాబ్జము పట్టి గ్రహించె సెజ్జకున్
వింతగ నంచ చెంచువున వేగబిసంబును బట్టినట్టులన్. 41

## సురతవర్ణన.

మ. అలకల్ దువ్వుచు మోముమోము పయి నొయ్యారంబుగాఁ జేర్చి తే
నెలు దేరన్ దశచుంబనక్రియల నెంతే సేయుచున్ బైటబోన్
వెలియా చన్గవఁ బట్టుచున్ నగుచు వేనిట్టూర్పు లెచ్చన్ దమిన్
దొలి కేళిన్ దని వారఁ దేలెనతి సంతోషాన్విత స్వాంతుఁడై. 42

వ. అంత. 43

## క్రమాలంకారము.

సీ. పవనరంజితమైన నవనీరదమనంగ భ్రమరంబు కలచిన కమలమనగ
చిత్రితంబులగు పసిండి తేకులనంగ పికశుకక్షతమైన బింబమనగ
కొమ్మలఁ బ్రాకిచిక్కులువడ్డలతలన గుబ్బలపైఁ జారు మబ్బనంగ
సన్మార్గమునఁ గ్రాలు శక్రకుధర్మమనంగఁ గూర్మినాడినపూలగుత్తులనగ
తే. సడలుకొప్పును విన్నబో యెడిముఖంబు
గంట్లు చెక్కులు నధరంబుఁ గదలుసరులు

తా వెడలు పైటనూడునో ॱ డ్డాణ మెఱుపు
బడ్డ చన్గవతోనిల్చి ॱ బడలిపడతి. 44

వ. అంతనిరువురుం దదుపరికృత్యంబులదీర్చికొని మధుర భక్ష్యపదార్థంబు
లారగించి ఘనసార తాంబూలంబు లొనరించి సుఖస్థితినోల లాడు
చుండిరిట్లు. 45

తే. పెద్దయుంబ్రొద్దుగడుపుచు ॱ బ్రియ మెలర్ప
దానిరాజాంగములను సౌ ॱ ధములఁజేర్చి
నురుసుఖాంబుధిఁదేలుచు ॱ నుండెసత్యఁ
దెచ్చిరహిమించుశ్రీకృష్ణ ॱ దేవుడనగ. 46

వ. ఇట్లొప్పుచుఁ నతండు గొండొకసమయంబునఁ బట్టపుదేవింగనుంగొని
యవ్వార కామినింగూర్చి మాటాడుచో దానినాయమకు సమంబుగ
లక్షించి ప్రసంగించుటయు నందుల కాసాధ్వీలలామ మనంబునఁగో
పించి తెచ్చినది యల్పకామినిగాని గజపత్యన్వయ సంభూతం దేలేదు
గదా దానినింత యతిశయంబుననుంచఁదగునాయని నిరుత్తరంబుగా బ
లుకనతండు రోషించి గజపతి కులకన్యకం గొనివత్తుఁగాకయని సమ
కట్టితత్క్షణంబ సభామండలంబున కరుగుదెంచి కొల్వుదీరి. 47

### కృష్ణరాయలు తూర్పుదేశముపై దండెత్తుట.

తే. మంత్రివరుఁడగుసాళ్వతి ॱ మ్మరుసుఁజీరి
పూర్వదిగ్జయయాత్రకుఁ ॱ బోయియచట
గజపతికులోద్భవగుకన్య ॱ కను వివాహ
మాడగఁదలంచితినిమేలు ॱ జాడఁజూచి
మనబలంబెల్ల రావింపు ॱ మనవుడెలమి. 48

క. ఒకనాడుయుపశ్రుతిపూ, ర్వకముగమంత్రాక్షతలుఁబు ॱ రమునరజకవ
ర్ణకుటీరముపై నిడిసూ, చకముగ్రహింపంగనతడ ॱ చటనుండునెడన్.

ఉ. ఆరజకుండు పుత్రయుతుఁడై తన శయ్యపయింబరుండి యొ
య్యారపు మాటలన్ దనయు ॱ నారడిఁ దీర్పుచు నోరిపూర్వ ది

గ్ధారుణిఁ గొండవీటి పురిదాఁక మఱిన్ గటకంబుదాఁకనా
దేర నిజంబుకాదనగ నేరరలేరు రయంచు బల్కుటన్. 50

చ. విని మదిలోన సంతసిలి వేగమరాజు జయంబునొందనో
పునిదియె మంచివేళయని భూవిభుసన్నిధి కేగియంతయున్
వినుచుటయున్ నృపాలుడని వేడుక లుప్పతిలంబలంబురా
ననుపుము నావుడున్ గడు రయంబున నట్టులఁ జేసెఁ జేసినన్. 51

సీ. మినుముట్టు వెనుగట్టు లను గట్టు చెడమెట్టు
కరుల ఘీంకార విస్తరము మీఱఁ
గడు తీవరపుఁబావ కహితావహము తేవఁ
బరగుసైంధవరాజి ప్రభలు దేఱఁ
బలుబంతుల లతాంత ములకాంతిలు నితాంత
రథచయగమన సంరావమార
ధర రక్కసుల స్రుక్కడర చక్కనగు చక్క
నగు భటౌఘంబు జోహారు దీర
తే-గీ.రమణిపల్కులకై కృష్ణరాయవిభుడు
పూర్వ దిగ్విభుజయ యాత్రపబోయినటుల
రమణి పల్కులకై కృష్ణరాయ విభుడు
పూర్వ దిగ్విభుజయయాత్రబోయెనిటుల. 52

వ. ఇట్లతం డఖండ కోదండపాండిత్య వైఖరీ విశేషంబున గండు మిగిలి దండు వెడలినఁ బూర్వ భూమండలంబునం గల దండనాథుల పిండులెల్ల తండతండంబులుగా పటుభటానేక ప్రోక్త దిక్తట భేదంబులగు సింహనాదంబులు మిగులఁ బరతెంచుట విని భీతాత్ములై యొరుల పురంబులకు పరువెసెడి పరుగులిడువారును, పరశు ప్రముఖానేక మహాయుధ సాధనంబుల నమోఘ్యులై రిపునృపకాండంబులఁ జండాడనుద్దండులై యుండు దండధర తండంబుల గనుఁగొని మారువేసంబులఁ దారుమారుపడి యొరులకడ డాగువారును, నిజపక్ష రక్షణానురాగంబున బలంబులకు బలంబు బడయు సపర్యలు నెరపింపుటలు గనుంగొని సాంతః

కరణుండగు ధరాభరణునకు శరణంబు జొచ్చువారును, నై పలు
విధంబులగు కలకంజెంది తల్లడిల్ల వెలువడి పాదపోన్మూల కృన్మత్తే
భంబు వనంబు సొచ్చుక్రియ పురంబులు సూరవచ్చుచు. 53

సీ. ఉదయాద్రినుగ్రర । సోదయుండై పట్టె నద్దంకిపతిబలం । బద్దిగొనియె
వినుకొండపటిమ । విన్నంతనపహరించె బెల్లముకొండతీ । వెల్లఁదీసె
నాగార్జునగిరిదీ । నత్వమొందగఁజేసె తంగెడమొదలుగ । గ్రుంగఁజేసె
కేతవంబుని । ర్భీతిమెయింజొచ్చె కొచ్చెర్లకోటదా । హెచ్చిగెల్చె.

తే. కుండినకుఁబ్రాఁకిఁగలదుర్గ । కాండమెల్లఁ
బెల్లుగజయించికీర్తిశో । భిల్లదిశలఁ
హృద్యవాద్యంబుభీషణ । వృత్తినిండఁ
గొండవీటిపురంబుపై । దండువెడలి. 54

క. పదునాలుగువందలము, ప్పదియేడవ 1437వర్షమునయు । వనునాషాఢా
ఖ్యఁదగు నెలశుద్ధమునశని,నదనగు నేకాదశినిన । హంకృతిదోర్పన్. 55

కొండవీటియుద్ధము.

ఉ. పూనిపురాంగణంబునరి । ప్రువజభిన్నిశితాస్త్రశస్త్రభృ
త్ప్రాణులహంకృతింసెలగ । భర్మవికారరథానురూఢుడై
జ్యానినదంబునన్ విశిఖ । సంచయమున్ జెయినూనియాహవా
హ్వానముపొల్పుదెల్పరణ । వాద్యపుగర్జమునిండనుండినన్. 56

తే. అట్టియెడఁగొండవీటిపు । రాధ్యుడరసి
మేఘమంతయులేకని । మ్మెయినిగజ
మేలఁగలుగంగ ననుచు నా । భీలమొంది
తెప్పరిలి కొంత వడికి ని । త్తెఱంగుఁదెలసి. 57

క. పటురోసంబున భృకుటిత, నడలుండై విస్ఫులింగ । నివహంబులురా
ల్నటులఁగన్గొనుచుసైనిక, ఘటికులరావించిసమర । కాంక్షలుమీరన్. 58

ముక్తపద గ్రస్తము.

సీ. కీలలంటింపంగఁ । గేలుల గురిచూచి కీలింపఁబడు తుపా । కీలబారు
బారువులకొలంది । బరువులై దారుణ కేళిదేలెడు పిరం । గీలబారు

బాఱనిశూరుల ఽ భంజించు జోదులఁబల్వుర మ్రోయుని ఽ భటముల బారు
బాఱు నేరులధృతి ఽ వారకఁగుప్పించు వారువంబుల నెక్కు ఽ భటుల బారు
తే-గీ. నుక్కుమిగులంగఁ బుడమినే ఽ చక్కఁజూడ
లెక్కడగరాని సంఖ్యల ఽ మిక్కుటముగ
డక్కడసువులటంచారు ఽ ప్రక్కవారి
వెక్కసము లాడుచందఱు ఽ వెడలిరపుడు. 49

వ. అప్పట్టునఁ జలంబున బలంబులెల్ల నడువ నన్నడుమఁదాఁగల మగని కళలందెడు నిగనిగల మొగంబు మిగులఁ బ్రకాశింప దేరునం గొల్వు దీఱి సింహనాదంబులు మేదురంబుగా నొనర్చుచు నంత్యకాలదండశూక దందహ్యమాన కీలాభీల దుర్నిరీక్షుండై సమరంబునకుబయలు దేరి వీర భద్రుండు వీరభద్రాకారుండై. 50

పంచచామరము.

సలాము బాణమొక్కఁటేయ ఽ సైరయంచుఁగృష్ణుడున్
శిలీముఖంబునొండునట్లు చేతఁబూనివైవఁదాఁ
బ్రలాపమొందఁజేయుబాణ ఽ పంచకంబుఁదీసి కేల్
బలంబుసూపవైచెనారి ఽ పల్కుమాఱుబల్కఁగన్. 51

ఉ. పాటమినేగుదెంచుశర ఽ పంచకముల్ బటుబాణమొండుచే
సూటిగఁద్రుంచియిర్వదవి ఽ సొక్కఁగవింటఘటించివీరుపై
నేటునగీట మీటెనన ఽ హింసయె, ధర్మమటంచు నెంచెనా
నాటకఁబోయె నావిభుఁడా ఽ నర్చిన సాయక సాధనంబునన్. 52

మహాస్రగ్ధర:

రోసంబొప్పంగదోర్దా ఽ రుణవిహృతినావా ఽ ర్యంబునానొప్పివైరుల్
గాసింజెందంగ సేయం ఽ గలశతమితమా ఽ కాండముల్ దీసివింటన్
బాసిల్లన్ బాహుగర్వ ఽ ప్రకటనఁదమయే ఽ బాఱెనాఠాంకృతిన్ దాఁ
వ్రేసెన్ గర్ణాటుమీఁదన్ ఽ వినునినుఁదునుమన్ ఽ వ్రేతురాకాంచుమంచున్
తే-గీ. వ్రేసి వ్రేయకమున్నవి ఽ వెడలిరిపుల
నూరునూరింటిపైఁబడి ఽ నూచవైద్య

లపుడమానుపుటయువారఁ లాలమునకు
మాకొకనిరికృష్ణుమనుఁదత్స మయమునందు. 54

ఉత్సాహవృత్తము.

దండివారలెల్ల నాదు ధాటికోర్వలేక భూ
మండలంబులిచ్చిమమ్ము మన్నుడంచు వేడమ
త్కాండకాండకౌశలంబుఁ గానకీవుబాల్యతన్
భండనంబొనర్చి గెల్చు వాడవేవచింపుమా. 55

మ. అనివార్యమెచ్చినహుంకరింపఁగనిక ర్ణాటుండుబాలుండువీ
డనిమన్నించినభావినెట్లుతనపై యాలంబుసేనోపునం
చేనలోద్దీపితనేత్రుడై విపుల బాహాశక్తిమెవ్వే సెనా
తనితోడన్బలమెంతయంతశరయూ థంబందఱిన్నాటగన్. 56

మత్తకోకిల.

ఉగ్రుఁడై యనుపీతభద్రుడో హాఁవధింపకయుండినన్
విగ్రహంబనివచ్చితీవవి వేకివై కనుఁగానకన్
ఉగ్రుపై మరుడేగినన్హాత మొందకుండునెయింతటన్
నిగ్రహింపకఁబొమ్ము నీపురినేతవై మననెంచినన్. 57

వ. అని సక్రోధుండై వచించి తనపరివారంబును పలకించికను సన్న జేసిన.

చ. గిరిగిరితారసిల్లుగతి ఘింకృతులంజగమెల్ల నిండగా
హరిహరిమారుకొన్నవిధి నంతట ఘోరరవంబు మ్రోవగాఁ
దరుతరుపున్బెనంగొను విధంబునకొమ్మలపాటుదోపగా
కరికరినశ్వమశ్వమునొ కండునొకండునుఁబోరుచుండగన్. 59

వ. ఇట్లుగయ్యుభయబలంబు లొండొంటిందలపడిపోరుచుండఁగ్రందుకయ్యం బయ్యెనయ్యెడఁదచ్చ తురంగబలంబులపాదఘట్టనలబిట్టెగయురజోపట లంబుప్పరంబెల్లఁగప్పికొనినప్పుడప్పద్మజాండంబొప్పు తప్పి చెప్పరాని గొప్పతమంబుప్పతిల్ల యెల్లరకుచూడ్కులునిగుడ నీకున్నయుల్లంబులు ఝల్లునఁదల్లడిల్లుచుఁ గొంతవడికిధైర్యంబవలంబించి తమతమ పేళ్లు గ్గడింపుచుసమరంబొనర్చి రందుఁగొందరుకరంబులు దెగినందక్కిన కరం

బులఁ గైదువులు గొని కవియువారును, నొక్కొక కాలు దెగినఁద
క్కటికాలూఁతగొని యెదిరిమీఁదికి లంఘించువారును, శిరంబులుఁదెగిన
నంతకుమున్న కన్నిడినవారిచక్కికింజని పొడిచిపడు వారును, యు
రంబులు జదిసినవారదివరకౌఁడు గఱచుచుకరంబులమీసంబులుమీ
టుచుధరణినొరుగువారును, భిండి వాలంబులగుండెలవియువారును,
ముసలంబులమోదంబడువారును, ముద్గరంబుల మూర్ఛిల్లువారును,
భల్లంబుల ద్రెళ్లు వారును, చక్రంబులన విక్రములగువారును, కత్తులఁ
దుత్తురుములగు వారును, తోమరంబులనామమడంగువారును, కుం
తంబులనంతకుచెంత కరుగువారునునై ప్రేవులు లతావళులును, కేశం
బులు శైవాలంబులును ఛత్రచామరంబులుమరాళంబులును, ప్రప
దంబులుకమఠములును జఘనంబులుమకరంబులును, వదనంబులు
నళినంబులును,తుత్తురుములైనభూషణస్థాపితోపలంబులిసుకయునరుకు
డువడిన కరంబులురగంబులును బాణంబులు మీనంబులును, విరిగి
ననరదంబులు గిరులును,మేదోపంకంబుననను వైనరుధిరంబు కీలాలం
బునునై యొప్పుచుగొప్పగు సంద్రంబు ననుకరించుటయుఁ గొందఱు
వీరావేశంబులఁదమతమకరీంద్రంబులఁబఱపి పరశువులుగొని తురంగం
బులను రుమాడుగజారోహకులును. గజారోహకులకుంగవిసితరుచగుక
ఱకుటమ్ములనెఱకులునాడగీలించినఱిముఱిగానరకురథికులురథికులపై
కురికికరవాలంబుల శిరంబులుపరియలుగావించువీరులును,వీరులకుందా
రశిలి మెఱుంగుకోలలనురంబులు దూరనేయు తురంగారోహకులును
తురంగారోహకులునెఱపు శరపరం పరలఁదమకరంబుల మెఱయునా
యుధంబులగిరగిరం ద్రిప్పివైచి ధరణిందొరుగఁజేయు సారథులకంఠ
టంబులు పగులనంకుశంబుల వ్రేయుమావటీలునుంగలిగి భూతభేతా
ళగణంబులోలలాడనిట్ల పూర్వంబగుఘోరసంగ్రామంబు వివిధరాజ
న్యకంఠలుంఠనక్రియావిశేషంబగుచుజామదాగ్న్యాయోధనంబువి
ధంబై అఖండశిలీముఖమండల మండితంబగుచు పుండరీకషండంబు
డంబొప్పి, కీలాలానుపూరంబై సైకత వతివిధంబున; మహోగ్రంబై వం

బు పగిది. భీమసేన భీభత్ససైంధవాత్యుగ్రంబై భారతంబు తెఱంగు
న. గజాక్షయాంగదాదిలసితంబై రామాయణంబు శేషభూరినిర్ఘోషభీ
షణంబై విలయాంబుదంబుచందంబున వారణోత్పన్న గంధబంధురం
బయ్యునవారణోత్పన్న గంధబంధురంబై శక్తియుక్తంబయ్యు నశక్తి
యుక్తంబై విరాజితద్విజ సమాజంబయ్యు నవిరాజితద్విజసమాజంబై
రాజకలాపస్థలంబయ్యు నరాజకలాపస్థలంబై సమప్రభావంబయ్యున
సమప్రభావంబై వెలయుచుండెనంత. 60

## సూర్యాస్తమయ వర్ణన.

చ. కనికనియారణస్థలినిఁ గష్టములొందెడువీరువారునా
కనువగుచుట్టలిందొకరికై పలుకందగదొప్పనిన్ దమిన్
బనుపుమునానొనర్పమినె పంబగునాయెడవేళలేదుపో
ననిచనుచుండెనాఁగఁజర మాద్రికినుండరుడెంచవేగిరన్. 61

క. తాకునకుఁజెడియపరగిరి
దాఁకాఁజనిమూకలచటుఁ దాకఁగఁదననా
లోకింపఁబిలుతురని రవి
నాకేటికటంచుదర్శ నంబిడకఁజనెన్. 62

వ. అంతవీరభద్రుండు తనబలంబుధ్వాంతంబగుటయు కృష్ణదేవరాయ
నిబలంబుడంబుగనుటయుం గనిజయింపనశక్యంబగునింతటనైన నీతని
మైత్రిసంపాదించినశుభంబగు నని మంత్రులవలన నెఱింగినవాడై తత్క్ష
ణంబ సంధికృత్యోపాయంబునఁదదుచిత వాక్యంబులు వరపశరఘుడి
యారుటయు వీరభద్రుండు భద్రావాప్తికై కేలు మొగిచికర్ణాటక
భూపాలునిపాలికింజని యిట్లనియె. 63

## వీరభద్రగజపతిరాయలతో సంధిచేసికొనుట.

ఉ. ఓనతదీనరక్షణఘృణోదితవీక్షణమీమహాత్మ్యమున్
గానకమీపయిన్ సమర కాంక్షవహించితినింతనన్నుమీ
వానిగనేరముల్ సయిచి వత్సలతన్ భరియింపుమయ్యవి
ద్యానగరాధిప యభయ దానమొసంగుము కృష్ణభూవరా. 64

క. అనివినయ మొనయ నంజలి
గొనియెదురంజనివచింపఁ గోపముడిగివీ
రనృపతికి నృపతిపీఠం
డనువుగ వల్లెయనిపల్కె నతివత్సలతన్. 65

తే-గీ. నన్నెదిర్చుకతంబున నాకునీకు
నింతపోరయ్యెనీబల మంతఁదెలిసె
సంతసించితినీకుర వంతయైన
భయము లేదనికృష్ణుడ భయమొసంగె. 66

ఆ-వె. ఉభయసంధిబొసగి యుండుకతంబున
రాగమంతకంత ప్రబలమయ్యె
గుముదవిస్తరంబు గూడెదాసవ్రజ
ధ్యానముప్పతిల్లె నట్టియెడల. 67

ఉ. సంధిలనిర్భయంబెదల సంధిలయోధులుసంతసోల్లస
ద్బంధురలీలనృత్యములఁ బాటలు బాడుచుఁగుంభికుంభసం
బంధములై భువిందొరలు మౌక్తికముల్ వెదచల్లుచోవియత్
పాంథముగప్పితిప్పనగు తారలనందగెఁదారలుద్ధతిన్. 68

చంద్రోదయవర్ణన.

చ. తనకులజుండుసత్పథవి ధానుడుశీతలచారికృష్ణరా
యనృపతివైరివీరునని నాదృతిఁగాచెనునిందువంశసం
జనితుడుగాననంచుమను జస్తుతులుప్పతిలన్ గనంగవ
చ్చెననువిధంబునన్ యుదయ శేఖరినెక్కెవిధుండుప్రాగ్దిశన్. 69

చ. సరసములాడువేళఁదన సన్నలమెచ్చకయల్కనూపడన్
దరుణివచింపకున్నఁబతి తానయిగారవుచైవులన్ సతిన్
బొరిపొరిమోహనక్రియల మోదమునొందగసేయునట్లుభూ
మిఱులకళంకమొందఁగని యిందుడొనర్చెమహీన్ గళాన్వితన్. 70

చ. సరసిజసూతిహంసనుని శాటవిదారుఁడుపాలసంద్రమున్
పురదమనుండుస్వేతనగ మున్ గురుతింపగలేకవేసగన్

దిరుగుచునుండిరెల్లెడలఁ ✽ దీర్ఘముదుగ్ధమొకండుఁదక్రమొ
క్కరుఁడుహలుతాశనంబొకఁడుఁ ✽ గైకొనిభూతలమెల్లఁగొల్లగన్ 71

వ. అట్టి యెడల నానృపాలయుగ్మంబు నొండొరులు నమందానందంబు
నం బొంగుచు సరస ప్రసంగంబు లొనరింపుచు నిరుగెలం కుల సకల
కళా విశేషంబున సాంద్రతరచంద్రికలబీరంబు దీరంజేయుదీపంబులు
వెలుఁగ వివిధవాద్యంబుల భేద్యంబులై ప్రమోవసమస్త పరివారంబులు
నిజమస్త కవిన్యస్త హస్తులై కొలువఁగొండ వీటి పురంబునకుఁ జేరు
నెడ వీరభద్రుండుఁ దన మందిరంబున వారలకు విందులొనర్పఁ దలం
పు వడి యరదంబు నిజవాటికకు మరలించి యందరిం గీముజేర్చి విఁగు
ల నుపచారంబు లొనరింపనియమించి యెల్లర విమలసలిలంబుల మజ్జ
నంబులాడించి పట్టుపుట్టంబుల గట్టంబెట్టి యుచితాసనంబులఁగూర్చుం
డ పెట్టి కనకమయ పాత్రంబుల రాజభోజనంబు లొనర్పవడ్డనం బొన
రింపుటయు. 72

మ. తులలేనట్టిపిశాణివంటకముస ✽ ద్యోని ర్మితాజ్యంబుని
ర్మలశాకంబులుసూపముల్ మధురధా ✽ రల్ పానకంబుల్ మిఠా
యిలుభక్ష్యంబులుశోష్యలేహ్యరసముల్ ✽ హెచ్చైనబజ్జుల్ ఫలం
బులుఁబక్వాన్నముక్షీరముల్ వెలయఁగా ✽ భోక్తవ్యలై రందఱున్. 73

తే-గీ. కప్పురపువీడ్యములొనర్చి ✽ క్రమవాక్య
పరిణతంబగుసంగీత ✽ ఫణితిఁ దేలి
యొక్కొకరికొక్కొకగరిత ✽ యుపచరింప
బూలసెజ్జలసుఖనిద్ర ✽ బోయిరంత. 74

ప్రాతఃకాలవర్ణనము.

చ. తరణిద్విజాళికర్మలవి ✽ ధంబుగనుంగొనిచెల్వుమించుస
త్వరమునవేగుసంపనది ✽ వచ్చియకర్మతనున్నయాదివ్యజో
త్కరమునుగాంచిభానునకుఁ ✽ దద్విధముల్ వినుపంగఁదారలన్
బిరబిరఁబంచెనాఁబొడిచె ✽ వేగుతొగల్ జనుచుండమింటిపై. 75

చ. చనినతొగల్ ద్విజావళుల ✽ చందములారవిసన్నిధిన్ వెసన్
వినుపనతండునుగ్రుఁడయి ✽ వేగమువారలఁగప్పు తామసం
బణఁచివ్యర్థకర్మపరు ✽ లైతగఁజేసెదనంచు లేచిగ్ర
క్కునవెడలెన్ మహేంద్రుదిశ ✽ ఘోరతరారుణరోచు లేర్పడన్. 76

చ. తెలతెలవారె దివ్వియల ✽ తేజముజారె మరుత్కిశోరముల్
వలపులమీరె జక్కవల ✽ బాములుదీరె గుహాంతరంబులన్
బలపలదూరెఁ జీకటులుఁ ✽ బద్మవనుల్ విడిపాఱెఁదుమ్మెదల్
గొలగొలమింటఁబుల్గుగుమి ✽ కూతలుజెల్వలరారె నత్తఱిన్. 77

ఉ. అంతకుమున్న వేగుద్విజు ✽ లందఱుకర్తనుంటఁజూచిభా
స్వంతునితోవచింపనుడు ✽ మండలినంపుటెఱిఁగిపక్షులా
వంతనుమాన్యవిప్రులుస్వ ✽ వర్ణులురంచే భిమానమూనియా
ద్యంతముఁదెల్పునన్నగతి ✽ నండజముల్ వినువీథిఁగూసెడున్. 78

క. ఆతెఱఁగెఱిఁగినభంగిమ
హీతలమున వెలయువిప్ర ✽ బృందముభక్తిన్
ప్రాతఃకాలాహ్నికము
లాతతనొనరింపుచుండి ✽ రాసమయమునన్. 79

సీ. హరిచేతిచక్రమో ✽ హరిహయసుతుఁడాడు కందుకంబో లేక ✽ ఖరకరుండో
లోకచక్షువొయోంపు ✽ లోమజహారంపు దివ్యమణియొ లేక ✽ దినకరుండో
పసిడిబొంగరమొర ✽ క్కసులఁద్రుంపగవచ్చు హరివజ్రమో లేక ✽ హాస్కరుండో
సురలదివ్వెయొ పూర్వ ✽ గిరిపైని మంకెనపూబంతియో లేక ✽ పూషణుండో
తే-గీ. అనఁదనరెఁబూర్వదిశభూన ✽ భోంతరాళ
విస్ఫూర్తికరసహస్రంబున ✽ వెలయఁదిమిర
భయనివర్తిఁద్రిమూర్తిరూ ✽ పప్రవర్తి
విక్రమస్ఫూర్తిభాస్కర ✽ చక్రవర్తి. 80

వ. అట్టియెడ సమ్మహీకాంతుండు నిజపరిజనంబుల పరాకుల మేలుకాంచి యహర్ముఖోచితకృత్యంబులం బరివర్తించి వెండియుఁ బూర్వమహీమండలంబు జయింప ,సమరసన్నాహంబులొనర్చుచు కమలా

కరంబులుఁగలంచు మదేభము తెఱంగున పుటభేదనంబు లెల్లవడవడ వడంకు చుండదండు వెడలుటయు.

కృష్ణదేవరాయలు కొండవీడునుండి దండు వెడలుట. 81

సీ. కొండఱు బ్రతికిన ఁ జాలుదైవికోలు కనిపించు మమ్మని ప్రాంతంబు
కొండఱు వెరిచి కదిసి గొనిపోవ మనియెదు
తేగి దండంబుల ఁ డిఁడు వారు
కొండఱు మీ కుల ఁ బంచుల మని తెల్పి
కలిసి మాతని దండ ఁ మెలఁగు వార్లు
కొండఱు బలములఁ ఁ గొని మాకొ నగవచ్చి
కనిభీతి వడి మ్రొక్కి ఁ లనెడు వారు

తే-గీ. నగుచుఁ బూర్వధరాధవుల్ ఁ బొగలఁగటక
విషయపర్యంతమునఁగల ఁ వీడు లెల్ల
దీసి తనవారిఁ బతులుగఁ ఁ జేసి యవలి
రాజ్యములగజపతికుల ఁ రాజులకడ. 82

వ. అంతనతండు జయజయ ధ్వానంబులుప్పతిల్లఁ దిరిగి తను జయించినపు రంబులెల్లఁ గలయంగనుం గొనుచుఁ గొండవీడు ప్రవేశించి యీదేశంబు నెల్ల కర్ణాటక రాజ్యంబునం గలిపి తద్విధంబెల్లనెల్లచోట్లం దెలియ శాసించి తదనంతరంబ. 83

మ. హరిభక్తుండును సాళ్వతిమ్మమను మేఁ నల్లుడుఁ దిమ్మాత్మజుం
డరిసంహారుఁడు కృష్ణమాంబకొమరుం ఁ దప్పాఖ్యుతమ్ముండు మం
ధరధీరుండును గౌశికాన్వయుడు నా ఁ నాదెండ్లగోపాహ్వయుఁ
గరుణన్ భూపతి కొండవీటి విభుగాఁ ఁ గావించెఁ బాలించగన్. 84

తే-గీ. తివిరి మదిగల్గు కోరికఁ ఁ దీర్చుకొని పు
రంబునకుఁ బోవఁ దలఁచి దైఁ ర్యంబు మిగుల
గజపతికులోద్భవయును చ ఁ క్కని సఖియును
నిర్వివాహయునైనక ఁ న్నియకునరసి. 85

## కృష్ణరాయలు గజపతికుమార్తెను దెచ్చుట.

సీ. ఏకన్యపదముల కెనరాఁగఁ దామరల్ సరసులఁ దపములు సల్పుచుండు
నేకన్య యూరుల కెనరాఁగ నంటులు వెఱుగువిరుగులొంది పేల్వమొందు
నేకన్య మధ్యమం బెనరాఁగ గడునూహలరయఁగ హరి కానలందునుండు
నేకన్య యారున కెనరాఁగ నాగంబు యుక్తి నేరకఁ బుట్ట నొదిగియుండు
తే-గీ. నేరమణిమోము సరిరాఁగ నెంచి చంద్రు
డెట్టుఁదోఁచక తనుమింటి పట్టునుండు
ఆసుధారసపూర్ణదివ్య ప్రసంగి
గమనసారంగి వరద రాజమలతాంగి. 86

ఆ-వె. అనఁగ నెగడుకన్య కనుబలాత్కారంబు
గాఁ గ్రహించి పుష్పకమున నునిచి
పట్టణమున కేగి భార్యగనుంగొన
పరిణయంబునాఁడు పంతమునను. 87

వ. ఇట్లు కన్యకం గొని రథారూఢండై తనపురంబునకుం జనుదెంచుచు మా
ర్గవశంబునఁ గంభంబున వసించియుండుటయు. 88

చ. అధికరహస్యమైతనరు నాయవనీపతి దాసిపుత్రుఁడో
విధము నెఱింగి కాంతమది విహ్వాలమొంది జగద్ధితంబు సద్
బుధనుతమైన వర్ణమునఁ బుట్టి కుజాతుని బొందుకంటె నె
వ్విధిమరణంబు మేలనుచు వేగ ధరావిభుకోర్కె నొంపఁగన్ 89

వ. కృతనిశ్చయయై ధృతిదూలక తద్భూపతితో నరుదేరనొల్లనని చెలియలచేఁ
దెలుపుటయు నతండు కన్యకకడ కరుదెంచి చతురోపాయంబుల యబ్ర
త్నించి చేడియరామికి పశ్చాత్తాపమొంది తరుణినచ్చట విడిచి తనపరిజనం
బులతోడ పురంబునకరుదెంచె నంత నక్కాంతారత్నంబు నిర్మలాత్మ
యై తనజనకస్థానంబున నుండి తెచ్చిన ద్రవ్యంబుచేఁ గంభంబు వసరు
గానుండఁగాంచి విస్తారంబగు నొక్కదివ్యతటాకంబుఁ ద్రవ్వించి కీర్తివహించి
సకలధర్మంబులొనరింపుచు నిస్సంగంబున నం బెద్దయుం బ్రొద్దుగడుపుచుం
డ నీవార్తలా విద్యానగరనాయకుండు వినిమనంబున సంతసిలి తద్వనిత

యందనుగ్రహించి మిగులద్రవ్యంబు బంపుచుండి (1437) పదనాలు
గు వందల ముప్పది యేడవ వత్సరంబు మొదలు(1455)పదనాలుగునూ
రుల యేబదియైదు వరకుఁగుండినాధికారంబును వహించె నిటఁగొండ
వీటి పురంబున. 90

## నాదెండ్లగోపమంత్రి ప్రభుత్వవిషయము.

క. నాదెండ్లగోపయామాత్యుఁ
డాదుర్గప్రచయపాలుఁడై సర్వజనా
మోదకరుఁడగుచు శ్రీహరి
పాదాబ్జధ్యానమాన పరతంత్రుండై 91

తే-గీ. అచటశిధిలంబులైనదే వాలయములు
గాంచి దివ్యస్థలంబని యెంచి మిగుల
హరికృపారసాస్వాదను డగుచు నవ్య
ముగను దేవప్రతిష్ఠసే యఁగదలచి. 92

మ. తతచిత్రీకృతకుడ్యగోపురముఖ ద్వారాభిరామంబున
వ్యతరాభ్రంకష శేఖరాన్వితము ది వ్యక్షేత్రమాన్యంబునై
క్షితిరాజిల్లెడు నాలయంబును సృజిం చెన్ మించుభద్రాద్రికిన్
బ్రతిగాఁగన్ బరివారయుక్తముగ శ్రీ రామున్ బ్రతిష్ఠింపఁగన్. 93

వ. ఇట్లు సృజించి తదీయాలయంబున నొక్క సుముహూర్తంబున రఘునా
యకుల నిల్పి భగవత్కైంకర్యంబులకు శా॥శ॥ ౧౩౩౩కి సరియగు విక్ర
మవర్షమున తెల్లంబల్లెయును అనుపాలెమును మైందవ్రోలును అగ్ర
హారంబులిడి ముటియుఁగొంటవీటి రాష్ట్రవాణిజ్యంబులపైని పెక్కు
వచ్చుబడులు వచ్చునట్లు కట్టడులఁ జేసి యవియెల్లం దెల్లంబగునట్లు నిట్లు
నిశాసనంబులిఖించె. 94

(కొండవీటినుండి సోమరాజు హనుమంతరాయుడుగారంపినది).

వసంతతిలక. శ్రీరామచంద్రశ్శ్రియమాతనోతు, సీతాసహాయో మునిధర్మపత్న్యాః
యస్యాంఘ్రిపంకేరుహరేణురాసీ, దశ్మవ్రతోద్యాపన కర్మహేతుః.

శా. బ్రహ్మేంద్రాది శిరోమణిచ్ఛవిర విప్రాతిర్మయూఖారుణం
భూషావ్రతభి పశ్చరశ్మిలహరీభృంగాళి శృంగారితం
మంజీరక్వణితైర్మరాళ వనితామంజుస్వనైరం చింతం
వందే రామపదారవిందమనఘం వందారుకల్పద్రుమం.

అను. యత్కటాక్షశ్చ కరుణా క్రోధాభ్యాంశ బలీకృతః
విభీషణో రావణోచ సపః పాయాద్రఘూద్వహః.
ఆవ్యాదాదివరాహో వస్సర సాముచ్ఛ్వహన్మహీం
నిజాంగసంగసంజాతసాంద్రస్మేరోపయా దివ.

మాలిని. ఉరసినిహితలక్ష్మీ బాహువల్లీయుగేన, స్వకరయుగళమేకీకృత్య కేళీవినోదః
కువలయదళ దామానద్ధమందారమాలాం, దధదివపితనోతు శ్రీకళాం కాకుళేశః.

అను. అస్తి శ్రీకృష్ణరాయాఖ్యనరనాధశిరోమణిః
రాజన్యమౌళి కారత్ననీరాజితపదాంబుజః
సింహాసనానర్హతయా ద్వాపరేలజ్జయా హరిః
కలౌ బ్రహ్మాసనాశీనః కృష్ణరాయమహోద్వహః.

శా. శ్రీకృష్ణక్షితిపాలరత్నమణిభిర్విద్వత్కవీనాంగృహాః
నానారత్నవిచిత్రకుట్టిమభువోరత్నాకరత్వంగతాః
అబ్ధిః కేవలనీరపూరనిలయస్సంభావ్యతే సజ్జనై
రంభోధిర్జలధిః పయోధిరుదధిర్వారాంనిధిర్వారిధిః.

శా. ఆలానంరిపుదంతినామరిపశోయూపస్సమీకాధ్వరే
వైరిస్వాంతనిఖాతశంకురుదితోదీప్రప్రతాపాంకురః
పాతాళాద్ధరణీంవరాహవపుషా దంష్ట్రాధరస్సుద్ధతః
శ్రీకృష్ణక్షితిపస్సభాతి విజయస్తంభః కళింగాంగణే.

అను. మహాప్రధానశ్శ్రీసాళ్వతిమ్మస్సచివశేఖరః
శ్రీకృష్ణరాయనృపతేస్సామ్రాజ్యమధితిష్ఠతి.
శ్రీసాళ్వతిమ్మసచివః కౌండిన్యకులశేఖరః
వేమయామాత్యతనయరాచయామాత్యనందనః.

స్రగ్ధరా. విద్వన్నైకాంవిశేషం వితరణవిభవైర్విద్వదగ్రేసరాణాం
పద్మావాణీవిలాసైః ప్రగుణమణిగణైః పక్ష్మలాక్షీసహస్రైః

రమ్యప్రాకారహర్మ్యై రతులపరిఖై రశ్వహస్త్యాదియానై
స్సమ్యక్తైభ్యో విభేదం సమరవిజయతే స్సాళ్వతిమ్మస్సజానే.

స్రగ్ధరా. సప్తాంగోపేతశక్తిత్రితయచతురుపాయైకమంత్రీశసాళ్వ
తిమ్మాఖ్యః కొండవీట్యాం గజపతినిహితాన్ రాజహంసాన్ గృహీత్వా
ధాటీమాటీకమానే పరనృపతిఖగాః త్రుటిత్పపాసాతిఖిన్నాః
శాకాబ్దాన్ మార్గయంతే గిరిపురజలధిష్వాసుగూఢం ప్రలీనాః.

వృత్తము. సాళువాంకశకవత్సరగణ్యే, మాఘశుద్ధహరివాసరసౌరా
సాళ్వతిమ్మసచివేనగృహీతం, కొండవీటినగరం నగరాజం.

శా. పుత్రారామతటాకదేవసదనబ్రహ్మప్రతిష్ఠానిధిః
కారుణ్యామృతపూరపోషిత కవీంద్రప్రోతకృత్యుజ్వలః
దీనానాథకృపాత్తకీర్తి కృతవానా సేతు సీతాచలం
శ్రీకృష్ణక్షితి పాలమౌళి సచివశ్శ్రీసాళ్వతిమ్మప్రభుః.

అను. కౌశికాన్వయసంభూతో నాదెండ్లకులశేఖరః
అస్తితిమ్మయమంత్రీ శస్సమ్మతస్సర్వబంధుషు
కృష్ణాంబారుంధతీసూనం భర్తృవాక్య మరుంధతి
అనసూయాహి సర్వత్రహ్యనసూయేతి గణ్యతే.
నాదెండ్ల తిమ్మయామాత్యః కళత్రేసూతవాన్ సుతౌ
తత్పుత్రావప్పయామాత్యగో పయామాత్య శేఖరౌ.

స్రగ్ధరా. జంభద్విట్కుంభికుంభద్వయ సచివ శచీచారువక్షోజకుంభ
వ్యక్తవ్యాప్తాను లిప్తప్రసృమర మసృణక్షోదకర్పూరపూరా
యత్కీర్తిః కార్తికేందుం పరిహసతినిజైశ్వర్య సంప్రీతధీమాన్
సోయం నాదెండ్ల యప్పప్రభుమణి రఖిలస్తుత్యకీర్తి ప్రతాపః.

స్రగ్ధరా. యద్ధాటీఘోటకోటీఖరఖురదళితక్ష్మాతలోద్ధూతధూళీ
పాళీపాతాళకేళీ కృతధరణి తలేఖడ్గయుగ్య స్సబాహుః
జిహ్వాలాభీల భూభృద్భుజగపరివృఢో లక్ష్యతేసిద్ధ సంఘైః
సోయంనాదెండ్లయప్ప ప్రభురవని భరాధారబాహు ప్రతిష్ఠః

అను. గోపో నాదెండ్లగోపశ్చతుల్యౌ పితికథంత్రుమే!
ఏకసంతానవాన్పూర్వస్సప్తసంతానవాన్ పరః

స్రగ్ధరా. ఏకేచాధ్యాపితాయే వితరణనిగమాన్వేదితుంసింధుచంద్రా.
స్తిత్యాజాడ్యంప్రపన్నాకతిచపశుదృషద్దారుజాత్యాతిమూఢాః
ధత్తేచాధ్యాపయంస్తాన్ వితరణనిగమాన్ గోపయార్యః కరేద్ధిం
కల్పద్రుంకామధేనుం హృదివదన దృశోశ్చంద్ర చింతామణీచ.

స్రగ్ధరా. యద్వైరిక్షోణిపాల ప్రకరపురమహా చంద్రశాలాగృహాంతః
శ్రీఖండస్తంభశుంభద్భుజగపరి వృఢాలీఢ దేహార్కవాహాః
మూర్ఛన్తోహాస్థలంతస్సలదిగతవిషావైనతీయేన. ... ... ...

...తిభాతినాదెండ్లగోపః.

శా. శ్రీకృష్ణక్షితిపాలమౌళిసచివః శ్రీసాళ్వతిమ్మప్రభు
ర్జామాతృ ప్రవరేధురంధరవరే శ్రీగోపమంత్రీశ్వరే.
ప్రాదత్తాఖిల కొండవీటినగరీ సామ్రాజ్యధౌరేయతాం.
మత్తేభాశ్వపదాతిసైన్య కలితాంపల్యంకికాంచామరీం'

వృత్తము. శ్రీకృష్ణరాయనరనాధశిరః ప్రధానః
శ్రీసాళ్వతిమ్మసచివేశ్వరభాగినేయః.
నాదెండ్లగోపసచివోనయతత్వవేదీ.
శ్రీకొండవీటినగరైకధురంధరోభూత్.

వృత్తము. రాఘవాయగణితేశకవర్షే ౧౪౪౨
రాఘవాయరచితాలపూర్వ్యాం
వప్రగోపురయుతైర్గ్నవహర్మై.
ర్గోపమంత్రితిలకేనసపర్యా.

శా. శాకాబ్దేక్షియుగాబ్ధిచంద్రగణితేసంవత్సరేవిక్రమే.
శ్రీకృష్ణక్షితిపాలమౌళిసచివశ్రీసాళ్వతిమ్మాజ్ఞయా.
ప్రాకార్ధన్నవభిశ్చహేమకలశైరత్యున్నతంగోపురం.
ప్రాకారోత్సవమంటపైరుపచితం శ్రీరామభద్రాయచ.

శా. రామాయోత్సవవిగ్రహాంశ్చకనకాంకల్పాంశ్చముక్తావళీ.
ముఖ్యంచాభరణౌఘముజ్జ్వలతరంశ్రీ కొండవీటిపురే.
ద్వ్యాసత్త్యర్థికాంసియోగరచనాంనాదెండ్లగోపప్రభు.
ర్లక్ష్మీనాయకసాళ్వతిమ్మవిభవేపుణ్యాయకృత్వాదిశత్.

వృత్తము. శ్రీయజ్ఞవాటీపురనాయకరాఘవాయ.
శ్రీకొండవీటిసకలైర్వసుమూలవీసాన్.
లెంబల్లెశ్రీమైందవోల్వను పాలెమాదీన్.
శ్రీసాళ్వతిమ్మవచసాధితగోపమంత్రీ.

శా. యావజ్జహ్నుసుతాత్రియంబకసుతా శ్రీకృష్ణవేణీపయః.
పూరాస్తే పునతేభువంచవిపులాంశ్రీకొండవీటీపురీం.
యావత్కావ్యసుధాంబు రాశిలహరీహేలాంవిధత్తేకవి.
స్తావత్సాలు వతిమ్మకీర్తిల తికాపుష్యత్వజస్రంభువి.

అను. మహోపాధ్యాయ పంచాగ్ని దీక్షితోద్వాదశాహకృత్.
లొల్లా లక్ష్మీధరోయ జ్వాప్రాహైతద్ధర్మశాసనం॥ శ్రీశ్రీశ్రీ.

స్వస్తిశ్రీజయాభ్యుదయ శాలివాహనశవర్షంబులు ౧౪౪౨ అగు నేటి విక్రమసంవత్సర వైశాఖశుద్ధ ౧౫లు సోమగ్రహణపుణ్య కాలమందు కొండవీటి శ్రీయజ్ఞవాటికా రఘునాయకులకు శ్రీకృష్ణదేవమహారా యలసాంమ్రాజ్యధురంధరశ్రీమన్మహాప్రధాన సాళ్వతిమ్మరుసయ్యంగారి మేనల్లుడైన కౌశిక గోత్రఆపస్తంబ సూత్రయజు శ్శాఖా ధ్యాయులైన నాదెండ్లతిమ్మరాజుంగారి కుమారుడైన గోపరుసయ్యంగారు దేవు నికి శిఖరముకట్టించి శిఖరమంటప గోపురాలు సన్నపనులు చేయించి పైడికుండలు యెత్తించి తిరిచుట్టు మాలెను ప్రాకారమున్ను కట్టించి వుత్సవ విగ్రహాల సమర్పించి అంగరంగ వైభవాలకున్ను అమృతపళ్లకున్ను వుత్సవాలకున్ను పూర్వానసాగి వచ్చే లెంబల్లె గ్రామము సాగించిమైంద వోలిగ్రామము సమర్పించి కొండవీటిసీమలోను సుంఖముసాగిన చోటనల్లాను మూలవీసాలు కొండవీడు ముందు వసంత ఘరువులోను ఆరువంట్యాలలోను.

తిరుమలపర్వతాలు మొదలైనవిచ్చి. ... ... ... ... ...
వుప్పు మామిడికాయలు,వుసిరిగెకాయలు,వంకాయలు,ఇండుపుకాయలు, మావినెవీనికి గోనెవకటింటికి అరపయికం లెక్కను, పెసలు మినుములు సెనగలు వులవలు కందులు గోధుమలు నువ్వులు ఆముదాలు కారామల్లు అనుములుప్రత్తి చింతపండు కరక్కాయ వుసిరికెపప్పు కంచచామ బిరుగడం వీనికిగోనె వకటికి పయికమున్ను,వుల్లి పసుపు గుగ్గిలం మెంతి జీలకర్ర ఆవాలు కొత్తగోనెల సలగఅల్లం నిమ్మపండ్లు టెంకాయలుగోనెవకటికి

వమ్మమున్నూ, బెల్లము దూది నెయ్యి ఆముదం సంగడి పప్పు శొంఠి ఇనుము పుష్కవులు వీనికిగోనెవకటంటికి దమ్మాలు రెండున్నూ, మామిడితాండ్రగోనెవకటింటికి దమ్మాలు మూడు, పంచదార పోకలు నూలుతమలపాకులువీనికి గోనెవకటింటికి దమ్మాల నాలుగు, పిప్పలి మిరియాలు, గంధముకరాంబులు జాజికాయ జాజిపత్రి సీసము తగరము రాగి వీనికిగోనెవకటింటికిదమ్మాలుఆరు, కోకలమలగకు చవిలెగా మర్యాదను నేమ్రడచాత మూలవీసాలు యిప్పించి శ్రీమత్ మహాప్రధానసాళువతిమ్మరు సయ్యంగారికిన్ని వారిదేవులులక్ష్మమ్మగారికిని పుణ్యముగాను నాదెండ్ల గోపరుసయ్యంగారు సమర్పించె యీధర్మానకు వడ్డెరాజులు తెలుంగు రాజులు తప్పిరా గంగలోను గోహత్యచేసిన దోషాన బోవువారు. తురక రాజులుతప్పితే పందిని దిన్నదోషాన బోవువారు.

అను. ఏకైకభగినీలోకేసర్వేషా మేవభూభుజాః.
నభోజ్యాన కరగ్రాహ్య దేవదత్తావసుంధరా.

అను. "దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోరుపాలనం"

శ్రీ శ్రీ శ్రీ.

క. పదునాలుగు వందలనలు (౧౪౪౩)
బదిమూఁడవ యేటనువృష సంవత్సరమునయం
దుఁదగిన ఫాల్గుణపౌర్ణిమ
విధువాసరమునఁ బ్రతిష్ఠ విధిసేయించెన్. 95

వ. ఇట్లుతండోపరించిన ప్రతిష్ఠావిధానంబెల్లఁ దెల్లంబగునట్లు శాసనంబు లిఖించెనెట్లనిన. 96

(శాసనశ్లోకములు.)

శ్లో॥ శాకాబ్దేపుర వేదవార్ధిశశి భూగణ్యాగపౌర్ణదినే
ఫాల్గుణ్యే విధువాసరేశుభదినే శ్రీకొండవీటీపురే
నాదెండ్లాన్వయగోపమంత్రితిలకా శ్రీసాళ్వతిమ్మప్రభో
జామాతారఘునాయకస్యకృతవాన్ సమ్యక్ప్రతిష్ఠావిధి॥" 97

శ్లో॥ సుగ్రీవలక్ష్మణవిభీషణజాంబవద్భిః
శత్రుఘ్నయుక్తభరతే చహనూమతాచ
సీతాపతిం సపరివారకమంగదేచ
రామశ్చగోప సచివోకృతసుప్రతిష్ఠం॥ 98

శ్లో॥ సీతారామనసమాన్వితస్సభరతా శేషాహ్వయోధ్యాతతః
శత్రుఘ్నాధికలక్ష్మణావిజయతే శ్రీకొండవీటిపురే
సుగ్రీవోహనుమాన్ విభీషణయుత శ్రీజాంబవత్వాంగదా
రామాసావరణంప్రతిష్ఠితమతా నాదెండ్లగోపప్రభో॥ 99

క. పదునాలుగువందల ము 1437
ప్పదియేడవ యేడుమొదలు పదునన్నూర్లే 1455
బదియైదువరకుఁగుండిన
సదయతఁబాలించెఁగోప సచివుండంతన్. 100

అచ్యుత దేవరాయల కథ.

ఉ. అచ్చుటికాఖ్యుడై తనరె నాయితబాహుబలప్రదీపకుం
డచ్యుతపాదపంకజను తాధికుఁడుజ్వల శౌర్యశాలివి
ద్వచ్చయకీర్తనీయుడుశ తన్వరభాసురసుందరాంగుడై।
నచ్యుతదేవరాయడు మహావిభవృతాత్కరదేవరాయుడై. 101

వ. అతండు నిజప్రధానసత్తముండగు రామయ భాస్కరామాత్య గ్రామ
ణికిఁ గుండిన ప్రభుత్వ సామ్రాజ్యంబు నొసంగుటయు నతండు కొండ
వీటికరుదెంచి సింహాసనాసీనుండై ధర్మమార్గంబునఁ బాలింపుచు. 102

మ. గిరిపై బద్ధయపూర్వనిర్మితములౌ శిల్లాలతాల్ మట్టిచే
గిరిక్రిందన్ బరభాగమందుననభం గీకారమత్యోన్నతం
బరిభూదారముఖాగ్రఖండనపటి ష్టాఢ్యంబసాధ్యంబునౌ
వరసాలంబుసృజించెశాఖలునభో భాగంబుచుంబింపగన్. 103

వ. తన్మధ్యంబునందు. 104

గోపీనాథపురవర్ణన.

సీ. వివిధపాంచాలికా వృతహేమకలశభా
స్వద్ధన్యప్రాసాద సంచయంబు
అష్టదిగ్వ్యాప్తశా ఖాంచితప్రసవఫ
లాభిశోభితవిట పాన్వితంబు
తతశతాంగకగతా గతరభసస్ఫూర్ణ
రాజమార్గైకవి రాజితంబు
సతతస్వధర్మాను చారపారీణవ
ర్ణచతుష్టయాలయ ప్రాభవంబు
తే-గీ. నవరసగ్రహణచణభూ నాథదత్త
మత్తశౌండగండస్రవ న్మదసుగంధ
రంగదసమవిద్వజ్జన ప్రాంగణంబుఁ
గోపీనాథపురంబున ద్గోచరంబు. 105

వ. ఇట్లు పురంబుసృజించి తన్మధ్యంబునందు. 106

గోపీనాథస్వామి ఆలయవర్ణన.

సీ. బహుచిత్రపుత్రికా ప్రకరశోభితములై
కుధరాళిక్రియనొప్పు గోపురములు
శతపత్రకము దాది లతలుదీర్చినజాల
కుదురుమించినమహా కుడ్యములును
సారంగశార్దూల శరభాదివన్యమృ
గములచిత్రించిన కంబములును
అష్టకోణాంచితం బై నభోకర్ష వి
లాసమొప్పుమహోప లధ్వజంబు
తే-గీ. పసిడిమయములౌకలశముల్ పచ్చతోర
ణములుపలువిధములవాహ నవ్రజములు

జయవిజయులాఖువారుల § శాస్త్రవిధము
లమరనిర్మించెగోపినా § థాలయంబు. 107

వ. తదీయద్వారశాఖయం దివ్విధంబున శాసనంబు లిఖించె. 108

"సీ. నిర్మించెనేమంత్రి ♦ నిరుపమప్రాకార
నవకంబుగాగోపి ♦ నాథపురము
గెలిచినాడేమంత్రి ♦ లలితవిక్రమమునఁ
బ్రబలుడైయవనుల ♦ బలమునెల్ల
నిలిపినాడేమంత్రి ♦ నియతవైభవమునఁ
గోపికావల్లభుఁ ♦ గూర్మివెలయ
పాలించెనేమంత్రి ♦ ప్రకటధర్మఖ్యాతి
మహిమమీఱగనాంధ్ర ♦ మండలంబు
తే-గీ. నతఁడుభూపాలమంత్రీంద్ర ♦ సతతవినుత
ధీవిశారదుడచ్యుత ♦ దేవరాయ
మాన్యహితవర్తనుడుశౌర్య ♦ మహితయశుఁడు
భానుతేజుండురామరా ♦ భాస్కరుండు." 109

తే-గీ. గోపినాథుఁబ్రతిష్ఠింపఁ § గోర్కిమిగిలి
శుభకరముహూర్తమొక్కటిఁ § జూచివేద
మార్గమునగోపినాథునా § మందిరమున
నిలిపెనాతండుబుధులుగ § ణింపుచుండ.

వ. మఱియు వెన్నముద్దకృష్ణస్వామియు, మూలస్థానీశ్వరుండును, అ
వీరభద్రుండునునగు దేవతలంబ్రతిష్ఠించి పాలింపుచుండెనంతఁ ద
జ్యంబునంగల డెబ్బదిద్దరుపాలెగాండ్రు కుటిలప్రవర్తకులును,దుష్ట
కులును, శిష్టప్రతిపక్షకులును, కుమతులును, పరదారాపరద్రవ్యా
కులును నైపలుతెఱంగులఁ బ్రభుధిక్కారంబుసేయుచుఁ బ్రజలఁబ
ధంబులఁ బ్రలాపింపసేయుచుండ నది యవార్యంబై దేశక్షోభంబ
వయియుండె నదివీక్షించి భాస్కరామాత్యుండు వారల వా
నుపాయంబరసి యతిరహస్యంబుగా గోపినాథుమందిరంబున ద
ద్వారంబుప్రోల దర్శనాగత మార్గంబునందు. 111

క. కట్టించెఁబెక్కుకత్తుల

బెట్టిదపుంగలుజలధికి భీతమగుచుపల్
మట్టులనిమ్నతరంబుగ
కట్టాయితమయినమూతిఁ గపటపుఁబనులన్. 112

పాలెగాండ్రను చీకటి కోనేటఁ ద్రోయుట.

వ. అంత నొక్కముహూర్తంబున నద్దేవునకు బ్రహ్మోత్సవంబొనర్చు ప్రయత్నంబులొనరించి తదుత్సవంబునకుఁ దద్దుష్టపు పాలెగాండ్రాది గాగలుగు సర్వలౌకికులను రావింపనియమించి యెల్లరు దేవునిదర్శించినపిమ్మట పాలెగాండ్ర పరస్పరంబుగా లోపటికి దర్శనార్థము రమ్మని శెలవిచ్చి వారొకరొకరు దర్శనంబొనరించి తిరిగి దక్షిణద్వారంబునం జనబోవుతఱి కృతప్రయత్నుండై కొందఱిని కపటులని యోచించి.113

ఆ—గీ. ఒకరినొకరుగాన కుండంగఁగపటపుఁ
జైవులొప్ప బావి సరసకరుగ
జేసియొకరినొకరి నీసునబడద్రోయ
నానతీయనట్లొ నర్చుటయును. 114

వ. ఇట్లు మోసంబున నరువదెనంబండ్రు పాలెగాండ్రు హతంబగుటయు నీచందంబు తక్కటి నలువురుందెలసి యాద్వారంబునరాక మరలి వేరొండుమార్గంబున తప్పించుకొనివచ్చి మనవారిందఱుజావ నిచట మనముండిన బలాత్కారంబునం జంపుదురని భీతిల్లి భూపలాయనంబైరంత. 115

చ. కుటిలగతుల్ దొలంగ దొరకోలులగర్వమడంగ నెచ్చటం
బటుకమలాప్తిపొంగద్విజ పాళినిజేచ్చవిధిన్ మెలంగ సం
కటగమనంబుద్రుంగెబొస గన్ సుమనోవ్రజముల్ వెలింగ దు
ర్ఘటమగుదోషమార్ప నధికారమునొందిన భాస్కరాఖ్యచేన్.116

ఆ—వె. పాలెకాండ్రఁడుదునిమి ప్రజలనుకాపాడి
యవనముఖ్యరిపుల నడచిసౌఖ్య
పదవినొంధజేసె సదయుడౌపతిప్రజ
కష్టమరసియెట్లు కావకుండు? 117

వ. ఇట్లధికసుఖంబుఁ దనరునట్లు పాలింపుచుండుసమయంబున. 118

తే-గీ. తనకుసోదరియునుఘన  ధర్మకర్త్రి
నాఁబరగుచిన్నమాంబవి  ఖ్యాతిమెసగ
ధర్మములొనర్చుచునునిజ  ధనవిశేష
మునశివార్పణగాఁజేసెఁ  బుడమినిట్లు. 119

సీ. కట్టెఁగొండకుమూఁడు  గడియలదూరాన
యమపార్శ్వముననగ్ర  హారమొకటి
రామచంద్రపురినా  నామధేయంబిడి
యటవిప్రకులసమూ  హములనిల్పి
పురమధ్యమునలింగ  మూర్తిప్రతిష్ఠించి
పరమేశ్వరాఖ్యతఁ  బ్రబలపఱచి
హరునకుసాతులూ  రగ్రహారమునిత్య
కృత్యోత్సవాదుల  కిడివిశేష

తే-గీ. జలసమృద్ధిగనారామ  చంద్రపురికి
బహుసమీపముగాయామ్య  పార్శ్వమందు
గోపినాథజలధినాఁగఁ  గొమరుమిగులు
దివ్యసరసీలలామప్ర  తిష్ఠజేసె. 120

వ. ఇట్లధిక ధర్మకార్యంబుల రాజ్యంబు చల్లన నుల్లసిల్ల భాస్కరుండు
పాలింపుచుండనట నచ్యుత దేవరాయుండు. 121

తే-గీ. విజయనగరమ్మునందుండి  విభవమెసగఁ
గుండినప్రభుత్వమునుగను  గొనుచునఘు
డగుచుపదునాల్గునూర్లేబ  దారుమొదలు 1456
కొనియరువదిమూఁడువరకు  మనిపెఁబుడమి. 1463 122

వ. అంత పదునాలుగువందల యరువదినాల్గవ శకవర్షంబున. 123

సదాశివ దేవరాయల కథ.

ఉ. శ్రీనలినాక్షుపాదసర  సీరుహసేవకుఁడుర్విఁ గృపాలన
స్థానసుఁడిందువంశుఁడు స  దాశివదేవమహీవిభుండువి

ద్యానగరంబునందుఁ బ్రభుఁడై భువి నేలుచుఁ గొండవీటి సం
స్థానముఁ బ్రోవఁగఁ బనిచె సత్త్వవిశాలుని ధర్మశీలునిన్. 124

సీ. శ్రీమహారాజమ హామండలేశ్వర, వీరప్రతాపాది బిరుదువాని
ఆత్రేయగోత్రప విత్రుని శమదమ, శాంతిక్షమాదిక సరసగుణుని
వినయసంపన్నుఁ గంటి దనవ్రోలి శ్రీరామ, రాజపౌత్రుని సుధీరత్నవిభుని
మూర్తిరాట్సూనుని కీర్తివిస్తారుని, నవనవోన్మేషణానందవశుని

తే-గీ. ధీరు విఠలయ్య దేవమహారాయు
ననుపఁ గొండవీటి కరుగుదేరి
రత్నపీఠిఁ గొల్వు రంజిల్లి కుండిన
విషయమేలుచుండె విశ్రుతముగ. 125

వ. అట్టియెడ నతండధిక ద్రవ్యంబు భగవదర్పణంబు సేయందలంచి. 126

తే-గీ. కొండవీటిని వెలుఁగొందుఁ గొండపల్లి
చెరువుపరభాగమునఁ గొండ శింగరయ్య
యనఁగఁ దగు శ్రీహరికి దేవతాలయంబు
ఘనతరోపలఘటితమై తనరఁగట్టి. 127

చ. అరసి శుభస్కరంబుగ శకాబ్దములం ద్రిమహామహీంద్రసా
గరనలినారిసంఖ్య (1473) పరఁ గంగవిరోధికృతాబ్దమందునం
జరుగు చతుర్థమాసమున సంగతమై తగు కృష్ణపక్షమం
దరిదిగ ద్వాదశిన్ హరి సమర్పణ జేసెను భక్తియుక్తుఁడై. 128

వ. అంత నిమ్మహీకాంతుండు ప్రభుత్వంబుమాని చనుటయు ననంతరంబ
సదాశివ దేవరాయలపనుపున శ్రీ మన్మహా మండలేశ్వరాది బిరు
దాంకితుండును, ఆపస్తంబసూత్రుండును ఆత్రేయసగోత్ర పవిత్రుండు
ను, యజుశ్శాఖాధ్యాయనుండు. కాశీసేతుమధ్యస్థల ప్రశస్తకీర్తి విస్త
రుండునునగు శ్రీమద్రాజాధిరాజ పెదకొండ రాజదేవ మహారాయల
పౌత్రుండును వేంకటేశ్వర ధరారమణుని పుత్రుండునునగు శ్రీకుమా
రకొండ రాజయ్య దేవమహారాయలు కొండవీటికరు దెంచిరత్న
సింహాసనాసీనుండై పాలించుచు. 129

సీ. శ్రీహరినాభిరా ꕶ జీవసూతికులాబ్ధి
శుభ్రాంశుడుర్వరో ꕶ త్సుకకరుండు
దానకర్ణుండువి ꕶ ద్యావిశేషుఁడుఁగోటి
భాస్కరసంకాశ ꕶ భాసురుండు
ఘనుఁడురాయనిభాస్క ꕶ రునియన్నమయగారి
పౌత్రుండురామయ ꕶ భాస్కరాఖ్య
పుత్రుండు మానిత ꕶ పౌత్రుండుఁగొండప్ప
నామధేయుండువి ꕶ నయగుణుండు
తే-గీ. అనగఁదగునమాత్యునకుమో ꕶ క్షార్థమతడు
పెక్కుబహుమతులనిడిబల్ ꕶ ప్రేమమీఱఁ
బూజలొనరించి సత్కార ꕶ ముగనొసంగె
శాశ్వతంబుగనిట్లని ꕶ శాసనంబు. 130

శాసనము.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు 1483 పదునాలుగు వందల యెనబదిమూడవదగు నేటి దుర్మతినామసంవత్సరమాఘశు 15 పౌర్ణమిస్థిరవాసరమునయిచ్చినధర్మశాసనమేమనగా: ---

శ్రీమన్మహామండలేశ్వర రామరాజతిరుమల రాజయ్యదేవమహారాయలుంగారు మానాయకరానకు నివ్వనవధరించివిన్నకొండసీమలో నిదివరకు జరుగుచుండే స్థలకరిణీకములు యేకసంప్రతి పూర్వముసాగివచ్చె యేకభాగగ్రామములు అగ్రహారములు వృత్తిక్షేత్రములు. అమరపుంజనిక సంజాతగుర్తులు గ్రామాలున్నూ గలిగిన తెలుపాటినీరుపాటి తోటలు సహితము సర్వమాన్యపుకమతాలు మొదలుగాను మీకుసాగివచ్చె వర్తనతేజోపార్జన స్వామ్యాలున్నూ తిరుమలరాజయ్యగారు పూర్వమునడిపించిన మర్యాదను మేమున్నూయీతదోతిథిగ్రహణ పుణ్యకాలమందు తుంగభద్రా తీరమున విఠలేశ్వర సన్నిధిని వినుకొండలోను మేముప్రతిష్టచేసిన రఘునాయకులకు ప్రతిగాను శ్రీవాచకముగాను త్రికరణశుద్ధిగాను సహిరణ్యోదకదాన పూర్వకముగాను ధారపోసియిస్తిమి గనుక మీస్థలకరిణీకాలకు చెల్లివచ్చెగ్రామాలు కమతాలు అగ్రహారపు వృత్తిక్షేత్రాలు వర్తనలురస్మి తేజోపార్జనలు మొదలైన నానావిధ స్వామ్యస్వతంత్రాలున్నూమీపుత్ర పౌత్రపారం పర్యంతరం ఆచంద్రార్కస్థాయిగాను సుఖానుఅనుభవించేది. 131

వ. ఇట్లు ధర్మంబులొనరింపుచు కుమారకొండరాజ యాభిధానుండు కొంత కాలంబు పాలించెనంత నచట సదాశివదేవరాయ మహీపాలుండు విద్యానగరమందధివసించి కొండవీటిరాజ్యంబు భృత్యులచే నేలించి తద్రవ్యంబుగొనుచుండె. 132

క. పదునాలుగువందలయరు 1464
వదినాల్గవశకము మొదలు వరకరుణనుతోం
బదవశకము వరకేలెను 1490
సదాశివుండిరువదేడు సంవత్సరముల్. 133

తే-గీ. అంతవిద్యానగరమున యందుసకల
ధీవిదుఁడురామరాజయ దేవరాయ
విభుఁడుపట్టాభిషిక్తుఁడై విపులరాజ్య
మేలుచుండెను ప్రజనెల్ల మేలునొంద. 134

క. అనుచును నాశీరునకతి
వినయంబెనయఁగఁద్రిలోక విదుఁడగువనజా
సనమానస తనయుండొగి
వినుపించెను కొండవీటి విభుచరితంబుల్. 135

చ. భవసరసీరుహాసనను పర్వసమూహముఖప్రకర్షభ
ర్మవిరచితప్రశస్తమణి రాజివిరాజితభూనభోంతరే
ద్ధవిమలపాదపీఠ విబు ధప్రకరప్రమదప్రదామనో
భవజనకాకృపాకలిత భాసురవీక్షణ భక్తరక్షణా. 136

మాలినీవృత్తము.

ఘనసదృశశుభాంగా క్రమవాచానుషంగా
ఘనగరుడతురంగా గర్వితారాతిభంగా
ప్రణుతవిపులభంగా భక్తచిత్తాబ్జభృంగా
ఘృణివిజితపతంగా కీర్తనీయాంతరంగా. 137

ద్విప్రాసము.

క. సంగరవిజితాసుర,గుణ, సంగరసాభరణసుప్ర- సంగరమేశా
సంగరబాంధవ,రిపుజన, సంగరకరభక్తతరణ- సంగరభరణా.

గద్య. ఇది శ్రీమజ్జగత్ప్రాణ తనయ వరప్రసాదలబ్ధ కవితాసంకలితాపస్తంబసూత్ర కౌండిన్య సగోత్ర పవిత్ర వివిధ విద్వన్ముఖ సరోజాత మిత్ర మద్దులపలివంశదీపక వేంకటప్పయాభిఖ్యతనూజాతక సుకవి జనసేవక గురుబ్రహ్మానామకవి రచితంబగు శ్రీ కొండవీటిచరిత్రమునందు

తృతీయాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ.

శ్రీరస్తు.

# శ్రీకొండవీటిచరిత్రము.

## చతుర్థాశ్వాసము.

క. శ్రీమహిళామణిమానస
సీమారాజన్మరాళ సింధురభరహ్రా
త్క్రమితఫలదాశ్రితగిరి
ధామాకోదండరామ తారకనామా.

క. అవధారుపంకజాసన
భవుచేనాదివిజలోక పతివినిదానన్
దవిలితదనంతరకథను
వివరింపుమటన్ననిట్లు వినుపించెనొగిన్. 2

### తురకలు రామరాజును యుద్ధమున జంపుట.

తే-గీ. అంతనారామరాజదే వాగ్రగణ్యు
డచటవిద్యానగరమేలు నట్టియెడల
పురసరోజభవాబ్ధి ములఁదనర్చు 1493
సంఖ్యఁదగుశాలివాహన శకమునందు. 3

శా. ఢక్కన్ దేశపుఁబాదుషాలుబలశుం డాలప్రభు ప్రాభవుల్
యొక్కాణింపగరానిసైనికులతోఁ నుద్యత్ కరీంద్రాళితోఁ
జక్కాడందగునాయుధాళిఁగొనివాం ఛాస్ఫూర్తితో వచ్చిబల్
ముక్కోపంబునఁ ద్రుంచిరానృపుని సంపూర్ణప్రతాపాఢ్యులై. 4

### తురుష్కులు దేశము స్వాధీనముచేసికొనుట.

ఉ. మేటిబలంబునంగెలుపు మీఱినతన్నృప సంచయంబునన్
గోటివిభాకరోజ్వలుఁడుఁ గుచ్ఛ్రితవైరిజనాళిదుష్టహృ

త్పాటనశ స్త్రశస్త్రచయ । ధారుఁడుమల్కిభరామశౌరిక
ర్ణాటకపీఠిఁగొల్వమరి । రాజ్యముసేయఁగఁ గొండవీటికిన్. 5

చ. పనిచెస్వకీయపక్ష పరి । పాలనశీలుఁబరాభిమానభం
జనుబహువిగ్రహోన్నతధన । చండసమర్థుమహాభయంకరున్
జననుతుమృత్తుజాహ్వయుని * । సాంద్రబలుండనివార్యుడాతడున్
బనివినితత్పురంబుఁబరి । పాలనసేయగ బూనితద్దయున్. 6

సీ. దుర్గవర్గంబుల । దొరలవిసర్జించి
స్వజనులఁబ్రభులుగా । సంతరించి
హిందూమతక్రమ । హీనంబుగావించి
నిజమతమార్గముల్ । నిర్ణయించి
పరదేవతార్చనల్ । భంగంబుసేయించి
యాలయంబులనెల్ల । హతమొనర్చి
బహువిగ్రహంబుల । భగ్నంబుగాఁజేసి
పలుమశీదులనెల్లఁ । బ్రబలపఱచి

తే-గీ. గోపినాథపురముఁజేరి । కొల్వుదీరి
యాపురికి మృత్తుజానగ । రనగఁదనదు
నామధేయంబునిడిక్రూర । నామధేయు
డగుచురాజ్యంబుఁబాలించు । నట్టియెడల. 7

తిరుమలదేవరాయడు తురుష్కుల గెలుచుట.

చ. హరికరుణాభిశోభితుడు । నత్రికులోద్భవుడున్ మహాబల
స్ఫురణుడుయాజుషాఖ్యఘన । సూత్రుఁడునై తగునానుగొందిశ్రీ
తిరుమలదేవరాయుఁడతి । ధీరతసాగెను దక్షిణంబునన్
బరయవనోగ్రతామసవి । భావసుడీతడనంగఁబొంగుచున్. 8

ఆ-వె. అతడుకృష్ణవేణి । యామ్యదేశంబున
మెదలుతురకజనుల । మెదిపిమెదిపి
తత్తదధిపరుధిర । దాహంబుచేకొని
కొండవీటికరిగి । దండువిడిసి. 9

* మృత్తుజా. 1494

మ. రణరంగంబునను గ్రశస్త్రవిశిఖ ఽ వ్రాతాంత్రదండహ్యమా
నని తాంత ప్రతిపక్షకీటకవితా ఽ నప్రాభవుండై తురు
ష్కనృపాలుండగు మృత్యుజాలదునిమిదు ఽ ర్గశ్రేణికిన్ నాథుఁడై
జనసౌఖ్యప్రదమార్గమొప్పఁగను రాజ్యంబెల్లఁ బాలింపుచున్. 10

క. తిరుమలరాయడు వప్ర, స్ఫురితంబగు గోపినాథ ఽ పురమున గంగా
ధరరామేశ్వరుడనగను, హరుని ప్రతిష్ఠించె బహుళ ఽ రాలయవసతిన్. 11

తే-గీ. ఇతఁడు తొల్లింటి మార్గంబు ఽ లెసఁగఁ బ్రజల
బాలనంబొనరింపుచు ఽ భవ్యుడనగ
బరగి పదునాల్గునూర్లతొం ఽ బదికిఁ బైన 1494
నాలుగవవత్సరము మాత్ర ఽ మేలెనంత. 12

## శ్రీరంగరాయలకథ.

చ. ఇతనితనూభవుండు గిరి ఽ జేశ్వరభక్తుఁడు సత్యపాలనో
న్నతుఁడు జగత్ప్రసిద్ధుఁడు ది ఽ నప్రభుతేజుఁడు రంగరాజభూ
పతి తనతండ్రి మారుగనుఁ ఽ బార్థివుడై హరిపీఠమెక్కి యీ
కుతలము బ్రోవనం పెవెలు ఽ గోటికులోద్భవుడై నతిమ్మనన్. 13

సీ. అనిపిపూర్వంపువ ఽ ర్తన లెల్ల దనరం
గఁ బాలింపుచును గడు ఽ భక్తి వెలయ
జనకుడేర్పాటు జే ఽ సిన హరునకు భోగ
వర్గముల్ జరిగెడు ఽ వసతిగాగ
తనప్రభుత్వావనీ ఽ స్థలమునఁ గృష్ణ
వేణీతీరమందువి ఽ ఖ్యాతిమిగులు
మోరుపూడియనజె ఽ న్నారు
నూరగ్రహారంబు ధారాగ్రహి ఽ తంబుగాగ

తే-గీ. శరధిరత్ననిగమసోమ ఽ సంఖ్యలందు 1494
వరలినట్టియాంగీరస ఽ వత్సరమున
దగినవైశాఖశుద్ధద్వా ఽ దశినిఁ బుణ్య
సమయమందు సమర్పించె ఽ విమలమతిని. 14

సీ. పదునాల్గునూర్లతొం బదితొమ్మిదవ 1499
దాచుఁబరగిన యీశ్వర వత్సరమున
కార్తికమాససం కలితమౌశుక్లప
క్షమునఁజెన్నొందుద శమినిఁబుణ్య
కాలమందునఁబాద కర్మవిరూపాక్షు
నకునుసదక్షిణో దకముగాగ
హరిహరాదులుసాక్షు లై చెలువొం
దంగగొలిజవ్రోలను పేరఁ గొమరుమీరు
తే-గీ. రంగరాజపురాగ్రహా రమునొసంగి
బహుళధర్మస్వరూపుడై ప్రమదమెసగ
నతడుకర్ణాటదేశమం దధివసించి
సకలరాజ్యంబుఁబాలించు సమయమందు. 15
చ. సకలమునమ్ముదంబునన సంగెజనాళిస్వకీయధర్మమా
ర్గకలితమైజెలంగెపర రాజభయంబుదొలంగెనస్యముల్
ప్రకటఫలంబొసంగెఖల వార్తలడంగెనతుల్యవైదుషీ
ప్రకరమహీనసత్కరణ వైఖరిఁబొంగెసురక్షణంబునన్. 16
వ. ఇట్లుతండాఖండల తుండిడిండీర చండీశసుధా మండలకుండలీంద్ర శరసి
తసారసశారద నారదపారదసాంద్రకీర్తివిశారదుండై నిండుకొలువున
సభామండల మండనపండిత ప్రకాండ పరివేష్టితుండై ధర్మమార్గాను
వర్తియగుచుం బాలింపు చుండెనిటఁకొండవీటి పురంబుననిజసామంత
ప్రభువగు వెలుగోటితిమ్మన 1495 మొదలు 1501 వరకు నేలుచుండె
నట్టియెడ. 17

రాయరావు కొండవీటిదేశముపై దండెత్తి వచ్చుట.

తే-గీ. హాజరతిబ్రహింపాదుషా యనునబాబు
కృష్ణవేణ్యుత్తరంబునఁ బృథ్వినేలు
చుండిదక్షిణదిశపైని దండువెడలఁ
గోర్కెమదిఁగల్గిమిక్కలి క్రూరుడగుచు. 18

మ. తనభృత్యుండుమహాబలుండుశరవి § ద్యాపారగుండుఁ ఘనుం
డును సుదగ్ధిమణాదివాకసగురుం § డుఁ ఖాయితీబ్రాహ్మణుం
డునునై పొల్పగురాయరావునసమా § నుఁ కొండవీడ్జెల్వగాఁ
బనుపఁ రావును వేడ్క మీఱ వెడలెఁ § బాహాబలస్ఫూర్తిచేఁ. 19

సీ. పవమానవేగసం § ప్రాప్తంబులై మింటఁ
బాఱెడుపదివేల 10,000 § వారువములు
తాకునకద్రివి § తానముల్ పొడిసేయు
శతశంఖ్య 100 గల్గిన § సమదకరులు
ఆయుధసాధన § నలవడునేబది
వే 50,000 ల్బలయుతమగు § కాల్బలమును
చెవికట్లుబిగియించి § సిద్దంబులై పెక్కు
లాగులఁదగుపిరం § గీగములును

ఆ-వె. బాణపాణులైన § భటులు పెక్కుండ్రును
గలమహాబలంబు § గైకొనియట
వెడలి రెంటమూఁట § విశ్రమింపుచుఁగృష్ణ
దాటివచ్చితనదు § ధాటిమిగుల. 20

క. వినకొండమాటమాత్రం
బున మొదలంగొనిబలంబు § ముప్పిరికొనఁద
త్క్షణమునబెల్లముకొండను
బనివడి మర్దనమొనర్చి § పడసెను దానిఁ. 21

క. నాగార్జున గిరిఘీంకృతి
తోఁగొనిమాచర్లకేగి § దొరలదురమునఁ
ద్యాగమొనరించియచ్చటి
బాగగుదుర్గంబభీతి § ఫణితిఁగొనియెఁ. 22

క. విచ్చలవిడిబాహుబలం । బచ్చువడఁ నేలకోట § యనుపురమందుఁ
గొచ్చెర్లకోటలోఁదన । కచ్చిరులమర్చిబలని § కాయముతోడఁ. 23

సీ. అద్దంకిజయమొంది § యమ్మనబ్రోల్బొంది
కందుకూరిని జెంది § కంభమంది

తంగెడహరియించి దరిశిసంపాదించి
కారెముపూడినిఁ బేరుగాంచి
దూపాడుకాకర్ల దోపిడికై సొచ్చి
గురజాలపొదిలలఁ గొలుపుచ్చి
కేతవరంబుని క్షితిమెయినదల్చి
సకలరాజన్యప్ర చయముగెల్చి.
తే-గీ. బెట్టిదంబగుతనసత్తు వట్టిదెసల
నుట్టిపడవడి నడిదంబుఁ బట్టియొరుల
గొట్టిభువినెల్లయాజగ జెట్టిచేతఁ
బట్టుపడునంచు జనులాడఁ బట్టుపట్టె. 24
శా. శుండాలప్రతిమానభీకరరవ స్ఫూర్తిన్ మహీమండలా
ఖండంబెల్లఁగలంగసైనికకర గ్రస్తాయుధోగ్రద్యుతుల్
చండార్కప్రభ గ్రమింగధూళిపటలా చ్ఛాదాభ్ర మొప్పంగదాఁ
దండెత్తెన్ వడి కొండవీటిదెసకై దంభోళిమాత్రాసియై. 25
చ. ఇదివెలుగోటితిమ్మన శుకీంద్రియశోధకమాటనాతడున్
ముదమునవాహినీనివహ ముఙ్గొనియుద్ధగ భీరవాక్యసం
పదమెయి నేరినన్నెదిరి పాఱకదీరకఁ దక్కవారిలన్
పదుగురినూటివేవురినిఁ బాపుదునొక్కఁడ నంచునిల్చినన్ 26
చ. అటుచేనురాయరావునుది శాష్టకవారణ కర్ణపాటనో
త్కటముగభేరిమ్రోయలయ కాలునిప్రక్రియ రౌద్రమూర్తియై
కటకముమీఁదఁదారసిలఁ గన్గొనిభీతిలి తిమ్మనాఖ్యుఁడే
నెటులను తాళఁగొందునిక నీతనిబారికి నేరిఁ జేరుదున్. 27

## కొండవీటి దుర్గము రాయరావు స్వాధీనంబగుట.

చ. అనిమదిశౌర్యమేదికల హంబొనరింపగరాదుప్రాణముం
డినబలుసాకులందినెద లెమ్మెటులైనను సంధివేడుకొం
దనుకొని తెల్పరావునది యాపరహాల్ పదివేలనిత్తునం
చనియొకసంచినంపముద మందుచుఁ జేకొనెఁ దిమ్మనాఖ్యుడున్. 28

వ. ఇట్లు తిమ్మభూపాలుండు వరహాలనంచి నతి గోప్యంబునఁ బుచ్చుకొని రాయరావును దారసాహసంబునకుబ్బుచుఁ బదునేనునూర్ల రెండవ ౧౫౦౭ దగు విక్రమనామసంవత్సర వైశాఖశుద్ధ (౫) పంచమి దివసంబున సమస్తభోక్తసంబులాదిగలుగు దుర్గంబును దేశంబునెల్ల స్వాధీనంబొనర్చి తిరిగియుంజూడకఁ బలాయనంబై యతిరహస్యంబుగాఁ గోశంబు తేరిజూడ నందలి వరాలెల్ల నిత్తడివై యుండుటయు నందులకాత్మ నెంతయు వంతనొందుచు నిల్లినఁ బ్రాణంబుదక్కెనిది యే లక్షవరాలని తృప్తినొందుచుఁ జనియెనిటఁ గొండవీటిదుర్గంబెల్ల రాయరావుకలయం గనుగొనుచు నిట్లని తలంచుచుండె. 29

సీ. ఇదిక దావిజితము కై హేంద్రకిరీటర
త్నప్రభాపాళికి కై దాపురంబు
ఇదిక దావిద్విష కై న్మదవిభేదనచండ
కాండకాండంబుల కై కాపురంబు
ఇదిక దాదుష్టరా కై ట్కృత్యసమ్మారణ
స్ఫుటమంత్రయంత్రంపు కై భూపురంబు
ఇదిక దాసజ్జనా కై హీనాదరణపీఠి
కాపటుమందార కై గోపురంబు
తే–గీ. ఇదిక దాసస్యసంపత్స కై మృద్ధివృద్ధి
ఫలితపరధారుణీస్థల కై భాగభోగ
సతతసన్మార్గసంచార కై జనవితాన
ప్రాపకంబగుకొండవీ కై టీపురంబు. 30

ఉ. ఇందరిఁగెల్చి దేశముల కై నిన్నిటిఁజూచితి నిట్టివె భవం
బెందులగాననై తినిక కై నెట్టులనుండునో తిమ్మనాహ్వయుఁ
డిందులఁబంచినట్టిఘను కై డేలెడు దేశము దానిగెల్వకే
యుందు నెమద్భుజాబలము కై హుమ్మనసాధ్యము గాకయుండునే. 31

చ. అనిమది నెంచియెంచితుద కై కంతటఁదృప్తినిఁ జెందియచ్చటన్
ఘనతరసింహపీఠమునఁ కై గౌతుక మొందుచుఁ గొల్వుదీరితా

ననుపమలీలనేలెఁబదు శ నైదుశతంబుల పైననాల్గుహా 1504
యనముల దాక భూజనము శ హాయిగసంతస మొందుచుండఁగన్. 32

సీ. పుష్పభూజంబులు శ బుష్పించె బుతువుల
ఫలవృక్షజాతంబు శ ఫలములిచ్చె
సస్యముల్ బండెను శ సంపూర్ణవైఖరి
ధేనువుల్ బితికెను శ దృప్తితీర
వర్షముల్ కురిసెను శ వలసినయపుడెల్ల
జారచోరాదుల శ పేరుమాసె
దుర్ణయభీతులు శ తొలగెనుతమతమ
ధర్మముల్ జనములు శ తప్పకుండె

తే-గీ. కలహమను మాట లెచ్చటఁ శ గానరావు
భయమనెడుపలుకెన్నడుఁ శ బ్రజలువినరు
రాయరావేలు వేళను శ రాజ్యమందు
బ్రభువుగుణములు రాజ్యంబ శ పలుకుఁగాదె. 33

వ. ఇట్లేలుచు 1505 వ శకవర్షంబునందు. 34

తిరిగి రాయరావు హైదరాబాదేగుట.

శా. ఆమీరాదనచందముల్ పతికినా శ ద్యంతంబుఁ దెల్పంగనీ
భూమిం బాలన సేయనొక్కరునిసం శ పూర్ణప్రతాపోన్నతున్
బ్రేమన్ శిల్పినితాంతసంతసమెదన్ శ బెంపొందగొల్కొండకున్
సామంతుల్ వెనువెంట రాజనియెనా శ శావిశ్రమఖ్యాతుడై. 35

వ. ఇట్లుచని యాస్థానంబు జేరి యచటి మర్యాదలఁ బ్రభుదర్శనం బొనర్చి వారిచేమన్ననలంది తనవృత్తాంతంబు సాంతంబుగా దెలుపుటయు నాతండును నత్యంతకుతూహలస్వాంతుడై రాయరావునకు బెక్కు బహుమతులొసంగి సాదరంబునఁ బ్రోచ్చియెత్తి మనగెల్చిన దేశం బెల్ల నేకఛత్రాధిపత్యంబుగా సమగ్రధర్మమార్గాను వర్తియగునట్లు చట్టంబులం దిట్టపరుపుచునీవిందు లనయుండుమని రావును వేడుటయు

* రాయరావువలనఁ కొండపీటిలోనుంచబడిన ప్రభువు ౧౫౦౫ లు ౧౫౧౭ వరకేలెను.

నతడు తత్ప్రకారంబుగాచేసి గోలకొండపురంబునఁగలనిబంధనలెల్ల నిచ్చటనూజరుగు చుండుటకును. కొండవీటిగోపినాథపురంబును పూర్వమువలె మృత్తుజానగరని వాడుటకును, బారాముత్సద్దీల నేర్ప రచి వారీపురంబున దినదినంబు కచెహరిసేయుచుండుటకును గొండ వీటిప్రభువునకు హుకుములనిపి సకల రాజకీయవ్యవహారములందును సర్కారుమృత్తుజానగరని బిరుదాంకంబు మొదలలిఖింపుచుండుటకు నాజ్ఞయిడి వినుకొండ బెల్లముకొండ మాహియతుకూడ నిచ్చటను జరుగునట్లుగా నుత్తరువుజేసి రాజ్యంబులు విభాగంబులజేసి పాలనం బు సుకరంబై ప్రజలు సుఖావాప్తినొందునట్లుగావించె నెట్లనిన. 36

పదునాల్గు సముతుల క్రమము.

సీ. కొండవీటిసీమ ‡ నుండుగ్రామంబులు
పదునాల్గుసముతులఁగ్రించెనిట్లు
పాలడుగునుప్రత్తి ‡ పాడునూతక్కియు
పొన్నూరుశ్రీకూచ ‡ పూడిసంత
రావూరుపులివర్రు ‡ రావిపూడియుమును
గోడుగుంటూరుచే ‡ బ్రోలుతాడి
కొండనాదెండ్లయు ‡ దండిమంగళగిరి
పురములు సముతులై ‡ పొలుపుమిగుల
తే-గీ. భాగములఁజేసితన్ముఖ్య ‡ పట్టణముల
సముతుదారులునివసించి ‡ సంతతంబు
పాలనమొనర్చుచునుశిస్తుఁ ‡ బంపుచుండ
హుకుములనుఁబంపెగోల్కొండ ‡ నుండియిటకు. 37

వ. మఱియు నీదేశంబు కర్ణాటక ప్రభుత్వంబుననుండు నెడలఁగొండవీ టిజిల్లాకు హుజూర్ నాయకరంకోట ఖిల్లేదార్ మొదలగు బిరుదాంకి తులై ప్రభుత్వంబు వడసిన కన్న మాణిక్యారావు వారికి సరిదేశముఖి మన్నెవారనియును, మానూరివారికి జమీన్దార్ మజుందార్ వారనియునుం గితాబుల నొసంగి నాదెండ్ల సముతునఁగల పదు

నాల్గుగ్రామములకు నలబోతువారనుకమ్మవారు చౌదర్లైపాలింప నియమించి తానొనరించిననిబంధనలెల్ల స్థిరంబులై యుండునట్లు శాసనంబుల బ్రచురించియుండె నంత. 38

శా. అశ్రాంత స్తవనీయపండితజనా ¤ ఘూస్థానభాస్వ్వండు ది
గ్విశ్రాంతప్రతిమానహీనవిలస ¤ ద్విఖ్యాత పూర్ణుండు రా
జ్యశ్రీసంతతరక్షణోప మితభూ ¤ జాకాంతుడాయుఃప్రలం
బశ్రేష్ఠుండునబాబుహాజ్రతుమహా ¤ మ్మాద్ పాదుషాగారిలన్. 39

చ. అతులితమోదదాయకమ ¤ హావిభవోన్నతుఁడౌచు దేశమున్
దతబలవాహినీనివహ ¤ దర్పమెలర్పడఁబ్రోచుబూన్కిఁబ్ర
స్తుతతపనీయవేశ్మమయ ¤ శోభితమైతగుగోలకొండను
న్నతమణిపీఠమెక్కెనుజ ¤ న స్తవనీయయశఃప్రకాశుఁడై. 40

తే-గీ. కొండవీటిదేశము నేలు ¤ చుండుమన్నె
లిచటయేలికమాఱిన ¤ యెత్తిఱింగి
తమరుస్వాతంత్రులగుటకు ¤ సమయమదియ
యనివసూల్ చేసి శిస్తుల ¤ నంపకున్నఁ
వీరిఁగూఱిచిపాదుషా ¤ గారురోసి. 41

## ఆమీను ముల్కుకథ.

చ. పనిచె నమీను ముల్కనున ¤ బాబునునొక్కనిఁ గొండవీటిసీ
మనుగల దుర్మదాంధులగు ¤ మన్నెలగర్వమడంచి భూమి నె
మ్మనమునఁ బ్రోవగానతడు ¤ మంగళతూర్యములుల్లసిల్లగాఁ
బనివినెఁ గొండవీటికిరు ¤ పార్శ్వములన్ స్వజనుల్ మెలంగగన్. 42

క. పదివేల్హాయుములుభటులిరు
పదివేవురఁ గొనిపదేను ¤ వందలపదమూ 1513
టఁదగుఖరజ్యేష్టపుందొలి
తదియనుఁదాఁగొండవీటఁ ¤ దనరెనుప్రభువై. 43

క. మునుకోమటి వేమన క
ట్టినదై తగు ముల్లగూరు ¤ ఢీకొనఁజని నం

దనయేడున దానిని నా
శనమొనరించెను తెనుంగు । జాడలుబోవన్. 44

చ. అటభుజశౌర్యసాధితజ । యప్రమదాగ్రహణంబు వేళనా
బెటపెట లాజలుంబలెవి । భీషణరోషకషాయితేక్షుఁడై
కటకములేలుమన్నెలను । గర్వితులన్ నిజకార్యకాఙ్క్షలన్
బటుతరభాతిఁ ద్రవేల్చెనన । పాయసుఖావహ సూచకంబుగన్. 45

వ. ఇట్లు ప్రవేశించి తనయువక్ర విక్రమంబున సకలమన్నె భూపాలు
రవంచికప్పంబులం గొనుచు విజయంబు గైకొని పాలనంబు సేయుచు.

సీ. తనపేరునిల్వఁప । త్తనమొండునిర్మించి
దానికమీనుబా । దాయనంగ
నభిధానమొసగి తా । నాపురంబును రాజ
ధానిగాఁగావించి । దానిచెంత
హాతమైనముల్లగూ । రగ్రహారంబును
యాబలూరనుగ్రామ । మందుగల్పి
కొంచెపుఁ దప్పల । కునుగొప్పశిక్షల
నిడుచుఁ బూర్వపువిధు । లెల్లఁ జెఱచి

ఆ-వె. యేలెఁగొండవీటి । నెల్లసీమలమహా
బలుడనంగలోక । ములబొగడ్త
వరలఁగఁబదియైదు । వందలయిరువది 1520
వరకునిల్లెనిమిది । వత్సరములు. 47

శిఖివసుఖానుడు ప్రభువై వచ్చుట.

క. అంతటఁగోల్కొండసభా
భ్యంతరమునసుండి యిచటి । కరుదెంచెను సు
స్వాంతుడుశిఖివసుఖానుడ
నంతవిభవమెసగనిచటి । కధిపతియగుచున్. 48

చ. అతడరుదెంచి పీర్కఁగోలు । వైబలువైభవమొప్పఁబూర్వప
ద్ధతుల నమీనుబాదునము । దంబునసిల్చితదీయయామ్యమం

దతులితమైనపట్టణము ఽ నాతనిపూర్వులపేరువెట్టి ది
వ్యతరముగఁ సృజించివిపు ఽ లాంకితమిచ్చెకుతుబ్షపేటనాఁ. 49

క. కోటకు దక్షిణమునఁగడు
దీటుగగోల్కొండనేలు ఽ దిట్టనిపేరఁ
మేటిమహమ్మదు పాదుష
పేటనసృజియించి యేలెఁ ఽ బెంపుతలిర్పఁ. 50

వ. తదనంతరంబునం గోల్కొండ రాజ్యసింహాసనాధ్యులగు నటఫర్ ఖానుడును అబ్దుల్లాహసఁ తానిషాయును అలంగర్ పాదుషాయును అనుప్రభుత్రయంబు పాలించిరాపాలకులకాలమున నిచటి కరుదెంచి రాజ్యంబేలినయమీను లెవరనిన. 51

క. మొదలను ఫరాసుఖానను
సదయుండ రుదెంచియేలె ఽ సౌఖ్యంబొప్పఁ
బదునేనిరువది యొక్కటి 1521
మొదలిరువదిమూఁడువరకు ఽ మూఁడేండ్లంతఁ. 1523 52

క. అబుశిద్దీ బివులర్ సా
హిబనగనొకప్రభువువచ్చి ఽ యేలెనుకృపమీ
ఱఁబదేనునూర్ల యిరువది
కిఁబయినినాలుగవయేఁడుకీర్తి సెలంగఁ. 1524 53

తే-గీ. అంతనసరసుఖానుషా ఽ యరుగుదెంచి
రత్నసింహాసనస్థుడై ఽ రాజ్యమేలె
నిచటఁబదునేనువందల ఽ యిరువదైదు 1525
మొదలిరువదేడువరకును ఽ భూరికృపను. 1527 54

క. తదుపరియకలస్ ఖానుం
డదురితగుంటుపలిముత్త ఽ యయుఁబదునేని
ర్వదియెనిమిది మొదలుగ ము 1528
ప్పదిమూఁడువరకు నునిచటుఁ ఽ బాలించిరొగిఁ. 1533 55

వ. అందు యకలసుఖానుండి పుటభేదనంబున 1534 వ యేటస్వతహా

గాలమీానుగా నుండి పురమునకు నుత్తరపార్శ్వంబునంగల నొకచిన్న తిప్పపైని పూర్వంబున రెడ్డిభూపాలురు నిర్మించిన విఘ్నేశ్వరాలయంబు పూజా విధానంబులు లేకుంటయు నందలి విగ్రహంబు భిన్నంబుజేసి తదాలయంబునకు వలయంబుగా నొక్క పట్టణంబు గట్టించి 'హజాజుగణేశుపేట' యని నామంబిడి సకల వైభవంబున బాలింపుచుండెనంత. 56

ఆ—వె. అటకుముక్తిఖాను నడథిపుడై జనులు మే
లౌనటంచునన బదేనునూర్ల 1535
ముప్పదైదు మొదలు ముప్పదేడువరకు 1537
నేలెనేండ్లు మూడు హితసమృద్ధి. 57

క. జూపల్లి వంశపావను, డైపరగెడురంగరాయు నాత్మజుడఖిల
వ్యాపారజ్ఞుడునృపతుల, ప్రాపుననరుదేరెరంగ పతిరావిటకుఁ. 58

మిరియాలచట్టుపైబురుజుగట్టుట.

వ. ఇట్లువిచ్చేసి కొండవీటి పురపీఠస్థుండై యేలుచుండి. 59

సీ. ఈపురంబునకునై ఋతిభాగమునఁగల
విపులస్థలముగాంచి విమలభక్తి
కనకహార్మ్యోన్నత ఘనతరప్రాకార
జాలభాసురదేవ తాలయంబు
నమరించి రంగనా యకులఁబ్రతిష్టించి
నాదెండ్లత్రోవనుఁ బాదువడిన
జయవిజయులఁదెచ్చి శౌరిమోఁలనునిల్పి
యాలయానకువల యంబుగాగ

తే—గీ. నగరముసృజించి శ్రీరంగ నగరము † నగ
నంకితమొసంగిహిందూమ తానుచార
వర్తనలనెల్లఁగాపాడి బ్రాహ్మణులకు
నిత్యదానంబులిడుచుండె నియతితోడ. 60

† రంగపతిపేట యని మొదట పేరుపెట్టెను.

చ. అగమునఁ గోటకుఁ శ్వసను ǂ నాశయమందునగమ్యమై ఖరిఁ
దగుమిరియాలచట్టనును ǂ దగ్రశిలఁ బురుజొండుఁగట్టిబల్
పగరవధింపగల్గినతు ǂ పాకిఫిరంగులుమందులాదిగా
మిగులబలంబునుండనియ ǂ మించెజనుల్ మిరియాలబుర్జనఁ. 61

తే-గీ. అతఁడుసత్యవ్రతాచారు ǂ డగుచువేడ్క
బరగపదునేను నూర్లము ǂ ప్పదియెనిమిది 1538
మొదలుపదునేనునూర్లనల్ ǂ బదివరకును 1540
మూడువర్షముల్ పాలించె ǂ ముదముమీఱ. 52

వ. అంత గోలకొండ పురసింహాసనంబునకు నబాబుమబారత్ ఖానుండు వచ్చి యేలుచు నీదేశంబునంగల సకల జమీందారులన్నఁ బిలిపించి కొండవీటి రాజ్యంబునకు సానరాలురుసుములు ముట్టుచుండు క్రమంబునిర్ణయించె నంత ఆఫ్జాల్ నబాబు నిజామల్ ముల్కు బహాదర్ గారి తరపుననఖుజ్జాబహాదరుల్లా మొహాతర్ ఖానుండును, బాలకృష్ణాహ్వాయప్రభుతులగువా రమీనులుగావచ్చి యీస్థలంబును శా॥శ॥ 1541 మొదలు 1671 వరకుఁ బాలించుటయును. 63

ఉ. అంతనితాంతబాహుబలు ǂ డంతవిహీనపరాక్రమాఢ్యుడ
త్యంతమహోగ్రవిగ్రహుదు ǂ రాగ్రహనిగ్రహవైరివారణా
శాంతుడునాగఁ జెన్నలరు ǂ సాహెబుదాదనబాబుగారుదై
త్యాంతకు లీలగ్రాలఁదన ǂ రారెనుహైదరబాదనాథుడై 64

వ. అట్టియెడ. 65

### నాజరుజంగుకొండవీటిదేశము ప్రొన్నువారికిచ్చుట.

చ. సదయుడుఁదన్నుపాత్రజుఁడు ǂ సాహెబునాజరుజంగుకొండవీ
డ్వాదలెఫరాసువారికిన ǂ పారమతిఁ బదియారునూర్లడె
బ్బదిపయిరెంటవారచటఁ ǂ బాలనచేసిరి యంతనుండి సం
పదలొదవంగనైదిటికి ǂ పైనశరద్వయ(7)మొందుకాలమున్. 1672

వ. అంత నానాజరుజంగునకనుజుండు. 1679

## కొండవీటిసీమ మరల తురష్కులకువచ్చుట.

భుజంగప్రయాతము.

నిజాముల్లి గోల్కొండ నేతృత్వమొప్పన్
అజేయుండనన్ మించి యాసీమకంపెన్
ప్రజల్ జిల్లెదార్ నాగఁ బాలింపుచుండన్
రజా లేరుఖానున్ వి రాజత్ప్రధానున్. 68

క. అంతటమనుష్ఠురుజంగున
నంతరమున శాంతయుతుఁడు యతుదావుత్ ఖాన్
సంతసమునవచ్చిరియ
త్యంతధృతిన్ జిల్లెదారు నధికారమునన్. 69

వ. అంత. 70

చ. వరకరుణాంతరంగుఁడురు వైభవసంగుఁడు భాసురాంగుఁడున్
పరనృపశృంగభంగుఁడున బాబుజనాలతుజంగుసంపదల్
వరలగ గోలకొండపురి పాలనసేయుచుఁ గొండవీటిభూ
భరభరణోన్నతిన్ దనరఁ బంపెన వార్యపరాక్రమాఢ్యులన్ 71

వ. వారెవరనిన. 72

శా. రాజానుగ్రహశోభితుండుఁ బటుధై ర్యస్థైర్యగాంభీర్యుఁడౌ
రాజాబల్వతుయింద్రభేత్తునుఁద్రిదు ర్గప్రాజ్యసామ్రాజ్యుఁగా
రాజత్తైదువతుల్లఖానునిసుధీ రగ్రామణిన్ కొండవీ
టీజిల్లాకొక జిల్లెదారునిగథా టిన్ బంపవారున్ వడిన్. 73

వ. తదాజ్ఞానువర్తులై నిజకార్యనిర్వాహకత్వంబున నెగడుటయు ననంత
రంబున నీసీమయెల్ల ముశలాముష్టిఫీలుముగ బాదావారికి స్వాధీనం
బగుటయును. 74

ఉ. ఆదొరలీస్థలాధిపతులై తనరారిని తాంతనిస్తులా
హ్లాదమెసంగఁ బెల్లురికు లాభరణుండగు రామయాహ్వయుం
డాదియమాత్యుఁడై యలర నచ్చటరాజ్యము నేలిరెంతయున్
మోదమునన్ ప్రజల్ తగన ముజ్వలకీర్తినిఁగొంత కాలమున్. 75

క. అసదుల్లాఖానుండను
ముసలమనునబాబుయీవి భునివెన్కను సం
తసమొదవంగ నుఁగరుణా
రసుఁడగుతాతద్దిఖానుఁ బ్రభులైరంతన్ 76
తే-గీ. వరయశోవిహారుండుధీ వరసుదారు
డంతసైదువత్తుల్లఖాన్ హాజరతతని
వెనుకనటఫరుజంగునీ విభునిపిదప
బహాదరెఖలాసుఖానుఁడుఁ బ్రభువులైరి. 77

కొండవీటిసీమ కంపెనీవారికివచ్చుట.

శా. అంతన్ బద్ధజపుష్కరాద్రిశశిసం ఖ్యన్ బొల్చువర్షంబునన్ 1709
సంతోషంబునఁగొండవీటిధరణీ శత్వంబునన్ వచ్చిరెం
తేంతేసత్వగుణప్రధానులగువా రీస్టిండియాకంపెనీ
కాంతుల్ హూణమహామహీశులులస త్కారుణ్యసింధుల్ బుధుల్.
సీ. సకలకళావిశే షంబునభువనంబుసకలకళావిశే షంబుగాఁగ
విపులధర్మగుణాభి వృద్ధిచేలోకంబువిపులధర్మగుణాభి వృద్ధిగాఁగ
మదవారణాదికమహిమచేరాష్ట్రంబుమదవారణాదికమహిమగాఁగ
భూరివిభవపరి పూర్తిచేతజగంబుభూరివిభవపరి పూర్తిగాఁగ
తే-గీ. సేతుశీతనగాంతర క్షితితలంబు
నెల్లనార్జించివైరులు ద్రెళ్లమించి
మేలొసగునిండియాగవ ర్మెంటనంగ
బిరుదులువహించిజనులఁబల్ ప్రేమఁగాంచి. 79
సీ. హిందూమహీజనుల్ హితమతివర్తింపసివిలురివిన్యూమే జిస్ట్రేటనఁగ
ద్రివిధంబులగుశాసనవిధానములొనర్చి యేలురాజ్యంబుజిల్లాలుజేసి
జిల్లాకలెక్టరు క్షేమంబరయనుంచిరక్షశిక్షాధికా ర్లనుఘటించి
సకలమతాచార సంరక్షణవహించిపక్షపాతంబను పల్కుడంచి
తే-గీ. బహుళరాజసభామంట పములుగట్టి
జీర్ణకాసారములఁబున స్సృష్టిజేసి

పలునదీనదములఁబథం ౯ బులుసృజించి
యేలుచుండిరి శాశ్వత ౯ శ్రీలుదనర
నేలుతరమావిభుడువీరి ౯ నెల్లకడల. 80

ఫలశ్రుతి.

క. ఇదికొండవీటిచరితము, చదివెడువినువ్రాయునట్టి ౯ జనులకుఁగడుసం
పదలాయుర్వృద్ధియశో, విదితముశ్రీకొండవీటి ౯ విభుడిమతఁగృపన్. 81

క. అనుచుసునాశీరునకతి, వినయంబెనయఁగ ద్రిలోక ౯ విదుఁడగువనజా
సనమానసతనయుండొగి, వినుపించెను కొండవీటి ౯ విభుచరితంబున్.

గ్రంథసంపూర్తిపద్యము.

క. పదునెనిమిదివందల యి (శాలివాహనశకం) 1822
ర్వదిరెండవవర్షమునఁబ ౯ రగుశార్వరినె
న్నిదవనెలకృష్ణపక్షపు
విదియగురుదినమునఁ బూర్తి ౯ వెలసెహరికృపన్. 23

ముక్తపదగ్రస్తము.

మ. ప్రతిపక్షోత్కరవార వారణశుభ ౯ ప్రారంభరంభావిభా
సితగోపీసుకుమారమార విలస ౯ త్సేత్యాదికృత్యాప్రజ్ఞప్రా
జ్ఞతతాభీప్సితదాన దానవముఖ ౯ గ్రావస్ఫురద్వజ్రవ
జ్రతతిప్రాంచితహారహారభరధ ౯ రచ్ఛేదనప్రాభవా. 84

క. భక్తహృత్కమలభృంగా, నక్తంచరమదవిభంగ ౯ నాళీకాంగా
ముక్తిప్రదాంతరంగా, సూక్తిమయానుప్రసంగ ౯ సుగుణోత్తుంగా.

మంగళమహాశ్రీవృత్తము.

మంగళమహీనశుభ ౯ మండితసుమాస్త్రనిభ ౯ మంజులతరామలసురూపా
మంగళమఖండసుర ౯ మండలనుతాంఘ్రియుగ ౯ మాధవరమాహృదయ [లోలా
మంగళమనుగ్రహస ౯ మగ్రహృదయానిరుప ౯ మానతపనీయమయచేలా
మంగళమిభేంద్రహిత ౯ మానిజననిష్కలుష ౯ మానసనిరంతరనివేశా.

గ ద్య.

ఇది శ్రీమజ్జగత్ప్రాణతనయ వరప్రసాదలబ్ధ కవితా సంకలి తాపస్తం
బసూత్ర కౌండిన్య సగోత్ర పవిత్రవి విధ విద్వన్ముఖ
సరోజాతమిత్ర మద్దులపల్లివంశ దీపక వేంకట
ప్పయాభిఖ్యత నూజాతక సుకవి
జనసేవక గురు బ్రహ్మానా
మకవిరచితం బగు శ్రీ
కొండవీటి చరిత్రం
బునందుసర్వం
బును చతుర్థాశ్వాసము
సంపూర్ణము.
శ్రీ శ్రీ శ్రీ

# తప్పొప్పులపట్టి.

## ప్రథమాశ్వాసము.

☞ ఈక్రిందిపద్యము 4-వ పేజీలో 13-వ నెంబరునున్న పద్యమునకు బదులుగా వేయబడినది.

క. ఏనేవిద్యయు నెఱుఁగక, నానేర్చుకొలంది వ్రాసి ♦ నాడను పేర్మిఁ
దీనఁగలతప్పులెల్లను, బూనిక్షమింపంగనెల్ల ♦ బుధులనుతింతుఁ. 13

| పుటసంఖ్య. | పద్యసంఖ్య. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 7 | 35 | కాలయీరీతి | కాలమీరీతి |
| 9 | 47 | ఖ్యాతంబుయొప్పు | ఖ్యాతంబులై యొప్పు |
| | 50 | ఖర్య | ఖర్వ |
| 10 | 54 | యాహ్వాదయుండు | యాహ్వాయుండు |
| 15 | 79 | నైబుతిక్షోణీభా | నైబుతిక్షోణిభా |
| 16 | 84 | మూర్తివ్రయంబు | మూర్తిత్రయంబు |
| 19 | 98 | నపర్వత | నప్పర్వత |
| | 102 | బెంపలరు | బెంపొదవు |
| 24 | 124 | నకలాగమ | సకలాగమ |
| 30 | 149 | దరమానళ | దరమాగళ |
| 34 | 171 | ట్లు | వ. ఇట్లు |

## ద్వితీయాశ్వాసము.

| | | | |
|---|---|---|---|
| 52 | 64 | చుటఁయనంత | చుటయుఁనంత |
| 56 | గర్భమత్తేభము | పావిత్రిదళ | పాలిత్రిదళ |
| 80 | 181 | అచ్చరలచ్చెరుందవిలి | అచ్చెరలైనమెచ్చువడి |

| పుటసంఖ్య. | పద్యసంఖ్య. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 82 | 190 | జగదంజ | జగదంబ |
| 83 | 194 | ప్రభాధిపు | ప్రభావాధిపు |

తృతీయాశ్వాసము.

| | | | |
|---|---|---|---|
| 86 | 6 | ననగదవెడు | గనగదగెడు |
| | 9 | నిలయాదిప | నిలయాదివ |
| 88 | శాసనము 4 వ పఙ్క్తి | పాతనాటి | పాఁనాటి |
| 96 | 57 | మ్రొయినిగజ | మ్రొయినిగర్జ |
| | 58 | నడలుండై | నిటలుండై |
| 99 | 11-వ పఙ్క్తి | వదనంబులు | గళంబులు |
| | 12 | నళినంబులు | శంఖంబులు |
| | 14 | ననరదంబులు | నయరదంబులు |
| | 22 | | సారథులును |
| | 27 | లాలానుషంబై | లాలానుషంగంబై |
| 104 | 92-6-వ పఙ్క్తి | వార్లు | వారు |
| 105 | 90-2-వ పఙ్క్తి | యబ్ర | బ్రయ |
| 115 | 113 | నియోచించి | నియోగించి |

చతుర్థాశ్వాసము.

| | | | |
|---|---|---|---|
| 121 | 4 | యొక్కాణింపగరాని | వక్కాణింపగరాని |
| | | సైనికులతోనుద్యత్కరీం | సైనికులతో వాజి |
| | | ద్రాళితో | ద్విపశ్రేణితో |
| 137 | 84 | సత్సేత్యాది | సత్సేత్వాది |

